FIRST EDITION - 5000 COPIES : PRINTED - Dec. '58

# THE MAN OF EVEREST

*(An Auto-Biography of Tenzing of Everest)*

TENZING NORGAY
&
JAMES RAMSEY ULLMAN

*Translated by :*
Sri BELLAMKONDA RAGHAVA RAO

*Price Re. 1=75*



**GEORGE G. HARRAP & COMPANY, Ltd.,**
*182, High Holborn London, W. C. I., England*

దక్షిణభాషా పుస్తక సంస్థ సహకారమున ప్రకటితము

# పీ ఠి క

ఎవరెస్టు శిఖరానికి ఎక్కడంతో టెన్జింగ్ అలంకారికంగానూ, వాస్తవంగానూ ఆకాశంయెత్తు పెరిగాడు. నిజానికి సర్వ సామాన్యుడుగా జన్మించి చరిత్రాత్మకంగా ప్రపంచౌన్నత్యాన్నీ, ప్రఖ్యాతినీ గడించిన మొదటి ఆశియాఖండవాసి టెన్జింగ్. అతడు ఒక సామాన్యవ్యక్తిగా ఎవరెస్టు ఎక్కాడు. ఒక మహావీరుడై దిగి వచ్చాడు.

ఎవరెస్టుకు ఎక్కిన ఇరువురిలో టెన్జింగ్ హ్రస్వమూర్తి అనుకుంటారు. అది వాస్తవంకాదు. హిల్లరీవంటి అజానుబాహువు ప్రక్కన అలా కనబడవచ్చు. కాని టెన్జింగ్ అయిదు అడుగుల ఎనిమిది అంగుళాల ఎత్తున మధ్యరకంలో మంచి ఒడ్డు పొడుగు కలిగిన మనిషి. అంతరంగికంగా కూడా అతనిలో హ్రస్వత్వం లేదు. పర్వతవాసుల్లోనూ కర్షకుల్లోనూ సామాన్యంగా కన్పించే సంకుచితత్వమూ బిడియమూ స్వస్థానాభిమానమూ అతనిలో బొత్తుగాలేవు. కొంతవరకు షెర్పాజాతివారంతా ఈ విషయములో టెన్జింగును పోలినవారే. నాగరకంగా షెర్పాజాతి ప్రాథమికదశకు చెందింది. షెర్పాభాషకు లిపి లేదు. ఆ కారణంచేత దాదాపుగా అందరూ నిరక్షరాస్యులే అనవచ్చు. కాని ఒకపనిలో ప్రత్యేక నైపుణ్యంకలిగి బయటి ప్రపంచంతో దీర్ఘసంపర్కం సంపాదించుకోవడం చేత షెర్పాలు హిమాలయ పార్వతేయులలో అగ్రస్థానం వహించారు. ఆ జాతిలో అగ్రేసరుడు టెన్జింగ్. అతని స్వరూపం అందమైంది. అతని స్వభావం సాధువైంది. అతని ముఖం చక్కని కదలిక కలది. అతని చూపులు తేటగానూ చురుకుగానూ వుంటాయి. అతని మాట, నవ్వు, మనసు అన్నీ చురుకుతనం కలవే. అతనిలో ఎంత సాధుత్వ మున్నదో అంత తేజస్సుకూడా వుంది. అతనిలో ఫలానిదని చెప్పరాని ఒక విశిష్ట లక్షణం వుంది. టెన్జింగ్ "హిమాలయ పులి" అన్న బిరుదానికి అన్నివిధాల అర్హుడు.

—జేమ్స్ రాంసే ఉల్మన్

## ACKNOWLEDGMENTS

Acknowledgement is due to the following for the photographs in the book as shown below :-

Facing page 16- Royal Geographical Society and Alpine Club of Great Britain.

Page 24 H. W. Tilman.

25 Royal Geographical Society and Alpine Club of Great Britain.

32 Films de France.

33 Ewing Galloway, New York.

108 Swiss Foundation for Alpine Research, Zurich.

109 Swiss Foundation for Alpine Research, Zurich.

176 Swiss Foundation for Alpine Research, Zurich.

177 Above Royal Geographical Society and Alpine Club of G. B.

,, Below Swiss Foundation for Alpine Research, Zurich.

192 Above : Royal Geographical Society and Alpine Club of G. B.

,, Below : Peter Jackson.

193 1] R. G. S. and Alpine Glub of G. B.

2] Swiss Foundation for Alpine Research, Zurich.

3] R. G. S. and Alpine Club.

4] Peter Jackson

208 Above : Studio Everest, Calcutta.

Below : United Press Photos.

224 Rebecca Franklin.

225 Above : Guido Tonella.

# ప రి చ య ము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప జేసింది ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలూ వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహా పురుషులు ఏమి చేసినదీ, వారికి తా మెంత ఋణపడిఉన్నదీ, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినదీ ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం- ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలూ ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందుముందు విస్తారప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణభారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపర లోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధ విషయాలను

గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణభాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7—10—'58

ఇట్లు :
ఎ. లక్ష్మణస్వామి ముదలియార్,
వైస్ ఛాన్సెలర్, మద్రాసు విశ్వవిద్యాలయం.

# ఉపోద్ఘాతము

మహోన్నత పథాలంటే మొదటినించి నాకు చాలా సరదా. పర్వత శిఖరాన్ని చూచినప్పుడెల్ల నే నా శిఖరంమీదికి పోయి నిలబడి, అవతల ఏమున్నదో చూడాలనిపిస్తుంది. అంతే, నా పర్వతారోహణ కుతూహలం అంతకుమించి ముందుకు సాగలేదు. అయితే, పర్వతారోహణోద్యమాలంటే ఆసక్తిమాత్రం నన్ను వెంటాడుతూనే ఉంది. మనదేశంలో ఉన్నత పథారోహణ ఇకమీదట సాహసికులైన పాశ్చాత్యయువకులకే పరిమితమై ఉండకూడదనే భావంతో, ఆరోహణమనే ఈ అద్భుతక్రీడాసక్తులైన యువకులను నా శక్తివంచనలేకుండా ప్రోత్సహిస్తూ వచ్చాను.

ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన ఈ మంచుబెబ్బులి అద్భుత ఆత్మచరిత్ర ఆసక్తితో చదివాను. నిరుపేద కుటుంబంలోపుట్టి, ప్రపంచ శిరోవతంసమైన ఎవరెస్ట్ పర్వతశిఖరాన్ని అధిరోహించి, మహోన్నత కీర్తి పథాన్నందుకొన్న ఘనుడైన ఒక వీరుని అత్యద్భుత జీవిత చరిత్ర ఈ గ్రంథంలో వివరింపబడింది. ఆశలు, ఆకాంక్షలు, అచలసంకల్పం, దృఢదీక్ష, సహనం, సాహసం, శౌర్యం, వినమ్రత, విధేయత, కారుణ్యం, పరాజయ విజయాలతో నిండిన మనోహరమైన వాస్తవకథ ఇది. ఈ భౌతిక ప్రపంచంలోనేకాదు, మానవ జీవితంలోని సర్వ రంగాలలో మహోన్నత శిఖరాలను ఆరోహించాలనే ఆసక్తిని నేటి యువజనులలో ప్రేరేచగల గ్రంథ మిది.

ఒకానొక నిరుపేద షెర్పాబాలుని దశనుంచి, క్రమంగా తన జీవిత మేవిధంగా మారుతూ వచ్చినదీ టేన్జింగ్ ఈ ఆత్మకథలో వినమ్రభావంతో వివరించాడు. తన కుటుంబ సమస్యలను, ఉదరపోషణకు తా నెంత శ్రమపడినదీ, తనను తన కుమార్తె లిరువురిని సుఖపెట్టడానికి తనభార్య ఎన్నివిధాల కష్టపడినదీ, తన ముదుసలి తల్లిమీద తనకుగల ప్రేమ, ఆమె దీవనలపట్ల తనకుగల విశ్వాసం— టేన్జింగ్ చక్కగా వివరించాడు. ఆయన దైవభక్తి, కష్టాలలోను సుఖాలలోనూ కూడా దైవప్రార్థన ప్రభావాన్నిగురించి ఆయన విశ్వాసం నేడు భగవంతుణ్ణి మరచిపోతూన్న నాగరక యువకులకు గొప్ప గుణపాఠం.

జంతువులపట్ల టెన్జింగ్ దయ, ఆయన మతవిశ్వాసాలు చదువుతూ ఉన్నప్పుడు ఎంతో ఆనందం కలుగుతుంది. మంచుకొండలలో మానవుల కంటబడకుండా తిరిగే "యతి" అనే అద్భుతజీవినిగురించి ఆయన చాలా చిత్రమైన విషయాలు వ్రాశాడు. జీవితంలో సులక్షణమైన విషయాలను గ్రహించి జ్ఞాపకం పెట్టుకొనడంలో టెన్జింగ్‌కు అద్భుతమైన ప్రజ్ఞ ఉన్నట్టు కనిపిస్తుంది. 1948 లో ఇటలీదేశపు పరిశోధకుడు ప్రొఫెసర్ గిఉసెప్పి టక్సితో తాను లాసా వెళ్ళినప్పుడు, అక్కడ టిబెట్ లామాలవద్ద ఆయన నేర్చుకొన్న విషయాలను ఈ ప్రజ్ఞకు నిదర్శనంగా చెప్పవచ్చు. జ్ఞానాన్ని గురించి వ్రాస్తూ—

> "జ్ఞానము విక్రయింపదగిన వస్తువు కాదు,
> అందరికీ ఉచితంగా లభించవలసినది,"

అని తాను లామాలవద్ద నేర్చుకున్నట్టు ఈ గ్రంథంలో వ్రాశాడు. ఉదాత్తమయిన ఈ జ్ఞానవినిమయ సిద్ధాంతాన్ని ప్రపంచమంతా సవ్యంగా అర్థంచేసుకుని, మానవజాతి శ్రేయస్సుకై దానిని అనుష్ఠించాలని నా కోరిక.

టెన్జింగ్ తన పూర్వమిత్రుల నెవరినీ మరచిపోలేదు. తాను ప్రపంచ ప్రసిద్ధ పురుషుడైనా, ఇప్పటికీ ఆయన తన చిన్ననాటి చెలికాళ్ళయిన షెర్పాలను విస్మరించలేదు. వారిలో కొందరు పర్వతారోహణ క్రీడలో అసువు లర్పించారు. మరికొందరు అర్పిస్తున్నారు. "మీరు మోయవలసిన బరువులవంక తలవంచి చూడండి. ఎక్కవలసిన శిఖరాలవంక తలయెత్తి చూడండి," అని వారికి టెన్జింగ్ ఉద్బోధ. ఈ పుస్తకములో వాడిన టిబెటన్, నేపాలీస్ పదాలకు ఆయన వివరణలు ముచ్చటగా ఉన్నవి. ఎవరెస్ట్ పర్వతాన్ని ఆయన "చోమోలుంగ్మా" అనే పిలుస్తాడు. తన విశ్వవిఖ్యాతికి హేతువైన "చోమోలుంగ్మా" పట్ల ఆయన కృతజ్ఞత అపారమైనది. 'చోమోలుంగ్మా' దయవల్లనే నేడు ఆయన, ఆయన కుటుంబం భోగభాగ్యాలతో సుఖంగా కాలం గడుపుతున్నారు. "నా గ్రంథాన్ని నేను ఇంకెవరికి అంకితం చెయ్యాలి! చోమోలుంగ్మాకు తప్ప!" అన్న ఆయన ఆవేశం ఆయనకే తగును.

ఈ కథ చెప్పినతీరుకూడా ప్రశంసనీయంగా ఉంది. ఈ గ్రంథం చదువుతూన్నప్పుడు ఎన్నోసార్లు ఈ మంచుబెబ్బులి ఆ మంచుకొండపైకి ఎక్కుతున్నట్టు, మధ్య మధ్య ఈ షెర్పానాయకుడు తోటి షెర్పాలతో మాట్లాడుతున్నట్టు, సాహసికులైన ఆ పాశ్చాత్య పర్వతారోహణ నిపుణులతో ఆయన చర్చిస్తున్నట్టు — ఇవన్నీ నేను స్వయంగా నా కళ్ళయెదుట చూస్తున్నట్టు, వింటున్నట్టు అనిపించేది. ఆ కొండలమీదినించి పెద్దపెద్ద మంచుబండలు జారడం, అంచులుదేరిన ఆ మంచుగుట్టలు, మంచుకొండలు పగిలినచోట ఏర్పడిన పెద్దపెద్ద నెర్రలు, హిమానీనదాలు మొదలైనవన్నీ నేనూ ప్రత్యక్షంగా చూస్తున్నట్టే ఉంది. తేన్జింగు, హిల్లరీ ఇంక కొద్ది ప్రయత్నంతో ప్రపంచమంతటిలో మహోన్నతమైన ఆ శిఖరం పైన నిలబడబోతున్న ఘట్టంలో వారిహృదయాందోళన, ఔత్సుక్యం ఇంచుమించు నేనూ అనుభవిస్తున్నట్టు అనిపించింది. చోమోలుంగ్మా విజయయాత్రలో ఈ కట్ట కడపటి ఘట్టం చాలా రసవంతమైనది.

తేన్జింగ్ ఏడుసార్లు (షెర్పాలకు 7 అదృష్టసంఖ్య) ప్రయత్నించి చివరికి ఈ విజయం సాధించాడు. అపైన జరిగిన సంఘటనలనుగురించి వివరించేటప్పుడు ఆయన సౌమ్యత, నిరాడంబరత స్ఫుటంగా మనకు కనిపిస్తున్నవి. ఆసియాఖండ మహాపురుషులలో ఒకడైన శ్రీ తేన్జింగ్ ఆత్మకథ మన యువకులను పర్వతారోహణలో ఇట్టి ఘనకార్యాలను సాధించడానికి ప్రోత్సహించడంతోపాటు, మనమందరంకూడా ఉత్తమ ప్రపంచపౌరులముగా జీవించడానికి మార్గదర్శక మవుతున్నది.

ప్రజ్ఞావంతుడైన ఈ యువకుణ్ణి, పతిప్రాణయైన ఆయనభార్యను, వారి ముద్దుబిడ్డలయిన పెంపెం, నిమాలను నేను ఢిల్లీలో 1950 లో, ఆయన ఎవరెస్ట్ విజయానంతరం కలుసుకున్నాను. ఈ గ్రంథం చదివేటప్పుడు నాకు ఇది మరింత ఆనందహేతువయింది. తేన్జింగు ప్రపంచ ప్రసిద్ధ పర్వతారోహకుడవటమేకాదు: సరసుడు, ఉదాత్తుడు.

ఆయన ఆత్మచరిత్ర మన వారందరు, ముఖ్యంగా మన యువకులందరూ చదివి తీరవలసిన గ్రంథం.

26, ఏప్రిల్, 1957 జెనరల్ కె. ఎమ్. కరియప్ప.

# వి ష య సూ చి క



నాకు సొంతమునకే ఒకటి కావాలి

# 1. మంచు బెబ్బులి

నేను అదృష్టవంతుణ్ణి – నాకు ఒక కల వచ్చింది. ఆ కల వాస్తవమైంది. ఎవరికిగాని కలలు వాస్తవం కావడం అరుదు. నాకు జీవితంలో ఒకటే కోరిక : ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కాలని ఏడు సార్లు ప్రయత్నించాను. వెనక్కు వచ్చాను. మళ్ళీ ప్రయత్నం చేశాను. ఒక యోధుడు శత్రువును ఎదుర్కొన్నట్టు గర్వంతోనూ బలంతోనూ కాదు – తల్లి ఒడి మీదికి ఎక్కే బిడ్డలాగా ప్రేమతో చేశాను. నా ప్రయత్నంలో ఈనాటికైనా నాకు జయం కలిగింది. నా జన్మ ధన్యమయింది. షెర్పా భాషలో "తుఝీఛే" అంటారు. అంటే "నేను కృతజ్ఞుణ్ణి" అన్నమాట. కాబట్టి నా కథను "చొమోలుంగ్మా"కు అంకితం చేస్తున్నాను. మా దేశంలో ఎవరెస్టును చొమోలుంగ్మా అంటారు. ఎవరెస్టు శిఖరమే నాకు జీవితంలో సమస్తాన్నీ ఇచ్చింది. దానికి కాకపోతే ఇంకెవరికి అంకితం చేయాలి!

మీకు విచిత్రమనిపించవచ్చు. కాని నాకు ఎక్కువగా ఉన్నవి పుస్తకాలే. చిన్నతనంలో నేను ఒక్క పుస్తకంకూడా చూచి యెరుగను. నాకు వయసు వచ్చి యాత్రలు సాగిస్తూ

వున్న కాలంలో ఆలాంటి పుస్తకాలు వున్నట్టు విన్నాను. వాటిలో ఎన్నో విశేషాలు వున్నట్టు తెలిసింది. నేను ఎంతమంది తోనో పర్వతాలు ఎక్కాను. యాత్రలు చేశాను. వాళ్లలో కొందరు తాము వ్రాసిన పుస్తకాలు నాకు పంపారు. వాటిలో ప్రతిఅక్షరం నేనుచదవలేక పోయినా సంగతులు గ్రహించాను. అవి నాకు ఎంతో ఉపకరించాయి. ఈ నాడు నా సొంత పుస్తకం వెలువడడం ఒక విశేషం నాకు. నా దృష్టిలో, పుస్తకం మనం ఏమి చేసిందీ ఏలాబ్రతికిందీ చెప్పాలి. ఆలాంటిదే ఈ పుస్తకం. ఇందులో వున్నది నా కథ. ఇందులో నేనే వున్నాను!

నేను ఎన్నో ప్రయాణాలు చేశాను. ప్రయాణాలు చేయడం, క్రొత్త దృశ్యాలను చూడడం, వాటిని గురించి తెలుసుకోవడం, అసలు నా రక్తంలోనే వున్నదనుకుంటాను. అది నాకు పుట్టుకతో వచ్చిన లక్షణం. బాల్యంలో సోలో ఖుంబూలో వుండగా ఇంటినుంచి నేపాలు రాజధాని ఖాట్మాండుకు చెప్పకుండా పారిపోయాను. తరువాత ఒకసారి ఆలాగే డార్జిలింగుకు వెళ్ళాను. డార్జిలింగునుంచి – ఇరవై సంవత్సరాలకు పైగా – హిమాలయ పరిసరాల్లో అన్ని భాగాలకు యాత్రలుచేశాను. ఎన్నిసార్లో దగ్గరగా వున్న సిక్కింకి వెళ్ళి తిరిగి నేపాలు చేరుకున్నాను. ఘార్వాత్ పంజాబ్ కాశ్మీర్లకు ఎన్ని సార్లో వెళ్ళాను. ఒకప్పుడు – ఇంకాపైకి – ఆఫ్ఘనిస్తాన్, రష్యా సరిహద్దులదాకా వెళ్ళాను. టిబెట్టు పర్వతాలు దాటి లాసాకు – ఇంకాపైకి కూడా – వెళ్ళాను. ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కివచ్చిన తరువాత భారతదేశం–ఉత్తర దక్షిణ భాగాలు– దాదాపుగా తిరిగాను. ఇంగ్లాండుకు వెళ్ళాను. రెండుసార్లు

స్విట్జర్లెండుకు వెళ్ళాను. స్వల్పకాలమైనా రోమునగరాన్ని చూచాను. ఈ కథ వ్రాస్తున్ననాటికి ఇంకా యూరపులో మిగతా భాగాలకూ అమెరికాకూ వెళ్ళలేదు. త్వరలో వాటినికూడా చూడాలన్న ఆశ వున్నది. తిరగడం, అనుభవాన్నీ, జ్ఞానాన్నీ సేకరించడం, ఇదే బ్రతుకంటే! ప్రపంచం అతి విశాలమైంది. నీవు ఎవరెస్టు శిఖరంనుంచి కూడా ప్రపంచాన్నంతా చూడలేవు.

నేను అదృష్టవంతుణ్ణి అన్నాను. అనారోగ్యంగా వుంటినా, అపాయాలు కలిగినా నేను అదృష్టవంతుణ్ణే. నా సజాతీయులకు ఎవ్వరికీ ఇంత అదృష్టం పట్టలేదు. పెక్కుమంది పెద్ద జాతీయులు పర్వతాలలో మరణించారు. అప్పుడప్పుడు నాకు అనారోగ్యం కలిగిన మాట నిజమే. కాని ఎప్పుడూ మితి మీరిన అనారోగ్యం కలిగేది కాదు. ఎన్నడూ నేను పర్వతం మీదనుంచి జారిపడలేదు. మంచుబాధ ఎలాంటిదో నాకు తెలియదు. విశేషంగా చెమట పట్టడం వుంటే సులభంగా మంచు బాధ కలుగుతుంది. పర్వతం ఎక్కేటప్పుడు నాకు చెమట పట్టడం ఎన్నడూ లేదు. మజిలీలలో విశ్రాంతి తీసుకునేటప్పుడు కూడా నేను ఏదో పనిచేస్తూవుండేవాణ్ణి. దానివల్ల నాలో వేడి నిలిచి వుండేది. ఏపనిచేయకుండా కూర్చున్నప్పుడే మంచు బాధ కలుగుతుంది. మూడుసార్లు నేను మంచు గడ్డలలో చిక్కుకున్నాను. కాని అపాయం కలగలేదు. ఒకప్పుడు మంచు ప్రదేశంలో నాకళ్ళజోడు పగిలిపోయింది. ఎండ వేడిమి వల్ల నాకళ్ళకు చాలా బాధ కలిగింది. ఆనాటినుంచి రెండు కళ్ళజోళ్ళను దగ్గర పెట్టుకునే వాణ్ణి. ఇంకోసారి నా ప్రక్క ఎముకలకు నాల్గింటికి మంచి దెబ్బ తగిలింది. మోకాళ్ళకు

బెణుకు పట్టింది. అయితే అది కొండలను ఎక్కేటప్పుడు కాదు. కొండలను ఎక్కేటప్పుడు నాకు అపాయం కలిగింది ఒక్కసారే. ప్రక్క మనిషి పడిపోతూవుంటే అతన్ని పట్టుకోబోయి నా వేలు విసుగ కొట్టుకున్నాను.

నాకు మూడు ఊపిరితిత్తులు వున్నాయనేవారు. ఎంత ఎత్తులో కూడా నాకు శ్రమ కలగకపోవడమే దానికి కారణం. ఆ మాట వింటే నాకు నవ్వు వచ్చేది. సహజంగానే నేను ఎంత ఎత్తునసైనా నిలబడ గలను. చాలా మందికి అది కష్టంగా వుంటుంది. నేను పర్వతాలలోనే పుట్టాను. పర్వతాలకోసమే పుట్టాను కూడా. నేను ఒక లయతో కొండలను ఎక్కుతాను. ఆ లయ సహజంగానే నాలోవుంది. పొడిగాలిలో కూడా నా చేతులు మామూలుగా చల్లగా వుంటాయి. నా గుండె చాలా మెల్లగా కొట్టుకుంటుందని డాక్టర్లు అన్నారు. ఉన్నత ప్రదేశాలలో వుండడం నాకు ఇంట్లో వున్నట్టుంటుంది. అసలు నేను అలాంటి ప్రదేశాలకు సంబంధించిన మనిషిని. ఈమధ్య ఇండియాలో పర్యటన చేసినప్పుడు వేడివల్లనూ, జనసమర్దం వల్లనూ నాకు జబ్బు చేసింది. పర్వతంమీద ఎన్నడూ నాకు జబ్బు చేయలేదు.

రాజకీయాలకూ జాతీయాభిమానాలకూ పర్వతాలమీద స్థానంలేదు. వాటి ప్రభావమంతా ఈ క్రిందనే. జీవిత వాస్తవ స్వరూపం పర్వతంమీదనే చూడాలి. చావుకూడా ప్రక్కనే వుంటుంది. ఆ స్థితిలో ఈ రాజకీయాలు, జాతీయతలు పట్టవు అక్కడ నిలుచున్న మనిషి అచ్చమైన మనిషి – అంతే. తరువాత ఆరంభ మవుతాయి, ఈ రాజకీయాలు తర్కవితర్కాలు, రోషద్వేషాలు, ఇవన్నీ. ఎవరెస్టునుంచి క్రిందికి దిగగానే ఇవి

నన్నూ అంటుకున్నాయి. నాకు ముప్పయి యెనిమిది యేండ్లు వచ్చేవరకు నాజాతి ఏమైందీ ఎవ్వరికీ పట్టిందికాదు. ఇండియన్, నేపాలీ, టిబెటన్; ఈ మాటలవల్ల మనిషిలో కలిగే మార్పేమిటి? నేను షెర్పాజాతివాణ్ణి. మామూలు కొండ మనిషిని. నా సంబంధం ఆ హిమాలయంతో. కాని ఈ నాడు ప్రతిదీ గజిబిజిగా తోస్తున్నది. నా మానవస్థితిపోయి తాడుకు కట్టి ఆడించే ఒకరకం బొమ్మలాగా తయారయ్యాను.

నేను చాలా దూరం వెళ్ళాను. నేలమీదినుంచి ఎవరెస్టు శిఖరానికి ఎంత దూరం వుంది! యాక్ మృగాలు మేతమేసే సోలోఖుంబూ మైదానాలనుంచి నెహ్రూ ప్రధాని యింటికిన్నీ, బకింగ్‌హాం భవనంలో ఆతిథ్యానికిన్నీ ఎంత దూరం వుంది! కొండ ప్రదేశాలలో కూలీగా మూటలు మోసే మనిషికిన్నీ, కోటునిండా పతకాల దండలు తగిలించుకొని వాయు విమానాల్లో తిరుగుతూ రాబడి పన్నుకు భయపడే మనిషికిన్నీ ఎంతదూరం వుంది! ఏ దూరమైనా భారమైందే. కాని నాకు ఎవరెస్టు దూరం శ్రమకు మించిన సౌఖ్యాన్ని చేకూర్చింది. పర్వతాన్ని ఎక్కడంలో నాకు దూరమన్న ప్రశ్నే లేదు.

ఏది కాని, నన్ను ఎటు తిప్పినా సరే, తిరిగి పర్వతాల వద్దకే చేరుస్తుంది. పర్వతాలతోనే నా బ్రతుకు ముడివడి వుంది — 1953 మే నెలలో ఆ ప్రొద్దుటిపూట ఆ ప్రపంచశిఖరం మీదికి హిల్లరీతో కలిసి ఎక్కుతూ వున్నప్పుడు నామనస్సులో అదే భావం, నా రక్తంలో అదే లయ. ఆనాడు బుద్ధుని ధర్మ చక్రం లాగా నా జీవిత చక్రం తిరగడం మొదలు పెట్టింది. కడపటికి ఎవరెస్టు–సోమోలుంగ్మా–శిఖరాన్ని స్పృశించాను. చిన్ననాటికల కన్నులముందు వాస్తవ రూపంతో కనిపించింది.

# 2. దాని మీద పుష్టి పెరలేదు

"షెర్పా" అంటే తూర్పునుంచి వచ్చిన మనిషి. అని మాట. మేము మంగోలియన్ కుటుంబానికి చెందినవాళ్ళమనీ, మా పూర్వులు టిబెట్టు నుంచి ఎప్పుడో పూర్వంగ వచ్చారనీ— ఇంతే మా పూర్వ చరిత్రను గురించి ఈనాడు తెలిసిన విషయం. ఈ నాటికీ చాలా విషయాలలో ఇతరులకన్నా టిబెటనులతోనే మాకు ఎక్కువ పోలిక లున్నాయి. మా భాష, మా వేషం, ఆహారం, ఆచారాలుకూడా చాలావరకు టిబెటనులకు సంబంధించి వుంటాయి. బైటి ప్రపంచంతో ఎక్కువ సంబంధం కలగని వారిలో ఈ పోలిక ముఖ్యంగా చూడవచ్చు. ప్రధానమైంది మత సంబంధం. టిబెటనుల లాగా మేము బౌద్ధులం.

గట్టి రాతి భూమి కలది మా దేశం. గాలి కరిచేట్లుగా వుంటుంది. కాని మాకు వ్యవసాయం వుంది. పచ్చని ప్రదేశాలు వున్నాయి. ఎనిమిది పదివేల అడుగుల మధ్యలో గోధుమ పండుతుంది. పధ్నాలుగు వేల అడుగులవరకు బార్లీ, వురల గడ్డలు పండుతాయి. మాకు వురలగడ్డలే ఎక్కువ పంట. అదే చాలావరకు తిండికి ఆధారం. ఇండియాలోనూ చైనాలోనూ వరిలాగే మాకు వుర్లగడ్డల పంట ముఖ్యము.

కొంత భూమి సాముదాయికంగా వుంటుంది. కొంత వ్యక్తుల క్రింద వుంటుంది. చాలా కుటుంబాలకు వేర్వేరు చోట్ల భూమి వుంటుంది. ఆయా ఋతువుల్లో పైర్లు వేసుకోడానికి కోసుకోడానికి మిట్ట భూములకూ పల్లపు భూములకూ తిరుగుతూ వుంటారు. కొందరు గొర్రెల మేకల యాకుల

మందలను తోలుకుని తిరుగుతూ వుంటారు. యాకులంటే ఒక రకం బర్రెలు. పశువు లన్నింటిలో అవే ముఖ్యమైనవి. వాటి నుల్లు బట్టలకు ఉన్ని, చెప్పులకు తోలు, వంటకు పిడకలు, తిండికి పాలు వెన్న మీగడ లభిస్తాయి. కొందరు వాటి మాంసాన్ని కూడా ఆహారంగా ఉపయోగిస్తారు. శిష్టులైన బౌద్ధులు మాత్రం మాంసాన్ని ముట్టరు. హిమాలయ ప్రాంతంలో ఉన్నత ప్రదేశాలలో వసించే జనసామాన్యం లాగానే పశువ్యాలకు కూడా జీవితానికి యాక్ ముఖ్యాధారం. తిండికి బట్టకు కావలసిన పదార్థమంతా ఆ మృగంవల్ల లభిస్తుంది.

మా కుటుంబం "ఖామే" అన్నచోట వుండేది. నేను పుట్టింది "త్సాచూ" అన్నచోట. అది మకాలూ పర్వతానికి సమీపంలో వుంది. అక్కడినుంచి ఎవరెస్టుకు ఒక రోజు నడక. "త్సాచూ" అంటే వేడినీటి బుగ్గలు. అది పుణ్యక్షేత్రం. దాన్నిగురించి ఎన్నో కథలూ పురాణాలూ వున్నాయి. అక్కడ వున్న "ఛాంగ్‌లా" మతానికి మా తల్లి యాత్రగా వెళ్ళింది. "ఛాంగ్‌లా" అన్నది మా తెగపేరు కూడాను. దాని దగ్గర ఒక పెద్దరాయివుంది. ఆ రాయి బుద్ధభగవానుని తల ఆకారంగా వుంటుంది. ఎవరైనా భక్తితో ఆ రాయిని తాకి ప్రార్థన చేస్తే దానిలోనుంచి నీరు వెలువడుతుందట! ఆ చుట్టూ కోనేళ్ళు వున్నాయి. ఒక కోనేటిలో నీరు తేనీరు వర్ణంలో వుంటుంది. ఆ కోనేటి వొడ్డున బుద్ధుడు ధ్యానం చేసినట్టుగా చెప్పుకుంటారు. ఆయనకు దాహమైనప్పుడు ఆ నీరు తాగేవాడట. అవి ఆయనకు నిజంగా తేనీరులా వుండేవట.

నేను ఎప్పుడు పుట్టానో చెప్పడం కష్టం. సోలో ఖుంబూలో టిబెటన్ పంచాంగం వాడుకలోవుంది. సంవత్సరాలను అంకెలలో లెక్కించడం వుండదు. గుఱ్ఱం, పులి, ఎద్దు, పక్షి, పాము: ఈలాగా సంవత్సరాలకు పేర్లు వుంటాయి. వరసగా పన్నెండు సంవత్సరాలకు పన్నెండు జంతువుల పేర్లువుంటాయి. అందులో ఆరు జంతువులు మగవి. ఆరు ఆడవి. పన్నెండు సంవత్సరాల వరస ముగిసిన తరువాత అదే వరస ప్రారంభం అవుతుంది. నేను కుందేలు సంవత్సరంలో పుట్టాను-ఈ మధ్య వెనక్కు లెక్క చూచుకున్నాను. ఆ లెక్కనుబట్టి 1914 లో నేను జన్మించినట్టు తేల్చుకున్నాను.

నేను ఫలానా మాసంలో పుట్టానని చెప్పడం అంత కష్టం కాదు. అప్పటి శీతోష్ణస్థితినిబట్టి పంటలనుబట్టి విచారించగా మే నెల చివరభాగంలో నా జననమని తేలింది. మే నెల చివరి భాగంలో నా కెప్పుడూ మంచే జరుగుతూవుంది. నా జీవితంలో మే నెలకు ఎంతో ప్రాముఖ్యంవుంది. ఆ మాసంలో నేను పుట్టాను. అది యాత్రలకు తగిన మాసం. వాతావరణం అనుకూలంగా వుంటుంది. మే నెల 28 తేదీన నేను లాంబర్ట్‌తో సహా ఎవరెస్టు శిఖరాన్ని దాదాపుగా ఎక్కాను. తరువాత ఒక సంవత్సరం ఒక రోజుకు - మే 29 తేదీన - హిల్లరీతో సహా ఎవరెస్టు శిఖరం పైకి ఎక్కాను.

మా తల్లి పేరు "కింజాం". మా తండ్రిపేరు "చాంగ్-లా-మింగ్మాం" మా తల్లికి పదముగ్గురం పుట్టాం. ఏడుగురు కొడుకులు - ఆరుగురు కూతుళ్ళు. నేను పదకొండోవాణ్ణి. సోలో ఖుంబూలో బ్రతకడం చాలా కష్టం. మృత్యువు ఎప్పుడూ దాపులో వుంటుంది. పుట్టిన పదముగ్గురిలో నేనూ

ముగ్గురు అక్కలూ ఇంతవరకు బ్రతికివున్నాం. ఈ మధ్య వరకు మా కుటుంబంలో బైటి ప్రపంచాన్ని చూచింది ఒక్క నేనే. మా తండ్రి చూడలేదు. నేను ఎవరెస్టు ఎక్కి దిగిన తరువాత బ్రతికివున్న మా అక్క లిద్దరు భర్తలతోనూ బిడ్డలతోను డార్జిలింగు చేరుకున్నారు. మా తల్లికి 84 సంవత్సరాలు. ఈ సంవత్సరమే ఆమె థామేలో యిల్లు వదిలి పెట్టి ఇంటినుండు వచ్చింది. నా పసితనం నుంచి ఇంతకాలం గడిచిన తరువాత, మొదటిసారిగా, మిగిలివున్న మా కుటుంబం ఒక్క నెలవుకు చేరింది. అదే నాకు ఎంతో సంతోషం.

నా తల్లి దండ్రులు నాకు "నాంగ్యాల్ వాంగ్ డే" అని పేరు పెట్టుకున్నారు. ఒక రోజు నన్ను రాంగ్ బల్ నుంచి వచ్చిన గొప్ప లామా వద్దకు తీసుకువెళ్ళారు. ఆయన శాస్త్ర గ్రంథాలను చూచి సోలో ఖుంబూలో ఆమధ్య చనిపోయిన గొప్ప భాగ్యవంతుడు. ఒకాయన నేనుగా పుట్టినట్టు చెప్పాడు. నా పేరును మార్చి "తేన్ సింగ్ నార్గే" అని పెట్టమన్నాడు. తాసచూ లామాల లాగా నాకు గొప్ప భవిష్యత్తు ఉన్నట్టు కూడా చెప్పాడు. అందుకే పేరు మార్చమన్నది. నార్గే అంటే భాగ్యవంతుడు లేక అదృష్టవంతుడు అన్నమాట. తేన్ జింగ్ అంటే ధర్మ రక్షకుడు అన్నమాట.

కొంచెం పెద్ద అయ్యాక నేనుకూడా లామాను కావాలని మావాళ్లు నిర్ణయించుకున్నారు. నన్ను ఒక మఠానికి పంపారు. జుట్టు పూర్తిగా గొరిగించారు. కొత్త శిష్యుడి వేషం వేశారు. ఆ మఠంలో వుండగా ఒక లామాకి కోపం వచ్చి నన్ను పలకతో తలమీద కొట్టాడు. నేను యింటికి పరుగెత్తుకొని వెళ్ళి తిరిగి మఠానికి పోనని పట్టు పట్టాను. ఈ కథను చెపితే

నా మిత్రులు అనేవాళ్ళు: “ఆ తలమీది దెబ్బవల్లనే నీకు పర్వతాలంటే అంత వెర్రి” అని.

ఆకాశాన్ని వొరుసుకునే ఎవరెస్టును నేను పసితనంలో ఎన్నోసార్లు చూచాను. అప్పటికది ఎవరెస్టు కాదు. “చోమోలుంగ్మా”. మామూలుగా ఆ మాటకు “జగన్మాత” అని అర్థం చెప్పేవారు. నా చిన్నతనంలో ఈ మాట లేవీ నాకు అర్థం కాలేదు. అది పక్షి పోలేనంత ఎత్తులో వున్న పర్వతం” అని షెర్పాస్త్రీలు తమ బిడ్డలకు చెప్పేవాళ్ళు. అలాగే మా అమ్మనాకు చెప్పింది. నేను ప్రేమించే ఆ పర్వతానికి మా అమ్మ చెప్పిన పేరే ఈ నాటికీ నాకు ఉత్తేజంగా తోస్తుంది.

1921, 1922, 1924 సంవత్సరాలలో ఎవరెస్టుకు మొదటి మూడు ప్రసిద్ధ యాత్రలు జరిగాయి. సోలో ఖుంబూ నుంచీ డార్జిలింగు నుంచీ చాలామంది షెర్పాలు వెళ్ళారు. తిరిగి వచ్చి ఏవేవో కథలు చెప్పారు. ఎవరెస్టు శిఖరం ఆకాశాన్ని అంటుతూ వుంటుందన్నారు. వారిలో పెక్కుమంది పెద్ద బూటులు ధరించేవారు. వింతరకం దుస్తులను వేసుకునే వారు. అలాంటి బూటులు వేసుకోవాలని నాకు ఎంతో మోజు కలిగింది. ఒక జతకొని కాళ్ళకు తగిలించుకున్నాను. వాటి సైజు బరువుకు అసలే నడవలేక పోయాను. ఎవరెస్టు ఎవరెస్టు, ఎవరెస్టు, అందరూ అదేమాట. “ఏమిటి ఎవరెస్టు” అని అడిగాను. “అదే చోమోలుంగ్మా” అన్నారు. “ఆ పర్వతానికి అవతల వున్న టిబెట్టుకు మాత్రం వెళ్ళాం” అని చెప్పారు. ప్రపంచంలో కల్లా ఎత్తైన పర్వతం అదేనట! ఆ యాత్రలకు మా కుటుంబంలోనుంచి ఎవ్వరూ వెళ్ళలేదు.

ఏమైనా సరే నాకు వెళ్ళాలని వుంది. కాని నేనింకా చిన్నవాణ్ణే.

మా తండ్రికి మా అన్నలకు పనుల్లో సాయపడగల వయసు వచ్చింది. నాకు. ఎప్పుడూ ఏదోవక పని వుండేది. వురల గడ్డలు బార్లీ మొదలైన పంటలు పడించే వాళ్లం. గొర్రెలను యాక్‌లను కాపుదలచేసే వాళ్ళం. అవి వుంటేనే మాకు పాలు వెన్న లభించేది. బట్టలకు వున్ని లభించేది. ఒక్క వుప్పును మాత్రం బైటినుంచి తెప్పించుకునే వాళ్ళం. అప్పుడప్పుడు టిబెట్టు నుంచి ఎండుమాంసం వచ్చేది. నేపాలులో జంతుహింస నిషిద్ధం. అందుకోసం యాక్‌లను చంపే వాళ్ళం కాదు. మామూలుగా మేంచేసేది ఏమంటే: యాక్‌లను చంపకుండా గొంతులోనుంచి నెత్తురును లాగుతాం. ఆ నెత్తురుసు పేరబెట్టి ఇతర ఆహారంలో కలుపుతాం. అది చాలా బలకరమైన ఆహారం. దేహంలోకి నెత్తురును ఎక్కించి నట్టే ఇప్పుడు ఆస్పత్రులలో రోగులకు నెత్తురు ఎక్కిస్తున్నట్టుగా, చాలావరకు ఆకురాలే కాలంలో ఈ పని చేసేవాళ్ళం. దీనివల్ల మేలు మాకేకాదు, చలికాలంలో యాక్‌కుకూడా మంచిదే. అవి ఎండాకాలమంతా బాగా మేసి బలుస్తాయి. పోట్లాట లారంభిస్తాయి. లేదా పరుగెత్తి పోతాయి. ఈ విధంగా నెత్తురు లాగితే అవి కాస్తనెమ్మదిగా వుంటాయి.

మొదట్లో మాది చాలా పేదకుటుంబం. నా పుట్టుకతో పరిస్థితులు బాగుపడ్డాయట. మేం సామాన్యమైన ఆహారమే తినేవాళ్ళం. దానికి ఎన్నడూ లోటు వుండేదికాదు. యాక్ వున్నితోనూ, తోళ్ళతోనూ చలికాలానికి వెచ్చటి దుస్తులను తయారు చేసుకునే వాళ్ళం. టిబెట్టులో వుపయోగించే రకం

తోలు బూట్లను వాడేవాళ్ళం. నా జీవితంలో నేను వట్టి కాళ్ళతో నడిచింది చాలా అరుదని చెప్పగలను.

ఈ ప్రపంచం విశాలమైంది. మా సోలోఖుంబూ చాలా చిన్న ప్రదేశం. అప్పటికి నాకు పదమూడో యేడు. బహిరంగంగా వెళ్ళిపోవడం సాధ్యపడదు. కాబట్టి చెప్పకుండా వెళ్ళాను. తప్పుచేస్తున్నా ననిపించింది. కాని వెళ్ళాలన్న కోరిక బలంగావుంది. చుట్టు దారిన కాట్మాండూకు వెళ్ళాను. ఆ ప్రయాణం నాకు రెండు వారాలు పట్టింది. నేను చూచిన మొదటి పట్నం అదే. పట్నంలో తిరుగుతూ, జనాన్ని వీథులనూ పెద్ద భవనాలనూ గుళ్ళనూ – ఇంకా ఏవేవో ఇదివరకు ఎన్నడూ నేను చూడనివన్నీ చూస్తూ దాదాపు రెండు వారాలు గడిపాను. అన్నీ చూడాలని ఉబలాటం వుండినా ఇంటి ధ్యాస కూడా వుంది. మా వూరినుంచి వచ్చిన మనుషులు కనబడ్డారు. వాళ్ళతో కలిసి మళ్ళీ యింటికి వచ్చాను. ఆ ప్రయాణమంతా ఆరు వారాలు పట్టింది. తిరిగి వచ్చానన్న సంతోషంతో నా తల్లి దండ్రులు గట్టిగా నన్ను కావిలించుకున్నారు.

తరువాత అయిదు సంవత్సరాల వరకు యింటిపట్టునే వున్నాను. మావూళ్ళో ఎల్లకాలం ఉండలేనని నాకు తెలుసు. వ్యవసాయం చేస్తూ పశువులను కాస్తూ వుండడానికి నేను పుట్టలేదని నాకు తెలుసు. 1932 చివరలో నా 18 వ యేట మళ్ళా వెళ్ళాను. ఈ పర్యాయం కాట్మాండూకు వెళ్ళలేదు. డార్జిలింగుకు వెళ్ళాను. నిజంగా "చోమోలుంగ్మా"ను ఎక్కుతున్నట్టే అనిపించింది. 1933 లో ఎవరెస్టు యాత్రకు ఇంకొక జట్టు సిద్ధపడుతూ వున్నట్టు తెలిసింది. ఆ జట్టుతో వెళ్ళాలని

నిశ్చయించుకున్నాను. ఈ పర్యాయం కూడా మా వాళ్లకు చెప్పకుండా వెళ్లాను. అందుకు నాకు విచారం గలిగింది. నా తల్లి దండ్రులు నా మీద అంత దయచూపే వాళ్ళు. వాళ్ల మీద నాకూ అంత ప్రేమ వుండేది.

## 3. క్రొత్త ప్రపంచం లోకి

నాకు మూడు రకాల బ్రతుకులు గడిచాయి. మొదట సోలోఖుంబూలో బాల్యం గడిపాను. తరువాత ఇరవై సంవత్సరాలు కూలీగా విశేషం డార్జిలింగులో గడిపాను. ఎవరెస్టు నుంచి దిగివచ్చిన నాటితో మూడో రకం బ్రతుకు మొదలు. ఇది ఎక్కడికి తీసుకుపోతుందో తెలియదు.

మేం పన్నెండు మందిమి ఇళ్ళు విడిచికూడా బయలు దేరాం. నా దగ్గర పైసాలేదు. మిగతావాళ్ళు కూడా అంతే. నిజానికి మాలో చాలామంది పైసా సంపాదించుకోడానికే బయలుదేరారు. అంతేకాదు – దేశం చూడాలని కూడా. మాలో ఒకడు దావాతోండూప్. అతను నా కన్నా పెద్ద వాడు. అతనూ ఎప్పుడూ డార్జిలింగుకు వెళ్ళలేదు. కాని అక్కడి విశేషాలు చాలా తెలుసు. ఎవరెస్టు యాత్రకు కొత్త జట్టు త్వరలో బయలు దేరుతుందని అతనే నాకు చెప్పాడు. అతని మాటలు వింటూంటే నాకు ఉద్రేకం కలిగింది. పరుగెత్తిపోయి ఆ జట్టును కలుసుకుందా మనిపించింది. అయితే తూర్పు నేపాలు దేశంలో పరుగెత్తడం సాధ్యం కాదు. ఎక్కుతూ దిగుతూ నడవాలి. చుట్టు తిరగాలి. నిలువు కొండలు ఎక్కాలి. అడవిలోయల్లోనూ, వడిగా పారుతూన్న

యేళ్ళలోనూ పోవాలి. మిగతా వాళ్ళు నన్ను వదిలి పెట్టి ముందుగా వెళ్ళారు. అక్కడికి సమీపంలో సిమనా అనే నగరం వుంది. ఆ నగరంలో గింగాలామా అని ఒక ధనికుడు నన్ను తన ఇంట్లో చేర్చుకున్నాడు. అతని యింట్లో పనిచేస్తూ అడవినుంచి వంట చెరుకు తెచ్చిపెడుతూ వున్నాను.

నాకు డార్జిలింగుకు వెళ్ళాలని వుందని ఒకనాడు గింగిలామాతో చెప్పాను. "సరే! అక్కడికే నేనూ వ్యాపారం కోసం వెళ్ళుతున్నాను. నిన్నుకూడా తీసుకువెళ్ళుతాను." అన్నాడు. నాకు ఎంతో సంతోషమైంది. ఇద్దరం కాలినడకన ప్రయాణంచేశాం. అదే మొదటిసారి నేను బాగా ఎక్కడం. మొదట నేను డార్జిలింగులో వుండలేదు. దగ్గరలో ఆలుబారి అన్న పల్లెటూళ్ళో వున్నాను. వుర్లగడ్డలు పండుతున్నందున ఆ వూరికి ఆపేరు వచ్చింది. ఆ వూళ్ళో గింగాలామాకు తెలిసిన బంధువు ఒకాయన వున్నాడు. గింగాలామా నన్ను ఆయన యింట్లో చేర్చాడు. వారికి పది మేకలు వున్నాయి. వాటిని నేను కాయాలి. సామాన్యాలు పనులుకూడా చేయాలి. డార్జిలింగులో ఎక్కువగా మాట్లాడే నేపాలీభాషను నేర్చుకోడానికి మొదలు పెట్టాను. నాతోకూడా గడ్డికోయడానికి వచ్చే మాన్‌బహదూర్ తమాంగ్ అనే మనిషి ఆ భాషను నాకు శ్రద్ధతో చెప్పాడు. నేనూ తమాంగ్ చిరకాల స్నేహితులం. ఈ మధ్య నేను కొత్తగా కడుతూన్న యింటికి తమాంగ్ తాపీపని చేస్తున్నాడు. అతనూ నేనూ ఆనాటి ముచ్చట్లు చెప్పుకున్నాం. ఒకనాడు మేం అడవిలో వంట చెరుకును పోగుచేస్తూ వుండగా ఫారెస్టుగార్డువచ్చి మమ్మల్ని చెట్టుకు కట్టేసి కొట్టాడు.

అసలు నాకు ఉద్రేకం కలిగించే సంఘటన త్వరలో జరగబోతున్నది. 1933 లో ఎవరెస్టు యాత్రకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. నా స్నేహితుడు దావాతొండూప్ అదివరకే జట్టులో చేరాడు. నన్నుకూడా సిఫారసు చేయమని అతన్ని అడిగాను. నేను పసివాణ్ణన్న నెపంతో అతను ఒప్పుకోలేదు. నేనే స్వంతంగా ప్రయత్నించాలనుకున్నాను. మొట్టమొదట నేను డార్జిలింగుకు వచ్చినప్పుడు పొడుగాటి జుత్తు ఉండేది. నా జన్మస్థానంలో అందరూ అలాగే వుంచుకుంటారు. డార్జిలింగులో ప్రతివాడు నన్ను ఆడపిల్ల అని ఎగతాళి చేసేవాడు. అందుకని జుత్తు పొట్టిగా కత్తిరించుకున్నాను. రింగాలాపూ యిచ్చిన నేపాలీ దుస్తులను వేసుకున్నాను. నా వేషాన్ని చూచి జట్టువారు నన్ను నేపాలీ అనుకున్నారు. వాళ్ళకు షెర్పాజాతి మనుషులే కావాలి. యాత్రజట్టు డార్జిలింగును విడిచి వెళ్ళారు. నేను వెనక చిక్కాను. నాకు పట్టరాని దుఃఖం వచ్చింది.

పోరీ ఆవులను కాస్తూ వాటి పాలను అమ్ముతూ పెక్కుమాసాలు అక్కడే గడిపాను. నా దగ్గర అంగలామూ అనే యువతి పాలు కొనేది. ఆమె షెర్పాజాతి స్త్రీ. డార్జిలింగులో పుట్టింది. ఎవరింట్లోనో దాసిగా వుండేది. ఆమెతో నేను ఎన్నడూ షెర్పాభాష మాట్లాడలేదు. నేపాలీ మాట్లాడేవాణ్ణి. నేను షెర్పాజాతి వాణ్ణని ఆమెకు తెలియదు. బేరం చేసినంత సేపూ నాతో ఏదో వాదన పెట్టుకునేది. "నీ దగ్గర పాలు కొంటాను గాని నీవు కొసరు పోయాలి" అనేది. వీల్లేదు అనేవాణ్ణి. "నీవు వట్టి పిసినారివి" అనేది. "నీవు గీచిగీచి బేరం చేస్తావు" అనేవాణ్ణి. అంగలామూ ఈ నాడు నా రెండో భార్య.

అన్న కారణంవల్లతప్ప ఈ కథ ఏమంత రసవంతమైంది కాదు. దాన్ని మరిచిపోయేవాణ్ణేమో.

డార్జిలింగులో దాదాపు ఒక సంవత్సరం గడిపాను. సోలో ఖుంబూ నుంచి వచ్చిన మనుషులు చెప్పారు: మావాళ్ళు నేను మరణించినట్టు తేల్చుకున్నారని. వెంటనే వెళ్ళి మా వాళ్లను చూడాలని నిశ్చయించుకున్నాను. ఆ మనుషులు చెప్పింది నిజమని ఇంటికి వెళ్ళగానే తెలిసింది. మా వాళ్ళు నేను చచ్చిపోయానన్న నమ్మకంతో నాకు అంత్యక్రియలు చేస్తున్నారు. నేను కంట పడగానే నా తల్లిదండ్రులు ఏడవ నారంభించారు. ఏడుస్తూనే ఎంతో సంతోషపడ్డారు. నేను లేనప్పుడు మా వూళ్ళో భూకంపం వచ్చింది. మా యిల్లు కొంతభాగం కూలింది. ఆ భాగాన్ని మరమ్మత్తు చేయించడం నా మొదటి పని. తరువాత నాకు మామూలు పనే: వ్యవసాయమూ, పశువుల కాపలా. మరుసటి ఎండాకాలంలో నేను మొదటి సారిగా ఉప్పు తేవడానికి టిబెటుకు వెళ్ళాను. మా తండ్రి అదే పనిమీద ఇంకోసారి నన్ను టిబెటుకు వెళ్ళమన్నాడు. నేను నేరుగా డార్జిలింగు చేరుకున్నాను.

మళ్ళా ఆలుబరీ గ్రామానికి వెళ్ళకుండా డార్జిలింగులోనే మకాం పెట్టాను. ఎక్కువగా షెర్పాలు నివసించే ప్రదేశాలు రెండున్నాయి. నేను తూంగ్‌సూంగ్ బస్తీలో వున్నాను. నా అదృష్టంవల్ల ఆంగ్‌తార్కే అనే పెద్ద మనిషి ఇంట్లో బాడుగకు చేరాను. ఆయన పర్వతారోహణాలలో అనుభవశాలి. ఆ విద్యలో పేరు మోసిన షెర్పాలలో ఒకటి ఆయన. నా పూర్వ మిత్రుడు దావా తోండూప్ కూడా అక్కడే వున్నాడు. ఆ విద్యలో అతనూ బాగా ఆరితేరాడు.

ఎవరెస్టునూ ఇతర పర్వతాలనూ ఎక్కడంలో ఘటికులని పించుకున్న వాళ్ళు కొందరు ఆ చుట్టు ప్రక్కలనే వున్నారు.

ఆ బస్తీలో మేము కొయ్యలతో కట్టి రేకులు కప్పిన గదిలో కాపరం. మామూలుగా ఒక్క గదిలో ఒక్క కుటుంబం వుంటుంది. 1935 లో నాకు వివాహమైంది. నా భార్య పేరు దావాఫుటి. ఫుటి, అంటే 'సంతానవతి కాగల భాగ్యశాలిని' అన్న మాట. ఆ మాట నిజమే అయిందికూడా. నా భార్య మా వూళ్లోనే పుట్టింది. అక్కడ కొన్ని సార్లు ఆమెను చూచాను. డార్జిలింగులో మేము కలుసుకునే వరకు ఆమెతో నాకు అంత పరిచయంలేదు.

## 4. ఎవరెస్టుకు రెండు యాత్రలు

ముందు చిన్నపనుల్లో నెగ్గి పెద్దపనులకు పూనుకోవాలి అంటారు. నా పద్ధతి అదికాదు. నా మొదటి యాత్రే 1935 లో ఎవరెస్టు శిఖరానికి. ఆ పర్వతాన్ని ఎక్కడానికి వెళ్ళిన అయిదో బ్రిటిషుజట్టుతో కలిసి వెళ్ళాను.

మళ్ళా యాత్ర జరుగుతుందని సంవత్సరం మొదటినుంచి విశేషంగా అనుకుంటున్నారు. అయితే టిబెట్టులో ప్రవేశించడానికి ఉత్తర్వును సంపాదించవలసిన బాధ ఒకటి వుంది. ఆ జట్టుకు నాయకుడైన ఎరిక్ షిప్టన్ డార్జిలింగుకు చేరడం ఆలస్యమైంది. అందుచేత 1921 సంవత్సరంలో లాగానే శిఖరానికి ఎక్కే ప్రయత్నం లేకుండా ముందుగా మార్గాన్ని చూచుకోవడం వరకు నిర్ణయించుకున్నారు. 1933 లో జరిగినట్టే ఉతడవకూడా నన్ను చేర్చుకోరేమో అనిపించింది.

డార్జిలింగులో వ్యాపారస్తుడుగావున్న కర్మసాల్ అనే వ్యక్తి ఈ యాత్రకు సర్దార్. సర్దార్ అంటే పోర్టర్లమీద అధికారి. ఆయన నన్ను ఎరగడు. ఇదివరకు పనిచేసినట్లు నాకు సర్టిఫికేటు కూడా లేదు. మిస్టర్ షిప్టన్, హిమాలయన్ క్లబ్ కార్యదర్శిగా వున్న మిస్టర్ కిడ్ [illegible]. ఇదివరకు పర్వతాల మీదికి ఎక్కిన వాళ్ళనూ, [illegible] సిఫారసు చేసిన వాళ్ళనూ ఎన్నుకున్నారు. నాకు చాలా దిగులుగా వేసింది. తరువాత ఇంకా ఇద్దరు మనుష్యులు కావలసి వచ్చినట్లు తెలిసింది. ఇద్దరికిగాను ఇరవై మంది [illegible] వచ్చారు. కొత్త ఖాకీ బుష్ జాకెట్లూ, షార్టూ లాగూ వేసుకుని నేను వరసలో జొరబడ్డాను. నా వేషాన్ని చూస్తే అనుభవమున్నవాడినని అనుకుంటారని నా ఆశ. నా దగ్గరకు రాగానే సర్టిఫికెట్లు ఏమైనా [illegible] మని అడిగారు. లేదని తలూపాను. ఇద్దరూ ఏమీ మాట్లాడకుండా నన్ను వరసలోనుంచి వెళ్ళమన్నారు. నేను వెళ్ళిపోతూవుండగా వెనక్కు పిలిచారు. చివరకు నన్నూ, ఆంగ్ త్సేరింగ్ అనే షెర్పాయువకుణ్ణి ఎన్నుకున్నారు. ఆ [illegible] తరువాత సంగ్ పర్వతం మీద మరణించాడు. 1953 సం॥ త్సరం లండన్ నగరంలో ఎరిక్ షిప్టన్ను చూసినప్పుడు 18 సంవత్సరాల క్రితం నాకు ఆయనే మొదటి అవకాశాన్ని కలిగించిన సంగతి ఆయనకు జ్ఞప్తి చేశాను.

మా టిబెట్టు ప్రయాణం మెల్లగా సాగింది. దారిలో చాలా పరిశోధన చేసుకుంటూ వెళ్ళాం. చివరకు తూర్పు రాంగ్‌బుక్ మంచు మైదానానికి (Glacier) చేరాం. పూర్వం వెళ్ళిన జట్టులు అక్కడ కాంపులు వేశారు. తలవని తలంపుగా అక్కడికి మా తండ్రి వచ్చారు. చాలా సంతోషమైంది. ఎవరెస్టు

యాత్ర వెళ్ళుతూన్నట్టు తెలిసి మమ్మల్ని చూడడానికి వచ్చాడట.

అదే 1935 లో నేను మొదటిసారి ఒక పర్వతాన్ని ఎక్కడం నాకు ఉత్సాహం పట్టరాకుండా వుంది. మాకు ప్రత్యేకమైన దుస్తులు, బూట్లు, గాగిల్సు (కళ్ళజోళ్ళు) ఇచ్చారు. తగరపు డబ్బాలలో పెట్టిన కొత్తరకం ఆహారం తినేవాళ్ళం. కొత్తరకం రుంపట్లు, నిద్రబోపడానికి సంచులు, ఏవేవో నేను ఎన్నడూ చూడని అన్ని రకాల సామగ్రిని మాకు సప్లయి చేశారు. పర్వతం మీదికి ఎక్కడంలో కూడా నేను ఎంతో నేర్చుకోవలసి వచ్చింది. మా వూళ్ళో పుట్టి పెరిగిన కుర్రవాడికి మంచు అన్నా మంచు మైదానాలన్నా కొత్తవి కావు. కాని పర్వతాన్ని ఎక్కడంలో అసలైన మెలకువలను పద్ధతులను మొదటి పర్యాయం అనుభవ పూర్వకంగా నేర్చుకున్నాను. అపాయాలు కలగకుండా తాడు కట్టుకుని అంచెల మీద పర్వతా లెక్కడం, గొడ్డలితో మెట్లు నరకడం, కాంపులను కట్టడం ఎత్తివేయడం, త్వరగానూ భద్రంగానూ వెళ్ళడానికి అనువైన మార్గాలను వెదకడం, ఈలాంటి వన్నీ కొత్తగా నేర్చుకున్నాను. బరువులు మోయడం నా పని. కాని నాకు ఎక్కువ పని పెట్టేవారు కాదు. నేను శ్రమపడి పని చేసే వాణ్ణి. నావల్ల చాలా ఉపయోగం వుండేది. దొరలకు నామీద యిష్టం వుండే దనుకుంటాను. ఎత్తులకు ఎక్కడం వల్ల నాకు బాధ కలగలేదు. అది వరకు అంత యెత్తులు ఎక్కివుండకపోయినా 22 వేల అడుగుల యెత్తువరకు బరువులు మోశాను. అప్పటికి ఒక కనుమ చేరుకున్నాం.

అక్కడినుంచి పోర్టర్లుగా వెళ్ళిన వాళ్ళం వెనక్కి తిరిగి పోవాలి. మిగిలిన పోర్టర్లు తిరిగి వెళ్ళిపోతున్నందుకు సంతోషపడ్డాను. వాళ్ళందరు డబ్బుకోసం వచ్చారు. నేను అలాకాదు. ఇంకా పైకి ఎక్కిపోవాలని నా కోరిక. నాకు ఎంతో నిరుత్సాహమూ ఆశాభంగమూ కలిగింది. అది నా జీవితమంతా వెంటాడుతూ వుండే కోరిక. ఆ నాటికీ ఈ నాటికీ కూడాను. ఎవరెస్టు శిఖరం ఎక్కిన నాడే నా జీవితం సార్థకం అవుతుంది. అదే నా ఆకాంక్ష. అదే నా కల. నా నెత్తురును వుడుకెత్తించే జ్వరం.

"కానీ! నాకు ఇరవై ఒకటో సంవత్సరం. ఇంకా యాత్రలు జరక్కపోతాయా? అనతి కాలంలో నేను నిజంగా మంచు మల మీది పులిని కాక పోతానా?" అనుకున్నాను నాలో నేను.

తిరిగి డార్జిలింగు చేరాను. కొద్దికాలం నా భార్యతో గడిపాను. మాకు ఒక మగబిడ్డ కలిగాడు. "నిమాదోర్జీ" అని పేరు పెట్టుకున్నాం. వాడు ఎంతో అందమైన బిడ్డ. ఒక శిశు ప్రదర్శనంలో వాడికి మొదటి బహుమతి వచ్చింది. 1939 లో నాలుగవయేట వాడు చనిపోయాడు. నా జీవితంలో నేను అనుభవించిన దుఃఖాల్లో అదొకటి.

1935 యాత్రలో నేను 24 వేల అడుగుల యెత్తున వున్న కబ్రూ పర్వతం వరకు వెళ్ళాను. మా జట్టులో నేనే చిన్నవాణ్ణి. కాని అందరికన్నా ఎక్కువ బరువు మోశాను. 80 పౌన్ల బరువుగల బియ్యం మూట నెత్తుకొని మొదటి కాంపుకు చేర్చాను. అంతవరకే నన్ను కూలీగా పెట్టుకున్నారు. మిస్టర్ కూక్, ఆయన స్నేహితుడు నవంబరు నెలలో కబ్రూ

పర్వత శిఖరానికి ఎక్కారు. అప్పుడు వారి వెంట షెర్పా ఒక్కడూ లేడు.

1936 లో మళ్ళా రెండు యాత్రలు జరిగాయి. ఆ రెంటిలో నేను పాల్గొన్నాను. మొదటి యాత్ర ఎవరెస్టు ఎక్కడానికి, ఆ జట్టులో ఎరిక్ షిప్టన్ వున్నాడు. అయితే ఆ పర్యాయం హ్యూ రూట్ లెడ్జి నాయకత్వం వహించాడు. ఆ యాత్రలో నన్ను డాక్టరు హాంఫీస్ వెంట వుంచారు. ఆయన యాత్ర జట్టుకు వైద్యుడు. ఆయన వల్ల నేను రోగాలను గురించీ అపాయాలను గురించీ ప్రథమ చికిత్సను గురించీ ఇంకా ఇతర విషయా లెన్నో నేర్చుకున్నాను. ఆ నేర్చుకున్నది తరువాత నాకు ఎంతో ఉపయోగించింది.

ఆ యాత్ర మీాద ఇంగ్లీషువారు ఎంతో ఆశపెట్టుకున్నారు. అంత పెద్ద యెత్తున అంత కట్టు దిట్టాలతో లోగడ యాత్రలు జరగలేదు. కాని మాకు అదృష్టం లేకపోయింది. మొదటి నుంచీ వాతావరణం భయంకరంగా వుంది. మేం పర్వతాన్ని చుట్టుతూ వుండగా వర్షాలు (మాన్సూన్) బాగా వుంజుకుంటున్నాయి. చివరకు ఎలాగో కొందరం కనుమ వద్దకు చేరాం. మంచు విపరీతంగా కురుస్తూంది. హోరుగాలివీస్తూంది. మళ్ళామంచు కురుస్తూంది. దొరల్లో కొందరు ఎలాగైనా పర్వతం ఎక్కడానికి సాహసించే వారనుకుంటాను. కాని రూట్ లెడ్జి, మనం ప్రాణాలకు తెగించడం మంచిది కాదు. ఈ సంవత్సరం కాకపోతే పై సంవత్సరానికైనా ఎవరెస్టు అక్కడే వుంటుంది అన్నాడు. ఇక లాభం లేదనుకొని అక్కడి నుంచే తిరిగి వచ్చాం.

కాలింపాంగ్ చేరాం. యాత్ర విఫలమైనందుకు అందరికీ అసంతృప్తి కలిగింది. అందులో నాకు ముఖ్యంగా రూట్ లెడ్జిని గురించి చాలా విచారం కలిగింది. ఆయన చాలా మంచి వాడు. సమర్థుడైన నాయకుడు. అప్పటికే వయస్సు దాటింది. ఇంకోసారి ఎవరెస్టు యాత్రకు పూనుకోవడం ఆయనకు సాధ్యంకాదు. అదే ఆయనకు కడపటి యాత్ర అయింది. యాత్రనుంచి తిరిగివచ్చిన తరువాత చాలాకాలం వరకు ఆయన్ను నేను చూడలేదు. కొన్నాళ్ళక్రితం లండనులో కలుసుకున్నాను. ఆయన నా చేయి పట్టుకొని "అబ్బాయీ! నీవు అద్భుతమైన కార్యాన్ని సాధించావు. నేను పెద్దవాణ్ణ య్యాను. నేనూ ఎవరెస్టు ఎక్కాలని ప్రయత్నించాను. కాని విఫలమైంది. ఆ పనిని నీవు సాధించావు కాబట్టి నాకు దిగులు లేదు. నీవు ఇండియాకు వెళ్ళినప్పుడు నా పిల్లా బిడ్డలకు నా ఆలింగనాన్ని అందించు" అన్నాడు.

ఆయన మమ్మల్ని బిడ్డలనడం న్యాయమే. మా కందరికీ ఆయన తండ్రిలాగానే వుండేవాడు.

## 5. పులికావడానికి

1936 లో ఎవరెస్టు యాత్ర విఫలమైన తరువాత నేను డార్జిలింగులో దీర్ఘకాలం వుండలేదు. ఢిల్లీకి ఉత్తరంగా మధ్య హిమాలయ ప్రదేశంలో వున్న ఘూర్వాల్ కు వెళ్తూ ఎరిక్ షిప్టన్ నన్నుకూడా తీసుకువెళ్ళాడు. నాలుగు సంవత్సరాల క్రితం సోలోఖుంబూనుంచి వచ్చినప్పటిలాగానే ఈ పర్యాటనం కూడా నాకు "మొదటి అనుభవాలు" చాలా కలిగాయి.

పల్లపు ప్రదేశాలకు దిగడమూ, రైలులో ప్రయాణం చేయడమూ, కలకత్తా ఢిల్లీ లాంటి పెద్ద పట్టణాలను చూడడమూ, ఎండ వేడిమి ఏలాంటిదో తెలుసుకోవడమూ, ఇవన్నీ మొదటిసారిగా నా అనుభవంలోకి వచ్చాయి.

రాణీఖేట్ వద్ద మిష్టర్ నన్ను మేజర్ బస్ట్రస్టర్‌కు పరిచయం చేశాడు. ఆయన రాయల్ ఇంజనీర్సుకు చెందినవాడు. ఇండియా సర్వే శాఖలో ఉద్యోగిగా వున్నాడు. నందదేవి శిఖరం వద్దకు సర్వే నిమిత్తం ఆయన వెళ్ళుచున్నాడు. ఆయనతో కూడా నేను వెళ్ళేట్లు ఏర్పాటైంది. ఆ సంవత్సరమే టిల్‌మన్, ఓడెల్ నందదేవి శిఖరాన్ని ఎక్కారు. మేము పర్వతం దగ్గరికి చేరేటప్పటికి వారు శిఖరాన్ని దిగి వస్తున్నారు.

ఆ సమయంలో నాకు జబ్బు చేసింది. పర్వత ప్రాంతంలో నాకు అంత జబ్బు ఎన్నడూ చేయలేదు. నా వొళ్ళు జ్వరంతో మండిపోతూంది. ఒకొక్కప్పుడు మేజరూ ఇతరులూ నన్ను మోసుక పోవలసి వచ్చేది. మేజరు చూపినంత దయ ఎవ్వరూ నా పట్ల చూపలేదు. ఒకనాటికి ఆయనకు నిజమైన సేవచేసి నాఋణం తీర్చుకోవాలని నాలో నేను ప్రమాణం తీసుకున్నాను. నన్ను పట్టుకున్నది పైత్య జ్వరమన్నారు. రాళ్ళమీద పెరిగే ఒకరకమైన నాచు తింటే జ్వరం నయమవుతుందని అక్కడి వాళ్ళు చెప్పారు. ఆ నాచును నీళ్ళలో కాచి ఆ వేన్నీళ్ళు తాగాను. వెంటనే కడుపులో వున్నదంతా బైటికి వచ్చేట్లు కక్కుకున్నాను. కాని జ్వరం వదిలింది. అటు తరువాత నాకు బలహీనంగా వున్నా జబ్బు పోయి మామూలు మనిషి నయ్యాను.

ఇది వరకు వెళ్ళిన వాళ్ళలాగానే మేం కూడా ఋషిగంగ కనుమగుండా నందదేవిపైకి ఎక్కాం. అక్కడ పుణ్య క్షేత్రంలో మకాం చేశాం. మేం విన్నట్టుగానే ఆ ప్రదేశం చాలా అందంగావుంది. అడవి పూలతో నిండిన పచ్చని బయళ్ళు, వాటిమీద మంచు కమ్మిన పర్వతం – నందదేవి అంటే పరమేశ్వరి. ఆ పర్వతాన్ని హిందువులు బ్రాహ్మలు పవిత్ర క్షేత్రంగా భావిస్తారు. అప్పటికి రెండు సంవత్సరాల క్రిందటి వరకు ఆ పర్వతం మొదటికి వెళ్ళిన మనిషి లేడు. అలా వెళ్ళ డం అసాధ్యం అనుకునే వాళ్ళు. "కాని ఏనాటికైనా నంద దేవి ఎక్కక పోతానా" అనుకున్నాను. అలాగే ఎక్కాను.

డార్జిలింగు సమీపంలో చూడదగిన స్థలాలకు తీసుకపోయి యాత్రికులవద్ద షెర్పాలు నాలుగు రూకలు సంపాదించు కుంటారు. నందదేవినుంచి వచ్చిన తరువాత నేనూ ఆ విధంగా సంపాదించుకునేవాణ్ణి. ఆ పట్టణానికి పైగా వ్యాఘ్ర పర్వతం వుంది. అక్కడికి యాత్రికులను తీసుకవెళ్ళేవాణ్ణి. సూర్యో దయం అయినప్పుడు ఆ పర్వతం వద్దనుంచి చూస్తే ఎవరెస్టు మొదలు కనిపిస్తుంది. నేపాలు పర్వత పంక్తులకు నూరు మైళ్ళదూరంలో వుంటుంది ఎవరెస్టు. ఒక చోటికి దూరం గానూ ఒక చోటికి కాస్త దగ్గరగానూ కనిపిస్తుంది. అంత దూరం నుంచి ఆ యెవరెస్టును కళ్ళతో చూచినా నాకు తృప్తికరంగా వుండేది. నా రాకకు నిరీక్షిస్తూ అక్కడే వుందని నా వూహ. అయితే దూరంనుంచి చూడడమే కాని దగ్గరకు వెళ్ళి ఎక్కలేక పోయినందుకు విచారంగావుండేది.

డేరాడూన్ స్కూలులో మిష్టర్ గిబ్సన్, మిష్టర్ మార్టిన్ ఉపాధ్యాయులు. వారివెంట 1937 లో నేను ఘూర్వాల్



బరువుమోస్తున్న తెన్సింగు

వెళ్ళాను. బందర్ పూంచ్ (కోతితోక) అనే పర్వతాన్ని ఎక్కాలని ప్రయత్నం చేశాం. గిబ్సన్‌తో నేను చేసిన మూడు యాత్రలలో అది మొదటిది. బందర్ పూంచ్ ఎత్తు 20, 720 అడుగులు. దాన్ని ఎక్కడానికి అంతకుముందు ఎవ్వరూ పూనుకోలేదు. ఎక్కడం చాలా కష్టం కూడాను. 17 వేల అడుగులు ఎక్కిన తరువాత బలంగా మంచుపడి పైకి వెళ్ళలేకపోయాం. మా మొదటి ప్రయత్నం అంతటితో ముగిసింది.

ఆ ప్రదేశాలను పరిశీలిస్తూ ఎక్కువ వారాలు గడిపాం. ఒక రోజు పెద్దనది ప్రక్కన మకాం చేసి రెండు ముఠాలుగా చీలిపోయాం. ముందు విపరీతంగా మంచు కురిసింది. తరువాత వాన పడింది. ఒకరి నొకరు చూడలేక పోయాం. గుడారం కూడా కనిపించలేదు. కేకలు పెడుతూ దారీ డొంకా లేకుండా తిరిగాం. ఎక్కడ తిరుగు తున్నామో మాకే తెలియదు. వాన వురవడికి మాటలు వినరావడంలేదు. ఒక గుహ కనిపించింది. అక్కడే రెండురోజులు గడపవలసివచ్చింది. తరువాత అంతా సర్దుకుంది. అందరం మకాం చేసిన చోటికి చేరుకున్నాం. అటు తరువాత టిబెటు సరిహద్దులో వున్న ఒక పల్లెకు ప్రయాణం కట్టాం. అది చాలా దూరంలో వుంది. ఆ తిరుగు ప్రయాణంలో ఒక కీకారణ్యంలో చిక్కుకున్నాం. ఆహార పదార్థాలు తరిగిపోయాయి. అడవిలో ఏవో పండ్లు దొరకడంచేత పస్తులు చేయలేదు. కాని ఆకలి తీరిందికాదు. అంతలో ఎవరో బాటసారులు సమీపగ్రామంనుంచి వెళ్లుతూ కనిపించారు. తిండ్లు ముగించుకోడానికి అక్కడ ఆగారు. వాళ్ళ వద్ద కావలసినన్ని ఆహారపదార్థాలువున్నాయి. డబ్బిచ్చి

కొనుక్కుందా మనుకున్నాం. వాళ్ళు అమ్మడం లేదని కచ్చితంగా చెప్పారు. హఠాత్తుగా నాకు ఒక ఊహ తట్టింది. ఆహారాన్ని పరాయివాడు ముట్టుకుంటే మైలపడుతుందన్న నమ్మకం వాళ్ళకుందని నాకు తెలుసు. " అదేమిటి ? ఇదేమిటి " అని అడుగుతున్నట్టుగా అన్నింటినీ ముట్టుకోమని గిబ్సన్‌తో చెప్పాను. వాళ్ళు ఆపేలోపుగానే ఆయన అన్నీ ముట్టుకున్నాడు. నేను అనుకున్నట్టుగానే వాళ్ళు అన్ని పదార్థాలు వదిలివేశారు. అన్నీ మాకు దక్కాయి. సాహెబులు వాటికి ఇరవై రూపాయలుఇస్తామన్నారు. కాని వాళ్ళు వప్పుకోకుండా తమ గ్రామపెద్దతో సిర్యాదు చేస్తామని బెదరిస్తూ వెళ్ళిపోయారు. మేం కడుపునిండా తిని వాళ్ళ గ్రామం తగలకుండా వేరేదారిన వెళ్ళాం.

మళ్లా డార్జిలింగులో రోజులు లెక్కపెట్టుకుంటూవున్నాను. 1938 వసంతంలో ఎవరెస్టుకు ఇంకో యాత్ర. అందులో నేను వున్నానని వేరే చెప్పడ మెందుకు ? ఎవరెస్టు యాత్రలలో అది ఏడవది. నాకు మూడవది. ఈ సారి హెచ్. డబ్ల్యు. టిల్‌మన్ నాయకుడు. 1936 దానికన్నా ఈ జట్టు చాలా చిన్నది. ఇందులో టిల్మన్ కాక ఎరిక్ షిప్టన్, ఫ్రాంక్ స్మిత్, వున్నారు. గత సంవత్సరం నేను నందదేవివద్ద కలుసుకున్న యన్. ఇ. ఓడెల్ వున్నాడు. పీటర్ లాయిడ్, కెప్టెను ఆలివర్ అన్న వారిద్దరు చేరారు. వీరిద్దరికీ యాత్రకు వెళ్ళడం అదే మొదటిసారి.

టిల్మాన్ చాలా మంచివాడు. ఎంతో సాధువు. ఆయనంటే షెర్పాల కందరికీ మహాప్రేమ. ఆయన కనుబొమ్మల వెంట్రుకలు వొత్తుగా వుండడచేత ఆయన్ను బాలూ (ఎలుగు

బంటి) అని పిలిచేవాళ్ళం. పర్వతాల మీందికి బాగా ఎక్క గల షెర్పాలకు పైకి చేరేవరకు బరువులు మోసేపనిలేకుండా చేసింది ఆయనే. అధికారికంగా పులి పతకాల పద్ధతిని ఏర్పాటుచేసింది కూడా ఆయనే. ఆ పద్ధతి ఈ నాడు హిమాలయ యాత్రలలో ఒక సంప్రదాయంగా స్థిరపడింది.

మామూలు మార్గానే ఎవరెస్టు ఎక్కడానికి బయలు దేరాం. ఏప్రిలు నెల మొదట్లో రాంగ్‌బక్ మఠానికిమీదుగా వున్న మా క్రింది మకాంకు చేరాం. అక్కడికి మా తండ్రి వచ్చాడు. యాత్ర సంగతి తెలిసి నన్ను చూడాలని వచ్చాడు. అదే ఆయన్ను చివరిసారి నేను చూచింది. నేను తిరిగి వచ్చేలోపుగానే ఆయన మా గ్రామంలో మరణించాడు. ఆయన నన్ను ఎంతో ప్రేమించేవాడు. ఆయన్ను ఎల్లప్పుడూ భక్తితో స్మరిస్తూవుంటాను.

మంచు మైదానాల నుంచి మేం నేరుగా ఉత్తరపు కనుమ వద్దకు వెళ్ళలేదు. 1935 లో లాగానే అంత కంటే మంచి దారి వుందేమోనని చుట్టూ వెదికాం. నేనూ, టిల్మన్, ఇంకా ఇద్దరు షెర్పాలు, ఆంగ్ త్సేరింగ్, జింగ్మే కలిసి లోలా ఎత్తు కనుమకు ఎక్కాం. అక్కడికే ఒకప్పుడు మల్లొరీ వెళ్ళాడు. ఆ యెక్కడం నాకు ఒక గొప్పగా తోచింది. అక్కడినుంచి ఎవరెస్టును రెండు వైపులా చూడ గలిగాను. లోలామీద వుండగా మంచూ మేఘాలూ దట్టంగా పట్టాయి. ఆ పైకి ఎక్కడం ఏలాగో గోచరించింది కాదు. అటుతరువాత పదిహేనుసంవత్సరాలకు ఆ మార్గాన్నే నేను ఆ శిఖరానికి ఎక్కుతానని ఊహించలేక పోయాను.

తిరిగి క్రింది మకాంకుచేరి ఉత్తరపు కనుమవద్దకు ప్రయాణ మయ్యాం. ఆ కనుమ క్రిందిస్లోపులలో మంచుకరుళ్ళ ప్రమాదం వుంది. నేను మొదటిసారిగా అందులో చిక్కుకున్నాను. ఆ సమయంలో మేం ఆరుగురం అంచెలుగా ఎక్కుతున్నాం. కెప్టెను ఆలివర్, నేనూ, ఇంకో షెర్పా ఒక అంచెలో వున్నాం. టిల్మాన్ ఇద్దరు షెర్పాలతో ఇంకో అంచెలో వున్నాడు. మంచు కరుళ్లు నిటారుగానూ లోతుగానూ వున్నాయి. మా నడుముల యెత్తున వున్నాయి. మేం కష్టంతో మెల్లగా పోతున్నాం. ఆకస్మికంగా మా చుట్టూ ఏదో పగులు తూన్న శబ్దం అయింది. మంచుకరుళ్లు కదులుతూ వున్నాయి. ఒక్క నిమిషంలో దాని వెంట అందరం క్రిందికి జారుతున్నాం. నాకు కాళ్ళ పట్టు తప్పింది. దొర్లి పోతున్నాను. నా తల మంచులో పూడుకుంది. అంతా చీకటి. అయినా నేను పెనుగు లాడుతున్నాను. ఏలాగో నిలవ దొక్కుకుని మంచుగొడ్డలితో కరుళ్ళను త్రవ్వడానికి ప్రయత్నించాను. అదృష్ట వశాత్తు జారుతూవున్న మంచుకరుడు ఆగింది. నేను కొంచెం పైకి వచ్చాను. నా గొడ్డలి గట్టి మంచుకు పట్టుకుంది. ఆ పట్టుతో నేను లేచి నిలబడగలిగాను. వెలుతురులో చుట్టూచూచాను. ఇంకా నేను బ్రతికే వున్నాను. ఆ నాటికి అందరం అదృష్టవంతు లమే. మంచు కరుడు జారడం ఆగి అందరం బైటపడ్డాం. అయితే మా క్రింద పది అడుగులలో పెద్ద గోయి వుంది. ఆ గోతిలోకి జారివుంటే ఇక బైటికి రావడం వుండేదికాదు.

ఉత్తరపు కనుమవద్ద నాలుగో మకాంచేశాం. ఈశాన్యంగా పర్వత పంక్తులవెంట బరువులు మోసుకొని పైకి ఎక్కి పోయాం. 25,800 అడుగుల యెత్తున మా అయిదో మకాం

చేరాం. అంత ఎత్తుకు నేను అదివరకు ఎక్కకపోయినా నాకు శ్రమగా లేదు. అయిదో మకాంలో కొంచెం ఆగి ఇంకా పైకి వెళ్ళాలనుకున్నాం. కాని మా వెనక గుడారాలు, మా వంట చెరుకునూ కనుమ దగ్గరనుంచి మోసుకు వస్తూన్న ఇద్దరు షెర్పాలు అయిదో మకాం వరకు రాలేక పోయారు. ఆ వస్తువులు లేకుండా మేం పైకి పోవడం సాధ్యం కాదు. మా వెంటవున్న షెర్పాలు క్రిందికి దిగితే మళ్ళాపైకి రాలే మన్నారు. నేనే వెళ్ళి ఆ సామాను మోసుకువస్తానని బయలు దేరాను.

నేను ఒంటరిగా దిగాను. కనుమదగ్గరనుంచి సగం దూరం వరకువచ్చి గుడారాన్నీ వంటచెరుకునూ అక్కడ విడిచిపెట్టి ఇద్దరు షెర్పా పోర్టర్లు వెళ్ళిపోయారు. ఆ బరువులను వీపున ఎత్తుకొని నేను మళ్ళాపైకి బయలుదేరాను. అంతలో నా కాళ్ళు జారాయి. తరువాత తరువాత యాత్రల్లో ఉక్కు మేకులు వేసిన పాదరక్షలను ఉపయోగించడం వచ్చింది. వాటినే క్రాంపన్లు అంటారు. అప్పటికి వాటి వాడకంరాలేదు. అవి వేసుకుంటే మంచులో జారకుండా నిలవదొక్కుకోవచ్చు - ఆజారడంలో ఏలాగో గొడ్డలి పట్టుతో తట్టుకున్నాను. నేను జారేవుంటే క్రింద మైలు దూరంలోవున్న రాంగ్‌బక్ మంచు మైదానంలో పడివుండేవాణ్ణి. నేను తట్టుకుని నిలబడడం గొప్ప అదృష్టం అనాలి. ఆ యాత్ర ముగిసిన తరువాత నాకు ఇరవై రూపాయలు బహుమానం ఇచ్చారు.

చీకటి పడేలోపుగా బరువులతో ఐదవమకాం వద్దకు చేరాను. షిప్టన్ స్మితే నన్ను అభినందించారు. ఆ మరుసటి రోజు మళ్ళా బయలుదేరి ఇంకాపైకి ఎక్కాం. అది ఆరో

మకాం. అక్కడికి ఎత్తు 27,200 అడుగులు. 1952 లో స్విస్ వారితో ఎవరెస్టు అవతలవైపు ఎక్కేవరకు, ఇంత ఎత్తు నేను పోలేదు. దొరలకు పర్వత శిఖరం మీదికి ఎక్కాలనే వుంది. చలీ, గాలీ అంత ఎక్కువగా లేకపోయినా మంచు లోతుగా పేరుకున్నది. అడుగుతీసి అడుగుపెడితే కంఠం వరకు దిగబడుతున్నది. ఇంకా మంచు తెరిపిలేకుండా కురుస్తూనే వుంది. ఋతుపవనాలు (మాన్సూన్) ముందుగానే ప్రారంభమయినాయి. శిఖరానికి ఎక్కే ఆశ కనిపించలేదు.

ఆక్సిజను వాయువును ఉపయోగించే పద్ధతిని ఆ యాత్రలో నేను మొట్టమొదట గ్రహించాను. ఆక్సిజన్ను వాడడం టిల్మన్ కు ఇష్టం లేదు. అది లేకుండానే ఎవరెస్టు శిఖరానికి చేరగలమని ఆయన నమ్మకం. మాలో చాలా మంది దాన్ని వాడలేదు. ఆ సామగ్రినంతా లాయడ్ కూడా తెచ్చాడు. దాన్ని వాడడానికి చాలా ప్రయత్నాలు చేశాడు. దాన్ని చూస్తేనే నాకు విడ్డూరంగా వుండేది. షెర్పాలు దాన్ని "ఇంగ్లీషుగాలి" అంటూ ఎగతాళిగా నవ్వుకునేవాళ్ళు.

ఉన్నత ప్రదేశాలకు వెళ్ళిన షెర్పాలకు పులి బిరుదాన్ని, పులి పతకాన్ని బహుమతించే పద్ధతికి అధికారామోదాన్ని సంపాదించిన వాడు టిల్మన్. ఈ యాత్రలోనే దానికి ప్రారంభం. 1938 లో ఆరో మకాంకు చేరిన మా జట్టులో అందరికీ తరువాత పులి పతకాలను బహుమతి చేశారు. ఆ విధంగా మారికార్డు పుస్తకాల్లోకూడా ఎక్కించారు. అటు తరువాత హిమాలయన్ క్లబ్ యాత్రలలో సమర్థతతో పని చేసిన షెర్పాల కందరికి ఆ పతకాల నిచ్చింది. మొట్టమొదటి పులుల్లో ఒకణ్ణయి నందుకు నాకు ఆనందం కలిగింది. అది

నాకు గర్వకారణం కూడాను. డార్జిలింగుకు తిరిగి వచ్చిన తరువాత అనుకున్నాను; "1939 లోనో 1940 లోనో అసలు శిఖరానికి ఎక్కిక పోతానా" అని. పధ్నాలుగు సంవత్సరాల తరువాత నా వాంఛ సిద్ధించింది.

## 6. యుద్ధకాలం

పర్వత యాత్రలు చేసే షెర్పాలబ్రతుకు చాలావరకు నావికుడి బ్రతుకు లాంటిది. అన్నీ అనుకూలంగా ఉంటే షెర్పా సామాన్యంగా ఇంటిపట్టున వుండడు. తన భర్త వెళ్ళేచోట స్త్రీవ్యసనానికి అవకాశము వుండదని షెర్పా భార్యకు తెలుసు. అందుకోసం భర్త వెళ్ళుతూన్నందుకు భార్య ఆందోళన పడదు.

1938 లో నేను ఘూర్వాల్ వెళ్ళాను. మళ్ళా మేజరు ఓస్మస్టన్ సర్వే పనిమీద వెళ్ళుతూవుంటే కూడా వెళ్ళాను. ఈ తడవ ఆల్మోరా ప్రదేశాన్ని చూచాం. ఇండియా ఉత్తరపు సరిహద్దు అక్కడ టిబెట్టును తూర్పునేపాలును స్పృశిస్తుంది. అదంతా అరణ్యప్రదేశం. పరదేశి అక్కడికి వెళ్ళడం చాలా అరుదు. టిబెటు సరిహద్దునుంచి కైలాస పర్వతాన్ని చూడవచ్చు. ఆ పర్వతం ఎత్తు 22,000 అడుగులు. హిమాలయ శిఖరాలన్నింటిలోనూ బౌద్ధులకు హిందువులకు కూడా అతి పవిత్రమైంది కైలాస పర్వతశిఖరం. ఆపర్వతానికి సమీపంలోనే ప్రసిద్ధమైన మానససరోవరాలు వున్నాయి. అవి కూడా పవిత్ర తీర్థాలే. అక్కడనే ఒక ప్రసిద్ధమఠం వుంది. ఏషియాలో దూరప్రాంతాలనుంచి ఆ స్థలాలకు యాత్రికులు

పూర్వంనుంచీ వస్తూవున్నారు. నాకూ అక్కడికి వెళ్ళాలని పించింది. కాని నేను ఆర్కోరాను దాటి వెళ్ళలేదు.

తిరిగి డార్జిలింగుకు వచ్చి శీతకాలం నా భార్యతో గడిపాను. ఆ సంవత్సరం నాభార్య ఆడశిశువును కన్నది. దానికి పేం పేం అని నామకరణం చేసుకున్నాం. అప్పటికి మా అబ్బాయి నిమాడోర్జేకు మూడేండ్లు వెళ్ళాయి. చాలా అందంగా తీరాడు. వాణ్ణిచూచి అప్పుడప్పుడు, "వీడు పెద్దవాడై నాలాగే పర్వతాలు ఎక్కుతాడు. పులులలో పెద్దపులి అవు తాడు. అనుకునే వాణ్ణి.

1939 వచ్చింది. వసంత ఋతువులలో కొత్త యాత్రకు వెళ్ళాను. మిసెస్ బెరిక్ స్మీటన్ అనే కెనడా స్త్రీ ఒకామె హిమాలయన్ క్లబ్ ద్వారా పెర్పాలను కుదుర్చుకోడానికి డార్జిలింగు వచ్చింది. ఆమె ఎక్క దలచుకున్నది ఆ సమీపంలో పర్వతం కాదు. తిరిచ్ మీర్ శిఖరాన్ని ఎక్కా లని ఆమె ప్రయత్నం. ఆ పర్వతం హిమాలాయాల్లోది కాదు. ఇండస్ నదికి అవతల హిందూకుష్ పర్వత పంక్తిలోనిది. కొద్దిమంది పెర్పాలను కలుపుకుని నేను వెళ్ళడానికి నిశ్చ యించుకున్నాను. ఆలా నిశ్చయించుకోని పక్షంలో పై ఆరు సంవత్సరాలూ నా జీవితం వేరు విధంగా వుండేదని కొంత కాలానికి నేను గ్రహించ గలిగాను.

చిత్రాల్ పట్టణంలో ఏర్పాటులన్నీ ముగించుకుని తిరిచ్ మీర్ ఎక్కడానికి వెళ్ళాం. ఆ పర్వతం అంపన్నైంది. పెద్దది. 25,260 అడుగుల ఎత్తు. అసలు మాది మితమైనయాత్ర. మనుషులూ, సామగ్రీ రెండూ తక్కువే. అప్పటికే జాస్తి అనిపించింది. గాలీ, చలీ, చూస్తే మంచుబాధను గురించి

చాలా భయంవేసింది. అప్పటికి 23 వేల అడుగులవరకు ఎక్కాం. మిసెస్ స్మీటర్ అంతవరకు మాతో నడిచింది. ఒకస్త్రీ అలా ఎక్కడం ఆశ్చర్యకరం. అక్కడినుంచి వెనక్కు మళ్ళాం.

తిరిచ్ మీర్ పైన పెర్యాలున్నూ, ఇతర కూలీలున్నూ నా అజమాయిషీలో వున్నారు. కాని 1947 వరకు నేను సర్దారుగా గుర్తించబడలేదు. యాత్రలలో పోర్టర్లపైన అధికారిని సర్దారంటారు. తిరిచ్ మీర్ వెళ్ళుతూ నేను మేజరు వైట్ అనే దొరను కలుసుకున్నాను. యాత్ర నిర్వాహకంలో ఆయన చాలా సహాయం చేశాడు. ఆయన చిత్రాల్ స్కౌటు అధికారిగా వున్నాడు. నన్ను తనవద్ద వుండమన్నాడు. అలాగే వుండిపోయాను. మొదలు కొద్దికాలంవుండి యింటికి వెళ్లుదామనుకున్నాను. కాని ఆయన కొలువు నాకెంతో నచ్చి దాదాపు సంవత్సరం ఆఖరుదాకా అక్కడే వున్నాను.

అంతలో డార్జిలింగునుంచి ఒక దుర్వార్త తెలిసింది. మాఅబ్బాయి నిమాడోర్జే రక్తవిరేచనాలవల్ల చనిపోయాడు. వాడికి అప్పటికి నాలుగోయేడు. నేను ఇంటికి వెళతానని మేజరు వైట్‌తో చెప్పాను. 1940 ప్రారంభంలో ఇంటికి వచ్చాను.

నా భార్యకు మళ్ళా ఆడబిడ్డ పుట్టింది. దానికి నిమా అని పేరు పెట్టుకున్నాం. నేను డార్జిలింగులో కొద్దికాలమే వున్నాను. నాకు చిత్రాల్ లో చాలా సుఖంగా వుండేది. పైగా యూరపులో యుద్ధం జరుగుతూ వుంది. పెద్ద యాత్రలకు అవకాశం లేదు. అందుకోసం నా భార్యను ఇద్దరు కూతు

ళ్ళను వెంట పెట్టుకొని చిత్రాల్ కు వెళ్ళాను. అటుతరువాత అయిదేండ్ల వరకు నేను డార్జిలింగుకు తిరిగి రాలేదు.

మేజరు వైట్ మమ్మల్ని ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు. కొద్దికాలం ఆయన వద్ద నౌకరీ చేశాను. తరువాత తన భోజనశాలలోకి తీసుకున్నారు. అక్కడ పడమటి దేశస్థుల అలవాట్లను గురించీ ఆహారపద్ధతులను గురించీ అన్ని సంగతులూ తెలుసుకున్నాను. పాక కళలో మంచి నేర్పు గడించాను. తరువాత భోజనశాలలో ముఖ్య పెత్తనదారునయ్యాను. ఆకాలంలో "పర్వతాలు ఎక్కడం ఆగిపోయినా హోటలు పెట్టుకొని బ్రతకవచ్చునని" అనుకునేవాణ్ణి.

స్కాటు పటాలం వాయువ్యసరిహద్దును చుట్టుకుని తిరుగుతూ వుండేది. నేనూ కూడా వెళ్ళాను. మేజరు వైట్ నన్ను కన్న కొడుకులాగా చూచుకునేవాడు. మంచి దుస్తులు ఎన్నో బహుమతులు ఇచ్చేవాడు. ముఖ్యంగా సొంత ప్రయాణాల్లో నన్ను వెంటబెట్టుకుని వెళ్ళేవాడు. శీతకాలంలో కాశ్మీరుకు వెళ్ళాం. అక్కడ నేను "స్కీ" నేర్చుకున్నాను. "స్కీ" అంటే కాళ్ళకు ఒక రకం చెక్కలు కట్టుకుని మంచు మీద వడిగా జారుతూ పోవడం ఆలా పోవడం నాకు చాలా కులాసాగా వుండేది. దానివల్ల ఎప్పటికైనా పర్వతాలను ఎక్కడంలో ఉపయోగం వుండవచ్చునని మేజరు వైట్ సలహా యిచ్చాడు. అయితే నేను "స్కీ" చేసినవి లోగడ ఎక్కిన పర్వతాల వంటివికావు. నిజానికి అవి పర్వతాలే కావు చిన్నకొండలు కాని "స్కీ" చేస్తూపోయినంత వడిగా నా జీవితంలో ఎన్నడూ పోలేదు. రైలు మీద కూడాను.

అందుకే అది నాకు బాగా నచ్చింది. ఎక్కడమంటే మెల్లగా ఎక్కాలి. "స్కీ" చేయడం ఎంత వడిగా నైనా చేయవచ్చు.

చిత్రాల్‌లో పెర్సాలు ఎవరూ లేరు. ఇంగ్లీషువారు, ఇండియన్లు, టర్కులు, ఆప్ఘనులు, హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, యూదులు వున్నారు. నేను హిందూస్తానీ, చిత్రాలీ, పుస్తుభాషలు మాట్లాడడం నేర్చుకున్నాను. ఇంగ్లీషును వృద్ధిచేసుకున్నాను. ఒకరోజు మేజరువైట్ నా పేర వచ్చిన ఉత్తరం చదివి వినిపించాడు. 1938 లో ఎవరెస్టు యాత్రలో నేను చేసిన కృషికి "పులి" హోదాను యిచ్చినట్టు అధికారికంగా తెలిపారు. కాని 1945 లో నేను ఇంటికి చేరిన తరువాత ఆ పతకం నాకు అందింది.

అంతకాలం యుద్ధం సాగుతూనేవుంది. నానాటికి పెరుగుతూవుంది కూడాను. యుద్ధం ఆలావుండగా ఇండియాలో స్వాతంత్ర్యానికి పోరాటం జరుగుతూంది. కొత్తగా పాకీస్తాన్ ఏర్పడగలదని చెప్పుకుంటున్నారు. తరువాత చిత్రాల్ పాకీస్తానులో చేరింది. నేను హిందువును కాకపోవడంచేత నాకు ఏలాటి ఇబ్బందులు కలగలేదు.

చిత్రాల్‌లో కొంత ద్రవ్యాన్ని సంపాదించుకో గలిగేవాణ్ణని తరువాత నాకు తెలిసింది. ఆ ప్రదేశాల్లో చాలా విలువగల రాళ్ళు (రత్నాలు వగైరాలు) దొరుకుతాయి. అవి ఎల్లప్పుడూ దొరుకుతాయి. అవి విలువగల రాళ్ళని నాకు తెలియదు. వాటిని తేయాకుకు తినుబండారాలకు మార్పిడి చేయడం అక్కడ మామూలు. నేను డార్జిలింగుకు తిరిగి వస్తూ కొన్ని రాళ్ళు పట్టుక వచ్చాను. ఆ పట్టణంలో వర్తకులు వాటిని చూచి పొంగిపోయారు. అవి విలువగల రాళ్ళని

చెప్పారు. కొందరు మిత్రులు నన్ను మళ్ళా చిత్రాల్‌కు వెళ్ళి జాస్తిగా ఆ రాళ్ళను తీసుక రమ్మని తొందరపెట్టారు. వాటిని అమ్మితే చాలా ద్రవ్యం వస్తుందన్నారు. కాని నేను వెళ్ళ లేదు. ద్రవ్యం సంపాదించడం నాకు ఇష్టమే. కాని ఏదో వ్యాపారంచేసి అందులో నెగ్గగలనన్న నమ్మకం నాకు లేదు.

చిత్రాల్‌లో మేజరు వైట్ కాక ఇంకొకరితో నాకు మంచి స్నేహం కుదిరింది. ఆయన డాక్టరు యస్. డి. జేకబ్. అక్కడ సివిల్ సర్జనుగా వున్నాడు. చాలా ప్రముఖుడు. ఇండియాలో కొందరు ఇంగ్లీషు వారి లాగా ఆయనకు బిరుసు తనం వుండేదికాదు. నాకూ నాకుటుంబానికీ ఎంతో దయతో సహాయం చేసేవాడు. ఒక మహారాజాకు, ఒక మేజరు జనరలుకు చేసినట్టు మాకు చికిత్సలు చేసేవాడు. 1953 లో నేను లండనుకు వెళ్ళినప్పుడు ఆయన్ను కలుసుకున్నాను. నన్ను చూడాలని అయిదువందలమైళ్లు ఆయన ప్రయాణం చేశాడని తెలిసి నా మనస్సు ఎంతో చలించింది. ఆయన్ను చూచి నేను చాలా ఆనందపడ్డాను.

చిత్రాల్‌లో వుండగా నా భార్య ఆరోగ్యం చెడింది. అక్కడి శీతోష్ణస్థితి ఆమెకు సరిపడిందికాదు. డాక్టరు జేకబ్ తనకు చేతనైన చికిత్సలన్నీచేశాడు. కాని క్రమక్రమంగా క్షీణించింది. 1944 లో ఆమె కాలం చేసింది. ఆమె పోవడం నాకూ ఆడపిల్లలకూ ఘోరమైన ఆపత్తు అయింది. పేంపేంకు అయిదో యేడు. సీమాకు నాలుగో యేడు. కొంతకాలం ఒక ఆయాను పెట్టుకున్నాను. కాని సరిగా పని చేసింది కాదు. 1945 లో తిరిగి డార్జిలింగుకు వెళ్ళాలని నిశ్చయించు కున్నాను.

అన్ని సంవత్సరాల్లో నేను నిలవచేసుకున్నది పదిహేను వందలరూపాయిలు. ఒక గుర్రాన్ని అద్దెకు తీసుకున్నాను. దాని మీాద అటూ ఇటూ రెండు సంచులు తగిలించి ఇద్దరు పిల్లలను వాటిలో కూర్చోపెట్టాను. చిత్రాల్‌నుంచి దీర్ నగరం దాకా పర్వతమార్గంగుండా గుర్రాన్ని తీసుకవెళ్ళాను. దీర్‌నగరంవద్ద రైలు వుంది. అక్కడ ప్రయాణీకులు గుంపులుగా కాచుకొని వున్నారు. ఎన్నాళ్లున్నా నాకు రైలు చిక్కింది కాదు. పిల్లలను చూస్తే నా మనస్సు నిలవడం లేదు. ఏం చేయాలో తోచిందికాదు. చివరకు మంచి వూహా తోచింది. మేజర్ వైట్ నాకు తన పాతయూనిఫారం ఒకటి యిచ్చాడు. దాన్ని వేసుకుంటే పక్కా ఆఫీసరు లాగా వున్నాను. ఆ వేషంతో స్టేషనుకు వెళ్ళాను. మిలిటరీ రైలు వచ్చింది. పిల్లలతో కూడా మొదటి తరగతి పెట్టెలో ఎక్కి కూర్చున్నాను. ఒక్క కానీ ఖర్చులేకుండా ముగ్గురం ఇండియాకు చేరాం.

డార్జిలింగు వద్ద సిలిగురీలో యూనిఫారం విప్పివేశాను. అక్కడ నన్ను తెలిసిన మనుషులు వున్నారు. మారువేషంలో ప్రయాణంచేసినట్టు తెలిస్తే అరెస్టు కావచ్చుకూడా. మిగతా ప్రయాణం బస్సులో చేశాం. అయిదు సంవత్సరాలకు తిరిగి ఇంటికి చేరుకున్నాం. నా పాత స్నేహితులకు నేను కొత్తగా కనిపించాను. నా దుస్తులకు నా మాటలకు వాళ్ళు విస్తుపోయి చూచాను. నన్ను "పటాన్" అనే వాళ్ళు కొంత కాలం.

చిత్రాల్‌లో నాకు సుఖంగా గడిచినా, ఇంటికి రావడం సంతోషంగావుంది. కాని ఆడపిల్లలది ఒక సమస్య అయింది. ఒంటరి మగవాడికి ఆ కష్టం తెలుస్తుంది. నా స్నేహితులు

మంచి సంబంధం చూచి పెండ్లి చేసుకోమని సలహా చెప్పారు. సలహా బాగానే వుంది. ఎవరిని చేసుకోవడం? మళ్ళా నాకు అదృష్టం కూడి వచ్చింది. ఒకప్పుడు నాతో పాల బేరం చేసిన ఆంగ్ లామూను కలుసుకున్నాను. ఆమె దావాఫుటీకి రక్తబంధువట! ఆమెను పెండ్లి చేసుకున్నాను. నా బిడ్డలకు ఒక తల్లి దొరికింది. ఈ రెండో పెండ్లి చేసుకోవడం నా జీవితంలో ఎంతో మేలైంది.

## 7. పర్వతాలు ఇంకా అక్కడే వున్నాయి

"యేతీ" ని గురించి నాకు తెలిసిన సంగతులు ఈ ప్రకరణంలో చెపుతాను. "యేతీ" ని మంచు మనిషి అంటారు. అది మనిషో మృగమో తెలియదు. దాని స్వభావం చాలా చెడ్డదని వాడుక. 1946 లో జెమూ హిమానీ ప్రదేశంలో మొదటిసారి దాని అడుగు గుర్తులు చూచాను. తరువాత 1952 లో ఎవరెస్టు పర్వతం మొదట్లో అలాంటి అడుగు గుర్తులే చూచాను. సోలో ఖుంబూలో వుండగా నా చిన్నతనంలో హిమానీ ప్రదేశాలమీదనూ కొండల ప్రక్కనూ జంతువుల గుర్తులు చూచాను. అవి "యేతీ" గుర్తులే నని నా నమ్మకం.

"యేతీ" ని గురించి మా తండ్రి చెప్పిన కథ లున్నాయి. "ఈ విచిత్ర జంతువును బెరూన్ హిమానీ ప్రదేశంలో మొదటి సారిగా చూచాను. ఆకస్మికంగా కనిపించింది. స్పష్టంగా చూడదగినంత దగ్గరలోకి వచ్చింది. అది ఒక పెద్ద కోతి. ఏప్ – లాగా వుంది. దాని కళ్లు లోతుకు పీక్కొనిపోయి వున్నాయి. దాని తల పైకి కోసుగావుంది. బూడిద రంగుగా

వుంది. నడుము క్రిందికీ నడుముపైకీ వెంట్రుకలు పెరిగి వున్నాయి. రమారమి నాలుగు అడుగుల ఎత్తున వుంది. అది ఆడది. స్తనాలు పొడుగ్గా జారివున్నాయి. వెనక రెండు కాళ్ళ మీద పరుగెత్తుతూ చేతులతో స్తనాలను ఎత్తి పట్టుకుంది. దాన్ని చూడగానే నాకు భయంవేసింది. అది పక్కకు తిరిగి ఏటవాలుగావున్న కొండను ఎక్కిపోయింది. పోతూ కీచుమని ఈలవేసింది. మళ్ళీకనపడలేదు." ఇది ఆయన మొదటి అనుభవం. అటు తరువాత తనకు ఏం జరుగుతుందో నని ఆయన ఆందోళన పడ్డాడు. ఏమంటే, "యేతీ" ని చూస్తే త్వరలో మరణం తప్పదని వాడుకగా చెప్పుకుంటారు. కాని అదృష్టం వల్ల ఆయన బ్రతికాడు. దాదాపు ఒక సంవత్సరంపాటు జబ్బు మాత్రం చేసిందట.

1935 లో నేను మొదటి ఎవరెస్టు యాత్రకు వెళ్ళినప్పుడు మా తండ్రి నన్ను చూడడానికి రాంగ్‌బక్‌కు వచ్చాడు. మొదటిమకాం వద్ద ఆయన ఒకరాత్రి వంటరిగా గడిపాడు. తెల్లవారబోతూవుండగా గుడారం వెలపల ఈల వినపడిందట. బైటికి చూడగానే అల్లంతదూరంలో మంచుమీద దక్షిణం నుంచి ఉత్తరానికి దిగి వస్తూన్న జంతువు కనపడిందట. ఆయనకు భయం పుట్టింది. "యేతీ"ని చూడాలని లేకపోయినా గుడారంలో దాక్కుంటే దగ్గరికివచ్చి లోపలికి జొరబడుతుందేమో అన్న భయంవేసి అది వెళ్ళిపోయేవరకు కదలకుండా కూర్చున్నాడట. నన్ను కలుసుకోగానే కావిలించుకుని నాయనా! నిన్ను చూడాలని వచ్చాను. నీ కన్నాముందు "యేతీ"ని చూచాను అన్నాడు. కాని ఈ పర్యాయం దగ్గరలోకి రాకపోవడంవల్ల ఆయనకు తరువాత జబ్బుచేయ లేదు.

హిమాలయ ప్రదేశాల్లో "యేతీ"ని గురించి ఏవో కథలు చెప్పుకుంటారు. అందులో నిజమెంతో చెప్పడం కష్టం. అవన్నీ ఊహలు కావచ్చు. మూఢవిశ్వాసాలు కావచ్చు. సోలో ఖుంబూలో ఒక కథ వుంది. చాలా యేండ్లక్రితం యేతీలు గుంపులుగావచ్చి తర్‌గ్నా గ్రామం చుట్టుకొని మకాం చేశాయట. అక్కడ షెర్పాలు ఇళ్ళుకట్టుకుంటూ వుంటేనూ పొలాల్లో పైర్లు వేసుకుంటేనూ యేతీలు రాత్రిళ్లువచ్చి తారుమారు చేసేవట. మరుసటిదినం అంతా మొదలెత్తుకోవలసి వచ్చేదన్నమాట. కాని యేతీలు ఆ యిండ్లనూ పైర్లనూ భగ్నంచేయకుండా తమ పద్ధతిప్రకారం యిండ్లను మార్చి కట్టడం, పైర్లను తిరిగినాటడం చేసేవట! వాటిపద్ధతులు ప్రజలకు పనికివచ్చేవికావు. వాళ్లకు విసుగెత్తిపోయింది. ఎంత వెదికినా అవి కనపడేవికావు. చివరకు ఒక ఉపాయంపన్నారు. చాంగ్ అనే ఘాటైన షెర్పాసారాయిని కుండల్లోనింపి యేతీలు గుమికూడేచోటపెట్టారు. ఆ కుండలవద్దనే కుక్రీలనే వంకరనేపాలీ కత్తులను పెట్టారు. యేతీలువేసిన పేడనుబట్టి ఫలానిచోట చేర్తాయని తెలుసుకున్నారు. వాళ్లు అనుకున్నట్లే యేతీలు రాత్రిపూటవచ్చి ఆ సారాయినితాగి కుక్రీలతో ఒకదాన్నొకటి పొడుచుకొని చచ్చిపోయాయట. అప్పటినుంచి ప్రజలకు ప్రశాంతి చిక్కి క్షేమంగా వున్నారట.

యేతీలు రెండురకాలని షెర్పాలు చెప్పుకుంటారు. మనుష్యులను తినేవాటిని మేత్రీ లంటారు. జంతువులను తినేవాటిని ఛూత్రేలంటారు. ఈ రెంటిలో ఛూత్రే పెద్దది. పెద్ద ఎలుగుబంటిలాంటిదట. యేతీలకు కాళ్లుమాత్రం వెనక్కుతిరిగి వుంటాయట. కొంతమంది పాశ్చాత్యులు వైజ్ఞానికులు అవి ఒకరకం

ఎలుగుబంట్లని అభిప్రాయపడ్డారు. ప్రసిద్ధవైజ్ఞానికుడు జూలియన్ హక్స్లే డార్జిలింగుకు వచ్చినప్పుడు నేను కలుసుకున్నాను. ఆయన అభిప్రాయంకూడా అదే. "ఏప్"(పెద్దకోతి) లాంటిదని కొందరి నమ్మకం. మా తండ్రి వర్ణనకూడా ఆలాగే వుంది.

నా మట్టుకు నేను ఎన్నడూ యేతీని చూడలేదు. వెనక్కు నడుస్తుందో ముందుకు నడుస్తుందో తెలియదు. నాకు మూఢ విశ్వాసాలు లేవు. ప్రకృతికి అతీతమైన విషయాలను నేను నమ్మను. నేను విన్న కట్టుకథలమీద కూడా నాకు నమ్మకం లేదు. కాని మా తండ్రి అబద్ధం చెప్పాడని నేను అనజాలను. 1946 లో జెమూహిమానీ ప్రదేశం మీదనూ, 1952 లో ఎవరెస్టువద్దనూ పాదాల గుర్తులు చూచాను. అవి నాకు తెలిసిన ఏ జంతువు పాదాలు లాగా లేవు. నేను గుజువు చూపలేక పోయినా ఆ ప్రదేశాల్లో ఏదో జంతువు తిరిగిందని మాత్రం నాకు రూఢి అయింది. అది మనిషి కాదని, జంతువే నని నా నమ్మకం – అది విశేషంగా రాత్రిళ్ళు తిరుగుతూందనీ, చెట్ల ఆకులను చిన్న జంతువులను తిని బ్రతుకుతుందనీ నాకు తోస్తుంది. బహుశా అది మన కింతవరకు తెలియని ఒక రకం కోతి జాతికి చెందింది కావచ్చు.

1954 లో ఎవరెస్టు ప్రదేశానికి ఒకయాత్ర జరిగింది. అందులో బ్రిటిషువారు ఇండియన్లు కూడా వున్నారు. ప్రత్యేకంగా "యేతీ"ని వెదికే నిమిత్తం ఆ యాత్ర జరిగింది. ఆ యాత్రలో నేను పోలేకపోయాను. అందరికి కనపడ్డట్టే వారికి పాదాల గుర్తులు, ఇతర చిహ్నాలు కనిపించాయి. కాని "యేతీ" ప్రత్యక్షంగా ఎక్కడా కనిపించలేదు. మనం

ఎన్నో చోట్లకు వెళ్ళుతాం. ఏవేవో చూస్తాం. కాని మనకు తెలియనివి ఇంకా వున్నాయంటే అందులో ఆశ్చర్యంలేదు.

## 8. జయాపజయాలు

యుద్ధం ముగిసాక డార్జిలింగులో రోజులు గడవడం మరీ కష్టమైంది. పెద్దయెత్తున యాత్రలు జరగడం లేకపోగా చిన్న చిన్న ప్రయాణాలు కూడా అరుదయ్యాయి. ఇండియాకు స్వాతంత్ర్యం రావడంతో ఏదీ నమ్మరాకుండా తారుమారయింది. సేనలకు, ప్రభుత్వానికి, సంబంధించిన విదేశీయులు వెళ్ళిపోయారు. యాత్రలకు వెళ్ళేవారు ఒక్కరూ లేరు. తేయాకు వ్యవసాయం కట్టుబడింది. ఉద్యోగాలు దొరకడం లేదు. ఏవైపు చూచినా నిరుద్యోగం. దారిద్ర్యం తాండవిస్తోంది.

ఇన్నిటికీపైగా ఇంట్లో ఇబ్బందులు: మా అత్తగారు జబ్బుచేసి రెండు సంవత్సరాలు మంచం పట్టింది. ఆమెభర్త పోయాడు. ఆమెపోషణ మా మీద పడింది. నెలలకొద్దీ నాకు పనిదొరికేది కాదు. చిత్రాల్ సంపాదనకరిగి పోయింది. నాభార్య ఆంగ్ లామూ మమ్మల్ని పోషిస్తూవుంది. కొంత కాలం ఆయింటా ఆయింటా "ఆయా"గా పని చేసేది. డార్జిలింగులో అమెరికన్ పంటివైద్యుల కంపెనీవుంది. దాని పేరు స్మిత్ ్రబదర్సు. అందులో కొంతకాలం పనిచేసింది. ఆకష్టదినాల్లో మాకు ఆమె ఎంత అండగా వుందో ఎన్నటికీ మరవలేను. ఆవిడతో ఈ మాట ఎన్నిసార్లో అంటూ వుంటాను.

ఆంగ్ లామూ డార్జిలింగులో పుట్టింది. పసితనంలో సోలో ఖుంబూకు తీసుక వెళ్లారు. అక్కడ కొద్దికాలమేవుంది. చిన్న తనంవల్ల ఆమెకు అక్కడి స్థితిగతులు ఏవీ జ్ఞాపకంలేవు. అందరు షెర్పాలులాగానే ఆమె తల్లిదండ్రులుకూడా పేద వాళ్లు. ఎనిమిదేళ్ళనుంచీ ఆమె కష్టపడి పనిచేసింది. బరువులు మోసేది. ధనికుల యిండ్లలో పనిమనిషిగా వుండేది. ఆ స్థితి లోనే ఆమెను మొట్టమొదటకలుసుకున్నాను. మా పరిచయం పాలబేరంతో ప్రారంభమైంది. 1938 లో ఆమె జీవితంలో గొప్పమార్పు కలిగింది. "వాలేస్" అన్న బ్రిటిషు కుటుంబంలో పనిచేస్తూవుండేది. ఆ కుటుంబం ఇంగ్లాండు వెళుతూ వాళ్ల పిల్లలకోసం ఆమెను ఆయాగా వెంటబెట్టుక వెళ్లారు. ఆ కుటుం బంతో పెక్కుమాసాలు లండన్ కేంద్రంలో హైడ్ పార్కు దగ్గర ఒక హోటల్లో గడిపింది. పాశ్చాత్యపద్ధతులన్నీ గమ నించింది. ఆమెకు స్టీమరుప్రయాణం అలవాటు లేకపోవడం చేత వెళ్లేటప్పుడూ వెళ్ళిన తరువాతనూ జబ్బుచేసింది. కొంత కాలం ఆస్పత్రిలోవుంది. ఆస్పత్రినుంచి బయటపడేలోగానే వాలేస్ కుటుంబం మళ్ళీ ఇంగ్లాండును వదిలిపెట్టిపోవలసి వచ్చింది. ఆంగ్ లామూ లండన్‌లో బ్రతుకుదెరువు దొరక్క వంటరిగా ఇండియాకు తిరిగివచ్చింది. అది ప్రపంచయుద్ధం ఆరంభం కాబోతున్నసమయం. ఏక్షణం ఏం జరిగేదీ తెలి యదు. 1953 లో ఇద్దరం ఇంగ్లాండుకువెళ్లాం. అక్కడి విశేషా లన్నీ స్పష్టంగా జ్ఞాపకంపెట్టుకుని నాకు చెప్పింది.

ఆంగ్ లామూ ఏ మాత్రం బయటపడే మనిషి కాదు. ఈ నాటికి కూడా ఆమె ఇంగ్లాండుకు వెళ్ళిన సంగతి చాలా మందికి తెలియదు. ఆమె ఇంగ్లీషు అర్థం చేసుకుంటుందని

కూడా చాలా మందికి తెలియదు. ఆమె పనిచేసిన యిండ్లలో ఎవరికీ అసలుపేరు తెలియదు. పని కత్తెగా వున్నప్పుడు "నిమా" అని పేరు పెట్టుకుంది. మా వివాహం అయిన తరువాత కూడా ఫలాని మనిషి భార్యనని చెప్పుకునేది కాదు. అందరూ ఆమె పేరు నిజంగా నిమా అనుకునేవారు. ఈమధ్య నేను ఎవరెస్టు ఎక్కడానికి వెళ్ళినప్పుడు ఒక తమాషా జరిగింది. ఆ కాలంలో ఆమె ఒక ఇంగ్లీషు ఆఫీసరు భార్యవద్ద ఆయాగా వుండేది. నా ఫోటో చాలా సార్లు వార్తాపత్రికలలో పడుతూ వుండేది. ఆమెకు చదవడంరాదు. ఆసక్తికొద్దీ నా ఫోటో పడినప్పుడు ఎవరినైనా అడిగి చదివించుకునేది. ఒక రోజు ఒక ఆంగ్లేయస్త్రీచేత చదివించుకుంది. ఆమె అడిగిందట. "నిమా! ఈ తేన్‌జింగ్‌ను నీవు ఎరుగుదువా? అతను నీకు స్నేహితుడా?" అని. నా భార్య జవాబు చెప్పిందట— "అతనిదీ నాదీ మొదట ఒక వూరే" నని. అప్పటికి అంతే జరిగింది. నేను ఎవరెస్టునుంచి దిగి వచ్చాక కలకత్తాలో మా యిద్దరికి ఒక విందు ఏర్పాటు చేశారు. ఆ ఆంగ్లేయస్త్రీ ఆ విందుకు వచ్చింది. ఆమె మా ముందుకు వచ్చి నా భార్య వైపు విస్తుపోయి చూస్తూ నిలబడింది. ఆమెకు మూర్ఛ వచ్చేటంత అయింది. ఏలాగో మాట పెగిలించుకుని "ఆశ్చర్యం! నీవు 'నిమా' వేనా" అంది.

ఈ విధంగా మాకు సంవత్సరాలు గడిచాయి. సుఖాలూ దుఃఖాలూ అనుభవించాం. క్రిందు మీదు లయ్యాం. పర్వతాలను ఎక్కడం ఎలాంటిదో బ్రతుకుకూడా అలాంటిదే. కష్టసుఖాలను పంచుకుంటూ భర్తకు అండగా నిల్చే భార్య దొరకడం ఒక అదృష్టం. నాకు అలాంటి భార్య ఆంగ్‌లామూ.

యుద్ధం ముగిశాక కొన్నాళ్ళు మా బ్రతుకు అంతా క్రిందే కాని మీదు లేకుండా జరిగింది. నా భార్య మమ్మల్ని బ్రతికిస్తూవుంది. నాకు ఒక రోజు పని దొరికితే ఒక రోజు దొరికేదికాదు. ఉత్తరంగా కాంచనజంగా కనిపిస్తూ వుండేది; ఎత్తుగా తెల్లగా అందంగా. ఆ పర్వతాన్ని చూస్తూంటే నాకు ద్వేషం కలిగేది. అది నన్ను చూచి వెక్కిరింపు నవ్వు నవ్వుతూన్నట్టుండేది. అంతగా నేను ప్రేమిస్తూవున్నదీ, అందుకే నేను జన్మఎత్తానని అనుకుంటూన్నదీ, పర్వతారోహణం. అది నాకు దూరమై పోయింది. ఈ దుర్గతి నాకే పట్టినట్టా ? లేక ప్రపంచానికే పట్టి నట్టా ?

మళ్ళా 1947 లో ఒక కొత్త ఆశ కలిగింది. మిస్టర్ ఎరల్ డెన్మన్ అనే వ్యక్తి ఒకాయన డార్జిలింగుకు వచ్చాడు. డెన్మన్ కెనడాలో పుట్టాడు. ఇంగ్లాండులో పెరిగాడు. ఆఫ్రికాలోని బ్రిటిషువారి ప్రాంతాలలో నివాసంగా వున్నాడు. ఆయన అడవుల్లోనూ కొండల మీదనూ విశేషంగా తిరిగాడు. చాలా స్వతంత్రుడు. అదివరకు చేసిందంతా ఆయన కొక లెక్కలో లేకపోయింది. ఆయనకు ఒక్కటే కోరిక. ఎవరెస్టు పర్వతం ఎక్కాలనీ, అదీ ఒంటరిగా ఎక్కాలనీ. ఒంటరిగా అంటే జట్టుతో యాత్రగా వెళ్ళకుండానని. కాని ఒకరినికూడా వుంచుకోకతప్పదు. ఒకనాడు ఆ పాత సర్దారు కర్మపాల్ నాతో, "పర్వతాలు ఎక్కడానికి ఒక కొత్తదొర వచ్చాడని" చెప్పాడు. తరువాత నేనూ ఆంగ్ దావా అనే ఇంకో షెర్పా కర్మపాల్ కార్యాలయంలో డెన్మన్‌ను కలుసుకున్నాం.

మొదటినుంచీ ఆయన పోకడ నాకు కొత్తగా తోచింది. డెన్మన్ వంటరివాడు. దగ్గర ద్రవ్యం కాని సరంజామా కాని అట్టే లేదు. టిబెటులోకి వెళ్ళడానికి ఉత్తరువునైనా సంపాదించుకోలేదు. కాని వెళ్ళాలని ఒకటే పట్టుదల, ఆ పట్టుదలతోనే మాట్లాడుతాడు. ముఖ్యంగా నేను కూడా వుండాలని పట్టుపట్టాడు. " నీకు పులి బిరుదు ఇచ్చారని విన్నాను. ఎవరెస్టు మీదికి ఇరవై యేడువేల అడుగులవరకు వెళ్ళావట. టిబెటన్ భాషను ఇంగ్లీషు భాషను మాట్లాడుతావు. పెర్వాలలో నీవు మేటివనికూడా విన్నాను " అన్నాడు. పొగడ్త బాగా నేవుంది. కాని ఆయన వైఖరి నాకేమో చాల చిత్రంగా తోచింది. నేనూ ఆంగ్ దావా ఆలోచించుకొని చెవుతామన్నాం.

తెలివిగల మనిషి ఎవడైనా వెంటనే రానని చెప్పేవాడే. నేను అనలేక పోయాను. వెళ్ళాలని నా మనస్సు పీకుతూంది. ఎవరెస్టు శిఖరం నా మనస్సును పైకి చేదుకుంటూంది. ఆంగ్ దావా నేనూ మాట్లాడుకున్నాం. ఒక నిశ్చయానికి వచ్చాం. " సరే, అలాగే " అని డెన్మన్‌తో చెప్పాం.

కాని ప్రతిదీ పెడతిరుగుతూంది. ప్రతిరోజూ ఏదో వక అడ్డంకి కలుగుతూంది. మాకు తగినంత ఆహారం దొరికేది కాదు. మా బరువులను మోసే యాక్‌లు ఒకసారి పర్వతాగ్రం మీదినుంచి దొర్లాయి. అవీ సామానూకూడా నాశన మయ్యాయి. ఇంకోసారి మేం అనుకున్నట్లుగానే కాపలా మనుషులు మమ్మల్ని పట్టుకొని వెనక్కు వెళ్ళిపొమ్మన్నారు. ఏదో బతిమలాడుకుని అరెస్టు కాకుండా తప్పించుకున్నాం. వెనక్కు తిరిగి పోతూన్నట్లుగా నటిస్తూ కొంతదూరం వెళ్ళాక మళ్ళి మామూలుదారికి తిరిగాం. అక్కడినుంచి పట్నాల

మీదుగానూ పల్లెల మీదుగానూ వెళ్ళకుండా తిన్నగా రాంగ్‌బక్ మఠాన్ని చేరుకున్నాం. అక్కడ ఏ ప్రశ్నలు ఏ అనుమానాలు లేకుండా మమ్మల్ని ఆహ్వానించారు.

మాకు ఎదురుగావుంది. మహోన్నతంగా, ధవళవర్ణంతో మంచు తురాయి ధరించిన ఎవరెస్టు శిఖరం. తొమ్మిది సంవత్సరాలుగా నా మనస్సులో నాటుకునివుంది. ఆలాగే ఆ పర్వతం. దాన్ని చూడగానే లోపల అణిగివున్న వుత్సాహం పైకి పొంగి వచ్చింది. నేను ఎక్కడ వుండాలో అక్కడ వున్నానన్నమాట. అయితే అంత వుద్రేకంలోనూ ఆ పర్వతాన్ని చూచేకొద్దీ మేం పూనుకున్న కార్యం దుర్ఘటమని నాకు మరీ మరీ స్పష్టమవుతూంది.

అయినా పైకివెళ్ళాం. హిమానీ ప్రదేశాలనూ లోగడ మకాంచేసిన స్థానాలనూ, దాటి ఉత్తరపుకనుమ మొదట్లోకి చేరుకున్నాం. ఆశ్రమ మాకు దుర్భరమనిపించింది. అందులో మేం ముగ్గురం. గాలీ, మేఘం భయంకరంగా వున్నాయి. ఆ విధంగా పర్వతాలమీద నేనెప్పుడూ చూడలేదు. గాలీ మబ్బూ ఆలావుంచి, అసలులోటు మావద్ద తగిన సరంజామా లేకపోవడం. గాలిదెబ్బకు తట్టుకోగల దుస్తులులేవు. తినుబండారాలు తక్కువ. అన్నిటికన్నాముఖ్యం మాదగ్గర తేయాకు ఖాళీ అయింది. మా గుడారాలు రెండూ చలిని ఆపగలవి కావు. టెన్సింగ్ తాను వంటరిగావున్న గుడారాన్నివిడిచి నేనూ అంగ్‌దావా వున్న గుడారంలోకివచ్చేవాడు. ఒక్క గుడారంలోనే ముగ్గురం వొరుసుకునికూచుంటే కాస్త వెచ్చగాఉండేది.

ఆలావున్నా మేం వడిగానే ముందుకు పోతున్నాం. పెద్ద యాత్రలో అయితే ఒకొక్కమకాం పెట్టడానికి దినాలు

పడుతుంది. సరఫరాలు అంచెలమీద వెనక వస్తూవుంటాయి. కాని మేం ప్రతిదినం ఒక మకాంపెడుతున్నాం. మా సరం జామాను వెంటనేమోసుకపోతున్నాం. అనతికాలంలో కనుమ క్రింది ఏటవాలు మంచుప్రదేశానికి చేరాం. ఇంతటితో మా ప్రయాణం అంతమైందని తెలుసుకున్నాను. అక్కడినుంచి పర్వతంమీద కనుమవరకు ఎక్కిపోవాలనిచూచాం. దారంతా మంచుతో పూడుకునివుంది. చలి మా యెముకలను కొరికి వేస్తూంది. గాలి మమ్మల్ని విసిరికొడుతూంది. ఆగలేక వెనక్కు తిరిగి గుడారాలవద్దకువచ్చాం. బాగా అలసిపోయాం.

మేం ఓడిపోయామని డెన్మన్‌కూడా గ్రహించాడు. కాని ఆయన మహాధైర్యశాలి. అనుకున్నపని చేసితీరాలని ఆయనకు ఒకటే పట్టుదల. అయితే అది వెర్రి పట్టుదలకాదు. చావుకు తెగించడానికి ఆయన సిద్ధపడలేదు. వెనక్కు మళ్ళడానికి వప్పుకున్నాడు. వప్పుకున్నందుకు ఆయనకు మేమెంతో కృతజ్ఞులం. ఆయన పట్టుబట్టివుంటే నాగతి, ఆంగ్ దావా గతి ఏమై వుండేదో !

ఆ పర్వతం ఒక రక్కసిలాగా వెనకకు తరుముతూ వున్నట్టు పరుగులమీద రాంగ్‌బక్ మఠానికి చేరుకున్నాం. టిబెట్టు పీఠభూములను దాటాం. అప్పటికి ఆహారపదార్థాలు సన్నగిల్లాయి. వేసుకున్న బట్టలు పేలికలయ్యాయి. డెన్మన్ కాలిబూట్లు చెడిపోయి కొన్నాళ్ళు వట్టికాళ్ళతో నడిచాడు కూడాను. మాకు తెలియకుండానే టిబెట్టుదాటి సిక్కింకు వచ్చాం. తరువాత కొద్దిరోజుల్లో – ఏప్రిలు మాసాంతానికి – డార్జిలింగుకు వచ్చాం. మొత్తం ప్రయాణం మాకు ఆరు వారాలు మాత్రమే పట్టింది.

తరువాత కొద్దికాలానికి డెన్మన్ ఆఫ్రికాకు తిరిగి వెళ్ళాడు. ఆ పర్యాయం అసలు ఎవరెస్టుకు వెళ్ళినట్టే లేదు నాకు. అదంతా ఏదో కలగా వుండేది. కొన్ని నెలలు గడిచాక వచ్చే సంవత్సరం మళ్ళా వస్తున్నానని డెన్మన్ నాకు వ్రాశాడు. 1948 వసంతంలో డెన్మన్ డార్జిలింగుకు వచ్చాడు. ఈ తడవ ముందుకన్న ఎక్కువ సన్నాహంతో వచ్చాడు. ఈ తడవ కూడా టిబెట్టులో ప్రవేశించడానికి ఉత్తరువు తెచ్చుకోలేదు. గత సంవత్సరం అక్రమంగా ప్రవేశించినందుకు చాలా ఆక్షేపణ వచ్చింది. కూడా వెళ్ళినందుకు నన్ను కూడా చాలామంది తప్పు పట్టారు. మళ్ళా అలాగే వెళ్ళితే చాలా కష్టం కలుగుతుందని నాకు తెలుసు. ఉత్తర్వు తెచ్చుకోని పక్షంలో నేను వెంట రాలేనని డెన్మన్‌తో చెప్పక తప్పిందికాదు. వేరే నమ్మకమైన మనిషి దొరక్క డెన్మన్ ఆఫ్రికాకు తిరిగి వెళ్ళాడు. తన దగ్గరవున్న సరంజామా యావత్తూ కూడా తీసుక పోలేక నాకిచ్చాడు. ఆ నాటినుంచి డెన్మన్‌ను నేను మళ్ళా చూడలేదు. కాని మాకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే వున్నాయి. మా స్నేహం నిలిచి వుంది. ఆయన వింత మనిషే కాని గట్టి గుండె కలవాడు. ఆయన కల యథార్థం కానందుకే నా విచారం. 1953 లో నేను ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కినప్పుడు డెన్మన్ యిచ్చిన వున్నికుళాయి నా తలమీదవుంది. ఆయనకు సంబంధించిన ఏదో ఒక వస్తువైనా ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కిందన్న మాట.

1947 లో సంగతి చెపుతున్నాను. డార్జిలింగుకు చేరిన మొదటినాడే నాకు కొత్త పని లభించింది. సుప్రసిద్ధ పర్వతారోహకుడు స్విస్ దేశస్థుడు ఆంద్రీరోచ్ షెర్పాలను చేర్చు

కోడానికి డార్జిలింగుకు వచ్చాడు. యాత్ర ఘూర్వాల్‌లో ప్రారంభం కావాలి. నేను ఖరారునామాలో సంతకం పెట్టాను. మేం చాలా పర్వతాలు ఎక్కడానికి పూనుకున్నాం. మొట్ట మొదట కేదారనాథ్ పర్వత శిఖరానికి ఎక్కుతున్నాం. ఒక అపాయం జరిగింది. చాలామంది షెర్పాలు భయపడి పైకి రామన్నారు. మొదటి అవకాశాన్ని జారవిడవడం నాకు ఇష్టం లేదు. స్విస్ దొరలు నలుగురూ నేనూ బయలుదేరాం. సునిశ్చితంగానే కేదారనాథ్ శిఖరానికి ఎక్కాం. నా మట్టుకు నాకది ఒక పర్వదినంగా వుంది. ఒకపర్వత శిఖరాన్ని ఎక్కడం నాకు అదే మొదలు. అక్కడినుంచి సతోపంథ్‌కు వెళ్ళాం. కడుపునొప్పివల్ల నేను శిఖరానికి ఎక్కలేదు. తరువాత బల్సాలా కాళిందీలకు వెళ్ళాం. మొదటిసారిగా నాలుగు శిఖరాలకు ఎక్కడం మహత్కార్యంకాదూ!

## 9. పుణ్యభూమికి

నా జీవితంలో 1948 ప్రత్యేకంగా ఎన్నదగిన సంవత్సరం. ఆ యేడు పర్వతాలెక్కడమంటూ లేదు. తొమ్మిది నెలలు టిబెట్టు యాత్రచేశాను. లాసాకు వెళ్ళాను. లాసాను దాటి కూడా వెళ్ళాను. టిబెటును వెళ్ళరాని దేశంగా భావిస్తారు పాశ్చాత్యులు. బౌద్ధులకు టిబెటు పుణ్యభూమి. యాత్రా స్థలం. ఎవరెస్టును ఎక్కడం ఏలాగో టిబెటు యాత్ర కూడా అలాగే నా జీవితంలో నిలిచివుండే ఒక మధురస్మృతి.

ఘూర్వాల్ యాత్రనుంచి వచ్చిన తరువాత మా పరిస్థితులు పూర్వంకంటే ఏమీ బాగుపడలేదు. అంతకుముందు సంపా

దించు కున్నదంతా డార్జిలింగులో ఖర్చుపెట్టాను. యాత్రలు జరగడం ఆగిపోయింది. ఆంగ్ లామూ ఇంకా ఆయాగా పని చేస్తూంది. ఆడపిల్లలు పెరుగుతున్నారు. వాళ్ళకు తిండి కావాలి. బట్టలు కావాలి. దేనికీ పైసా లేదు. ఏం చేయాలి? నా పులి పతకం అమ్ముకుని తినాలి! ఈ లోపుగా రెండు సంవత్సరాల నుంచి మంచాన పడివున్న మా అత్తగారు క్రమంగా క్షీణించి 76 వ యేట కాలధర్మం పొందింది. ప్రాణాలు విడుస్తూ ఆమె నన్ను దగ్గరకు పిలిచి ఆశీర్వదించింది. తన్ను ఆదరంగా చూచి నందుకు భగవంతుడు నన్ను అనుగ్రహిస్తాడన్నది. ఆమె చెప్పింది నిజమే అయింది. ఆమె కాలంచేసిననాటినుంచి మా అదృష్టం తిరిగింది. పూర్వంకంటే పరిస్థితులు మంచిగా మారాయి.

ఆ మరుసటి సంవత్సరం వసంతంలో డార్జిలింగుకు ఒక విచిత్రవ్యక్తి వచ్చినట్టువిన్నాను. ఆయన ఇటలీ దేశస్థుడు. పేరు ఆచార్య టుచీ. ప్రాచ్యకళలోనూ, సాహిత్యంలోనూ ప్రసిద్ధపండితుడు. అదివరకే టిబెటుకు ఏడుసార్లు వెళ్ళాడు. మళ్ళా టిబెటుకు వెళ్ళాలని వచ్చాడు. వెంటవచ్చే మనుష్యుల కోసమూ పోర్టర్లకోసమూ సర్దార్ కర్మపాల్ తో ఏర్పాటు చేసుకుంటున్నాడు. నేను దరఖాస్తు పెట్టాలని వెళ్ళాను. కాని ఆ లోపలనే ఒకమనిషిని మాట్లాడుకుని సిక్కింలో గాంగ్ టాక్ కు బయలుదేరారు. నాకు చాలా ఆశాభంగ మైంది. ఎంతో విచారపడ్డాను. అయితే, కొద్దిరోజుల్లో నాకు కబురువచ్చింది. కూడా తీసుకవెళ్ళినమనిషితో ఆచార్య టుచీకి సంతృప్తి కలగలేదు. టిబెటన్, హిందూస్తానీ, నేపాలీ, ఇంగ్లీషు కొంతలో కొంతైనా మాట్లాడగల మనిషి అవసర

మనిపించిందట. ఈ భాషలన్నీ నాకు కొంతవరకు తెలుసు. ఒకరోజు కర్మపాల్ నన్ను తన కార్యాలయానికిపిలిచి కబురు వచ్చినసంగతి చెప్పాడు. ఆనాడే నేను గాంగ్‌టాక్‌కు ప్రయాణ మయ్యాను.

ఆచార్య టుచీ విచిత్రమైనమనిషి. నేను చూచిన అతి విచిత్రవ్యక్తులలో ఆయన ఒకడు. చాలా గంభీరుడు. తన పనిమినహా ఇంకోసంగతి ఆయనకు పట్టదు. పర్వతారోహకు లను ఎందరినో చూచాను. కాని ఆయనంత ఉద్రేకిని ఎన్నడూ చూడలేదు. ప్రతిదీ ఒక క్రమంలోనే జరగాలి. ఆక్రమం తప్పితే అగ్నిపర్వతం పగిలినట్టే. వచ్చిన ప్రతివారికీ భయమే. ఆయనతో వేగలేక వెనక్కుతిరిగి పోతామని కూచున్నారు. వాళ్ళుచెప్పేది నాకు సరిగానే తోచింది. ఆయన నన్ను ఏవేవో అడిగాడు. అన్నిభాషల్లోనూ ప్రశ్నలు కుమ్మరించాడు. నా జవాబులు విని: సరే! నీవుంటే చాలు అన్నాడు. ఉద్యోగంకోసం నేనేమో గూడుపుఠాణి చేశా నను కున్నారు మిగతా షెర్పాలు. నాకు ఆయనతో కూడా వెళ్ళాలని వున్నమాట నిజమే. క్రమక్రమంగా ఆయనపట్ల నాకు ఆదరప్రేమలు హెచ్చాయి.

ప్రయాణ సన్నాహం పూర్తిచేసుకుని గాంగ్‌టాక్‌నుంచి ఉత్తరంగా బయలుదేరాం. ఆచార్య టుచీ నేనూకాక, ముగ్గురు ఇటాలియన్లూ, ఒక షెర్పా – (వంటపనికోసం) డార్జిలింగునుంచి లాసాకు వెళ్ళుతూన్న ఒక మంగోలియన్ లామా, మామూలు పోర్టర్లూ మా జట్టులో వున్నాం. పోర్టర్లు మాత్రం మధ్య మధ్య మారుతూ వుండేవాళ్ళు. సామాను మోయడానికి సిక్కింప్రభుత్వం వద్ద దాదాపు నూరు కంచర

గాడిదలనూ, మేం ఎక్కడానికి గుర్రాలనూ అరువుగా తీసుకున్నాం. ఆహారపదార్థాలూ, మామూలు వస్తుసామగ్రీకాక టుచీ తాను సేకరించిన వస్తువులను పెట్టుకోవడానికి ఎన్నో పెట్టెలు, బుట్టలు వెంటతీసుక వచ్చాడు. టిబెట్టులో బహుమతుల క్రింద పంచిపెట్టడానికి సామానులు, తుపాకులు వున్నాయి. మొట్టమొదటి నుంచీ ఈ బరువులన్నీ తనికీ చూచుకోవడం నామీద పెట్టాడు. "ఈ బాధ్యత నామీద పెట్టుకోవడం నాకిష్టం లేదు" అనేవాడు. తన సొంతపెట్టెల తాళాలు కూడా నాకే అప్పగించాడు. దార్లో ఖర్చుకోసం పైకం నావద్దనే వుంచాడు. ఆయనది కచ్చితమైన స్వభావమైనా నామీద అంతనమ్మకం వుంచడం చూచి ఉప్పొంగిపోయాను.

సిక్కిం పర్వతాలను ఎక్కుతూ దిగుతూ వెళ్లాం. దారిపొడుగునా గుర్రంమీద వెళ్లడం నాకదే మొదటిసారి. పర్వతాల నెక్కినప్పుడు కలిగిన కాళ్లనొప్పులకన్నా గుర్రపుస్వారి వల్ల కలిగిన వెన్నునొప్పి దుర్భరంగా వుండేది. కొన్నిరోజులు దీర్ఘప్రయాణాలూ, కొన్నిరోజులు స్వల్పప్రయాణాలూ చేశాం. ఆయన ఎప్పుడు బయలుదేరమంటాడో ఎప్పుడు ఆగమంటాడో ఎవ్వరూ చెప్పలేరు. పోతూపోతూ ప్రక్కన ఏపట్టణంలోనో ఏ మఠంలోనో విచిత్రవిషయాలు వున్నట్టు ఆయనకుతోస్తే పై ప్రయాణం ఆపుకుని అక్కడికి మళ్లుతాడు. ఆయన గొప్ప పండితుడు. ఆ ప్రదేశాలలోవుండే ప్రజలకంటే ఆయనకు ఎక్కువగా తెలుసు అక్కడి విశేషాలు. ఆయనకు ఎన్ని భాషలు తెలుసునో లెక్కపెట్టడమే నాకు సాధ్యం కాలేదు.

ఇంకో భాషకు దిగి మూడో భాషలో ముగించేవాడు. ఆయన ఇటాలియన్ భాష నాకు రాదు. నా షెర్పాభాష ఆయనకు రాదు. మా సంభాషణలో ఈ రెంటికీ మినహాయింపు.

అదివరకు నాకు తెలియని అనేకవిషయాలు ఆయనవల్ల తెలుసుకున్నాను. అది నాకు యాత్రమట్టుకేకాదు. విద్యాభ్యాసంకూడాను. ఆయన ఒక మఠానికి వెళ్లాడంటే, అక్కడ వుండే లిఖిత గ్రంథాలనూ కళాఖండాలనూ ముందు పరిశీలన చేస్తాడు. ప్రతిదానికీ ఒక అంతరార్థాన్నీ ఒక ఐతిహ్యాన్నీ ఆయన చెప్పగలడు. మాకు ఎడమవైపుగా కాంచనజంగ పర్వతం కనపడుతూవుంది. దాన్నిగురించి కూడా ఏవో కొత్త సంగతులు చెప్ప నారంభించాడు. ఆ పర్వతం పేరులో రెండు టిబెటన్ పదాలు వున్నాయట. కన్ అంటే మంచు; చెన్ అంటే గొప్పది; జోద్ అంటే నిధి; ఙ్గ అంటే అయిదు. ఆ పేరును సరిగ్గా ఉచ్చరిస్తేకం-చం-జోద్-ఙ్గ అవుతుంది. అయిదు నిధులతో (అయిదు పర్వతశిఖరాలు) కూడిన మంచుకొండ అన్నమాట. సంప్రదాయంప్రకారం అయిదు నిధులు ఏవంటే! త్స (ఉప్పు), సీర్-థంగ్-యీూ (బంగారు, వైడూర్యం), ధాం-బాయ్-థాంగ్-నోర్ (పవిత్రగ్రంథాలు, ధనం), మిత్సన్ (ఆయుధాలు), లో-థోగ్-థాంగ్-మెన్ (పంటలు-ఔషధాలు). ఆనాటినుంచి అవి వట్టి మంచుపర్వతాలు మాత్రమే కావనీ వాటినిగూర్చి ఎంతో ఐతిహ్యంకూడా వుందనీ నేను ఆయనవల్లనే గ్రహించాను. ఆయన చెప్పిన సంగతులు నేను ఎన్నటికీ మరవ జాలను.

కాంచనజంగా పర్వతాన్నిదాటి టిబెటు దేశంలో ప్రవేశించాం. ఆచార్యటుచీకి అవన్నీ పరిచిత ప్రదేశాలే. ఆ

మార్గాన ఆయన చాలాసార్లు ప్రయాణం చేశాడు. నేను కూడా టిబెటు దేశానికి ఆరుమార్లు వెళ్ళినా ఎవరెస్టు వరకు రాంగ్‌బక్ వరకు మాత్రమే. అక్కడినుంచి వుత్తరం అంతా నాకు కొత్తే. అక్కడ అడుగు పెట్టగానే నా గుండె కొట్టుకో సాగింది. ఎవరెస్టును సమీపిస్తున్నట్టుగా నాకు ఉద్రేకం కలిగింది. ఇన్నాళ్ళకు నేను లాసాకు వెళ్లుతున్నాను.

ఓం మణేపద్మే ఓం; ఓం మణేపద్మే ఓం.

ఇది బౌద్ధులు వుచ్చరించే మంత్రం. మణి పద్మంలో వుంది అని అర్థం. ఆ మంత్రానికి ఇంకా రహస్యమైన అర్థాలు వున్నాయి. అవి పండితులైన లామాలకు మాత్రమే తెలుసు. బౌద్ధమతంవున్న ప్రతి చోటా ఆ మంత్రం వినిపిస్తుంది. ముఖ్యంగా టిబెట్టులో వినిపిస్తుంది. అర్చనలు పూజలు జరిగే సమయంలో "ఓం మణేపద్మే ఓం" అనే మంత్రాన్ని ఉచ్చరిస్తూ జపచక్రాలు తిప్పుతారు.

టిబెటు పుణ్యభూమి. లాసా పరమ పుణ్యక్షేత్రం. క్రైస్తవులు జెరూసెలంకున్నూ, ముస్లింలు మక్కాకున్నూ యాత్ర చేసినట్టుగా ప్రతిబౌద్ధుడూ జీవితంలో ఒక్క సారైనా లాసాకు వెళ్ళాలని వాంఛిస్తాడు. లాసాకు వెళ్ళాలని మాతల్లి దండ్రులు చాలా కాలం అను కున్నారు. కాని వెళ్ళలేక పోయారు. ఈ సారి నేను నా కోసమే కాకుండా వాళ్ళకోసం కూడా వెళ్లుతున్నాననుకున్నాను. మా కుటుంబ పక్షాన, నాకు ప్రియులైన మెల్లరి పక్షాన లాసా క్షేత్రానికి వెళ్ళాను. వాళ్ళ పేరిట దేవళాల్లోనూ మఠాల్లోనూ దీపారాధనలు చేయడానికి పెన్నకొనుక్కున్నాను. జపచక్రాలను తిప్పాను. చనిపోయిన మా అత్తగారి ఆశీర్వాద బలం వల్లనే నాకు ఈ క్షేత్రయాత్ర

ప్రాప్తించింది అనుకున్నాను. ఆమెకోసం ప్రత్యేకం ప్రార్థనలు చేశాను. లాసాను దర్శించని మనిషి బ్రతుకు వ్యర్థమనుకుంటారు మా దేశంలో. కాగా, నేను లాసానుదర్శించానంటే నా ద్వారా అనేక మందికి ఆ పుణ్యం లభించిందన్నమాట.

నాకు మత విశ్వాసం వుంది. నేను భగవంతుణ్ణి నమ్ముతాను. బౌద్ధధర్మాన్ని నమ్ముతాను. మా యింట్లో ప్రార్థనకోసం ప్రత్యేకంగా ఒక గది వుంది. అది బౌద్ధుల యిండ్లలో ఆచారం. కాని నేను పూర్వాచారాలను తూచా తప్పకుండా ఆచరించడంలేదు. వాటిని పాటించడం అగత్యమన్న నమ్మకం నాకు అంతగా లేదు. నాకు మూఢవిశ్వాసాలు లేవు. పర్వతాల మీద రాక్షసులు తిరుగుతారంటారు. నేను చాలా పర్వతాలు ఎక్కాను. ఎక్కడా నాకు రాక్షసులు కనబడలేదు. దయ్యాల విషయం కూడా అంతే. తూంగ్ సాంగ్ బస్తీలో ఒక ఆడ దయ్యం తిరుగుతూ వున్నట్టు చెప్పుకునేవాళ్లు. ఆ దయ్యాన్ని చూడాలని వూరంతా తిరిగాను. ఎక్కడా కనిపించలేదు. ఇతర మతాలను అనుసరించే మనుష్యులను ఎంతమందినో నాకు పరిచయంవుంది. వాళ్ళందరూ తప్పు మార్గాన పోతున్నారనీ ఒక్క బౌద్ధులే క్రమ మార్గంలో వున్నారనీ నేను అనుకోను. నేను చదువుకున్నవాణ్ణికాను. తాత్త్విక విషయాలు మాట్లాడగల లామాను, పండితుణ్ణికాను. ప్రపంచంమీద నానా జాతులు వున్నట్టే నానా మతాలకు అవకాశం వుందని నా భావం. నాకు ఆ పర్వతం ఎలాగో భగవంతుడూ అంతే. ఆ పర్వతాన్నిచూచి నేను ప్రేమిస్తాను. భయపడను. భగవంతుని విషయంలోనూ అంతే.

అసలుమతం ఒక రకంగావుంటే పై నటనలూ ఆచరణలూ ఇంకోరకంగా వుండవచ్చు. అందుకు మనం విచారపడాలి. అన్ని మతాల మాదిరే బౌద్ధమతంలోనూ దైవభక్తికి సంబంధించనివి ఎన్నో కనపడవచ్చు. నిజంగా పవిత్రులైన లామాలు కొందరున్నారు. గొప్ప పండితులు సిద్ధులు వున్నారు. కాని కొందరు లామాల ప్రవర్తనను చూస్తే వీరు మనుష్యుల ఆత్మలను వుద్ధరించడం అలావుంచి పశువులనైనా కాయగలరా అనిపిస్తుంది. పనిలేకుండా కూచుని అన్ని సుఖాలు అనుభవించడానికే వారు భిక్షుకు లయ్యారని మనం నమ్మవచ్చు.

ఎవరెస్టునుంచి దిగివచ్చిన తరువాత డార్జిలింగులో ఒక మఠానికి విరాళం ఇమ్మని నాకు సలహాచెప్పారు. కాని ఆలోచించుకున్న మీదట ఆ సలహా నాకు నచ్చిందికాదు. భిక్షుకులు స్వంతంగా వుపయోగించుకునే మఠానికి ఇచ్చేదానికంటే అక్కడికి వచ్చే పేదలు తల దాచుకోడానికి వీలుగా ఒక సత్రాన్ని కట్టించడం వుచితమని తోచింది నాకు.

నాకు మత విశ్వాసం వుందని మళ్ళా చెపుతున్నాను. కాని, నామతంలోని మూలసిద్ధాంతాలే నాకు ముఖ్యం. పై మెరుగు. కపట నటనలు నాకు అక్కరలేదు. ఎవరెస్టు శిఖరంమీద నేను తలవంచి భగవంతుణ్ణి తలుచుకున్నాను. టిబెటు యాత్రలోకూడా నా మనస్సు భగవంతుడిమీదే వుంది. నాతల్లిదండ్రులు మా అత్తగారు నా తలంపులో వున్నారు. వాళ్ళ భక్తిశ్రద్ధలు గొప్పవని నాకు తెలుసును. ఆ యాత్ర నాకోసమేకాక వాళ్ళకోసంకూడా చేస్తున్నట్టుగానే నేను భావించాను. మేం మణిపంక్తులను దాటాం. చనిపోయినవారి ఆత్మలను కాపాడేకట్టడాలను దాటాం.

గాలిలో ఎగిరే ధ్వజాపతాకాలను, భక్తులు త్రిప్పే జప చక్రాలను చూస్తూ వెళ్ళాం. పర్వతాలమీద కట్టిన పురాతన మఠాలను చూచాం.

గాంగ్‌టాక్ నుంచి మా ప్రయాణం దాదాపు ఇరవై రోజులు పట్టింది. ఒకరోజు తెల్లవారుతూవుండగా పర్వతాల మధ్య విశాలప్రదేశంలో ఒక పెద్దపట్టణం కనిపించింది. బజార్లు, చౌకులు, దేవళాలు కనిపించాయి. ప్రజలు గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు. పైన ఒకపెద్ద భవనం కనిపించింది. అది దలైలామా నివసించే పొతాళభవనం. భక్తి తన్మయతతో లాసా పట్టణంలో ప్రవేశించాం.

మమ్మల్ని ఆదరంతో ఆహ్వానించారు. ఉండడానికి ఒక పెద్ద బంగళాయిచ్చారు. అక్కడి ప్రభుత్వమూ ప్రజలు మాకు పెక్కుసార్లు ఆతిథ్యంయిచ్చారు. ఎప్పుడూ చూడని రమ్య దృశ్యాలను చూచాం. మొదట అక్కడి జనం నేను ఎవరైందీ తెలుసుకోలేదు. షెర్పానని తెలిసిన తరువాత పర్వతాలను గురించీ పర్వతారోహణను గురించీ ఎన్నెన్నో ప్రశ్నలు వేశారు. ఆ ప్రజలకు మిగతా పర్వతాలను గురించి తెలియక పోయినా ప్రతివాడికి 'చోమోలుంగ్మా' ను గురించి తెలుసు. "ఎప్పటికైనా ఆ పర్వతాన్ని ఎక్కడం సాధ్యపడుతుందా'', అని అడిగారు. "మనిషికి అసాధ్యమైంది ఏదీ లేదు, ప్రయత్నించగా ప్రయత్నించగా ఒక నాటికి సాధ్యపడకపోదు" అన్నాను.

లాసాలో జరిగిన అతిముఖ్యవిషయం దలైలామాను దర్శించడం, ఒకసారికాదు, రెండుసార్లు చూచాం. 'పొతాళ' కు వెళ్ళాం. మమ్మల్ను ఎన్నో గదుల గుండానూ మండువాల

గుండానూ పైకి తీసుకవెళ్ళి దలైలామా స్వంత మందిరంలో ప్రవేశపెట్టారు. ఆయనకు పదిహేను సంవత్సరాలు. కాని చాలా ఆకర్షణీయంగానూ గంభీరంగానూ వున్నాడు. ఎవరు కాని ఆయనవైపు తేరిపార చూడకుండా వినయంగా తల వంచుకుని కూచోవాలి. ఆచార్య టుచీకి దలైలామాతో పూర్వపరిచయంవుంది. ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. నా అదృష్టంవల్ల వారు మాట్లాడు కున్నంతసేపూ నేను ప్రక్కన నిలబడి విన్నాను. మేం సెలవు తీసుకునేటప్పుడు దలైలామా మా ఇద్దరినీ ఆశీర్వదించాడు.

దలైలామా అనే పేరును గురించి చాలా మంది పాశ్చాత్యులకు తెలియని ఒక విషయాన్ని చెప్పాలి. టిబెటు దేశస్థులెవ్వరూ తమ మత గురువును ఆ పేరుతో పిలవరు. "గియాల్వా రింపోచే" అంటారు. గియాల్వా అంటే పరమ సిద్ధుడు. బోధిసత్త్వుడన్నమాట. రింపోచే అంటే మహాత్ముడు పవిత్రులైన లామాలకు "రింపోచే" అనే పదాన్ని వాడుతారు. కాని బోధి సత్త్వ స్థితిని పొందిన వ్యక్తికే "గియాల్వా" అన్న పదాన్ని వాడుతారు. బుద్ధభగవానుని స్థితిని పొందిన వాడు "గియాల్వా".

ఆచార్య టుచీతో నేను లాసాలో ఒక మాసం వున్నాను. ఒక వారం రోజులు టిబెటు దేశమంతా తిరిగి చూచాం. ఆ బౌద్ధ పుణ్యభూమిలో ఎన్నెన్నో విశేషాలు చూచాను. చూచిన ప్రతిదాన్ని గురించి వివరాలన్నీ తెలుసుకునే అవకాశం కలిగింది. టిబెటు మతాలను గురించి ఒక గ్రంథం వ్రాయదగినంతగా తెలుసుకున్నాను. ఆచార్య టుచీ సేకరిస్తూ వచ్చిన వస్తుసామగ్రి ఎన్నో పెట్టెలు బుట్టలు నిండేటంతగా

పోగైంది. కొద్దిలో నేనూ సేకరించాను. అరుదుగా దొరికే అందమైన వస్తువులను సేకరించాలన్న మోజు నాకు జాస్తిగా వుంది. అసలు అలాంటి అవకాశం జన్మలో ఎన్నడో కాని కలగదు. ఆ యాత్రలో సేకరించిన వస్తువులు డార్జిలింగులో ఈ నాటికీ మా ఇంటినిండా వున్నాయి.

అయితే, ఆయనకూ నాకూ అమూల్యములైన వస్తువులు యాత్ర చివరలోగాని లభించలేదు. ఒక వస్తువును సంపాదించాలన్న అభిలాషతో టుచీ అదివరకు టిబెటుకు ఏడుసార్లు వెళ్ళాడు. అది యెనిమిదోసారి. రెండువేల సంవత్సరాల క్రిందటి ప్రసిద్ధ మతగ్రంథం – లిఖితం – ఒకటి వుందట. అది చెట్ల బెరడుమీాద లిఖించ బడిన సంస్కృతగ్రంథం. ఆ గ్రంథం వుందని పండితుల నమ్మకం. కాని ఎవ్వరికీ దొరకలేదు. తురుష్కస్థానంలో ఒకప్పుడు బౌద్ధమతం ప్రచారంలో వుండే దనీ; ఆ గ్రంథం ఆకాలంలో ప్రథమంగా తురుష్క భాషలో రచించ బడిందనీ; కొన్ని సంవత్సరాలక్రితం అది టిబెటుకు చేరిందనీ; ఘున్ గర్ మఠంలో వుండవచ్చుననీ ఆచార్య టుచీ, చిరపరిశోధనద్వారా తెల్సుకున్నాడు.

ఆ గ్రంథం కోసం ఘున్ గర్ మఠానికి వెళ్ళాం. వెదకడం ప్రారంభించాం. అక్కడవున్న లామాలకు ఆ గ్రంథం సంగతి అసలే తెలియదు. మఠంలో వేలకొలదిగా లిఖిత గ్రంథాలు వున్నాయి. అవన్నీ వెదకడం సులభమైన పనికాదు. వెదకడంతో దినాలు వారాలు గడిచాయి. ఒకొక్క గ్రంథాన్ని దుమ్ము దులిపి చూడడమే కాని కావలసింది కనిపించలేదు. నాకు విసుగెత్తింది కాని టుచీ తేలికగా వదిలే మనిషి కాదు. ఒక పని పూనుకుంటే ఆయనకు రెండో సంగతి పట్టదు. ఒక

రోజు మతిమరుపులో వస్తును తిప్పి తోడుకున్నాడు. "అదృష్టం తిరిగింది. మీ గ్రంథం దొరుకుతుంది" అని చెప్పాను. అలాగే ఒకనాడు అడుగున పడివున్న వాటిని పైకిలాగి ఒకదాన్ని తీసుకవచ్చి ఆయనకు చూపాను. టుచీ పొంగిపోయాడు. ఒక బంగారుగని దొరికినా మనిషి అంత ఉప్పొంగ డనుకుంటాను. అది ఆ గ్రంథమే.

నాకుకూడా ఒక బహుమానం లభించింది. లామాల దగ్గర రెండు చక్కని జూలు కుక్కలు వున్నాయి. వాటిమీద నాకు మోజు కలిగింది. నేను అడగ్గానే లామాలు ఆ రెండు కుక్కలను నా కిచ్చారు. ఒకదానికి ఘుర్ ఘుర్ అని పేరు పెట్టాను. రెండోదానికి తాసాంగ్ అని పేరు పెట్టాను. రెంటినీ కూడా డార్జిలింగుకు తెచ్చాను. తాసాంగ్‌ను నాపూర్వ స్నేహితుడు ఆంగ్ తార్కేకు బహుమతి చేశాను. ఘన్ గర్ ఈనాటి వరకు మా యింట్లో నా భార్యకు తోడుగావుంది.

ఆచార్య టుచీ లామాలకు సంస్కృతగ్రంథం ఇచ్చినందుకు కొంత ద్రవ్యాన్ని ప్రతిఫలంగా యివ్వబోయాడు. జ్ఞానాన్ని అమ్ముకోవడం దోషమంటూ లామాలు ప్రతిఫలాన్ని స్వీకరించలేదు. ఇటలీకి వెళ్ళిన తరువాత గ్రంథానికి ప్రతిని తీసుకుని తిరిగి పంపమని కోరారు. బలవంతం మీద మఠానికి విరాళంగా అయిదువందల రూపాయలు తీసుకున్నారు. ఆదర పూర్వకంగా ఆ గ్రంథాన్ని ఆయన కిచ్చారు.

నా మనస్సులో ఎన్నోస్మృతులు నిలిచి వున్నాయి. లాసా నగరం, పాతాళభవనం, దలైలామా, ఆయన ఆశీర్వాదం, దేవళాలు, పూజాపతాకాలు, దీపాలు జపచక్రాలు గంటలు— ఇంకా ఎన్నో కళ్ళకు కట్టినట్టు కనబడుతూ వుంటాయి. "ఓం మణిపద్మే ఓం".

# 10. నా నివాసం - నా జాతి

నా నివాసం ఏదైనట్టు? ఒక విధంగా నా ఆత్మకు టిబెట్టు నివాసం. అయితే, వాస్తవంలో నేను టిబెటుకు పరాయి వాణ్ణి. పర్వతం నా నివాసం. కాని ఏ పర్వతం శిఖరంమీదనూ ఏ హిమానీ నదప్రదేశంలోనూ ఎవ్వడూ ఇల్లు కట్టుకుని కాపరం పెట్టడు. ఒకప్పుడు సోలో ఖుంబూ నా నివాసం. ఇప్పుడు అక్కడికి అడపా దడపా వెళ్ళుతూన్నాను. ఈ నాడు నా నివాసం డార్జిలింగు.

ఆధునిక షెర్పాలకు డార్జిలింగు కేంద్రం అయింది. అంటే, తమ జన్మస్థానాన్నీ పాత పద్ధతి బ్రతుకునూ వదిలిపెట్టి పెద్ద పెద్ద యాత్రలలో వెళ్ళుతూ కొత్త ప్రపంచంతో కలిసి పోయిన షెర్పాలు డార్జిలింగులో మూగుతూ వున్నారు.

ఆరంభంలో మేం పర్వతాలనుంచి వచ్చిన వాళ్ళం. మా చూపులు పర్వతాలవైపే వుంటాయి. మేం పర్వతాల వద్దకు వెళ్లే తీరు వేరు. పర్వత యాత్రలు లేని బ్రతుకులో మాకు రక్తి లేదు. సోలో ఖుంబూలో గ్రామీణులంగా బ్రతికే వాళ్ళం. డార్జిలింగుకు వచ్చి నాగరుల మయ్యాం. ఈ కాలం మాలో పంటలు పండిస్తూ పశువులను కాస్తూ బ్రతికే వాళ్ళు బహు తక్కువ. మా జాతిలో కొంతమంది స్త్రీలు పురుషులు తేయాకు తోటల్లో పని చేస్తారు. కాని వంట్లో బలంగల మగవాళ్ళు సగం సంవత్సరం పర్వతయాత్రలలో వుంటారు. మిగతా కాలం కూలి నాలి చేసుకుంటూ పశువు లను కాసుకుంటూ – లేదా యాత్రికులకు మార్గసూచకులుగా పోతూ – జీవితాన్ని గడుపుతారు.

మా జాతికూడా మారుతూవుంది. ముందుముందు ఈ మార్పు ఏరూపం తాలుస్తుందో చెప్పజాలం. ఇంతవరకు మాజాతి ఒక కట్టుగానే బ్రతుకుతూవుంది. ఇతరులతో వివాహసంబంధాలు అంతగాలేవు. మా జీవితం సాముదాయకంగా వుంటుంది. అనేకవిషయాల్లో – ఇండ్లతోసహా – అందరం కలిసి అనుభవిస్తూ వుంటాం. మా యిండ్లు కలపతో కట్టిన పొడుగాటి కట్టడాలు. వాటిలో ఎన్నోగదులు వుంటాయి. ఒక్కొక్క కుటుంబం ఒకటిరెండు గదులను ఉపయోగించు కుంటుంది. వంటగదులను మరుగుదొడ్లనుకలిసి వాడుకుంటాం. ఈమధ్య తూంగ్‌సాంగ్‌కు విద్యుచ్ఛక్తి వచ్చింది. కొన్నియిండ్లలో విద్యుద్దీపాలున్నాయి. కాని చాలా అవకాశాలు పూర్వపద్ధతిలోనే వున్నాయి.

మాలో పూర్వాచారాలు కొన్ని పోయాయి. ఇంకా కొన్ని త్వరత్వరగా మారుతున్నాయి. పూర్వాచారాలను పట్టుకు కూచునే స్వభావం మాకులేదు. కొత్తభావాలను అలవాట్లను జీర్ణించుకోగలం. కొన్నివిషయాల్లోమాత్రం మా పూర్వులదారినే నడుస్తూవున్నాం. అందులో ఒకటి ఆస్తికి సంబంధించిన విషయం. కుటుంబంలో పెద్దకొడుకుకన్నా చిన్న కొడుకుకు ఎక్కువభాగం వస్తుంది. కూతుళ్ళవిషయంలో కూడా అంతే.

చాలాభాషల్లో లాగేషెర్పాలు పెట్టుకునే పేర్లకు అర్థాలు వుంటాయి. నాపేరు తేనేజింగ్ నార్గేలో మొదటిమాటకు ధర్మరక్షకుడనీ రెండోమాటకు భాగ్యశాలి లేక అదృష్టశాలి అనీ లోగడ చెప్పాను. మామూలుగా స్త్రీ పురుషుల పేర్లకు మొదటవారే "ఆంగ్" అన్న పదానికి ప్రియ లేక ప్రియుడు

అని అర్థం. లామూ అంటే దేవత. అంగ్‌లామూ అన్న పదం మీద కొంత ప్రణయవ్యాఖ్యానం చేతామంటే నా పేరును గూడా చమత్కారం పట్టించడానికి అవకాశం వుండడం చేత మానివేస్తున్నాను. ఇంకా కొన్ని పేర్లు ఎక్కువ వాడుకలో వున్నాయి. ఫూ లేక భూ అంటే కుమారుడు. న్యిమా అంటే సూర్యుడు. నోర్బూఅంటే రత్నం. నాంగ్యార్ అంటే జయించే వాడు. ఈలాగే వారాల పేర్లనుకూడా పెట్టుకుంటారు. దావా అంటే సోమవారం. పసాంగ్ అంటే శుక్రవారం. పెంబాఅంటే శనివారం. కుటుంబ చరిత్రకు సంబంధించిన స్థలాలను బట్టిన్నీ సంఘటనలను బట్టిన్నీ కుటుంబ నామాలు వస్తాయి.

నల్లనికురులూ, నల్లనికళ్ళూ, చామనచాయ శరీరం షెర్పాలకు సహజ లక్షణాలు. మా రూపురేకలు ప్రధానంగా మంగోలియన్ లక్షణాలు కలవి. అయితే చైనా జాతికి, కనీసం టిబెటన్ జాతికి వున్నంత స్పష్టంగా వుండవు మాలో మంగోలియన్ లక్షణాలు. మా ముక్కులు కళ్ళు అన్ని రకాలుగానూ వుంటాయి. షెర్పాలు అంత పొడగరులు కారు. దేహాలు సామాన్యంగా బలిష్ఠమైనవి. దానికి షెర్పాలు చేసే పనీ వారు మోసే బరువులూ ప్రత్యక్ష ప్రమాణం. నా యెత్తు అయిదు అడుగులు యెనిమిది అంగుళాలు. మంచి ఆరోగ్య స్థితిలో నా తూకం నూటఅరవై పౌనులు. మామూలు షెర్పాకన్నా నేను ఎత్తుగానూ సన్నగానూ వున్నట్టు కనబడుతాను.

డార్జిలింగులో మా ఆడవాళ్ళు నేటికిన్నీ పాతరకం షెర్పా దుస్తులే ధరిస్తున్నారు. ఒకరకం నలుపు వన్నె అంగీని కట్టుకుంటారు. నిలువుగా రంగు చారలతో నేసిన వున్ని పైట వేసు

కుంటారు. మగవాళ్ళు చాలావరకు పాశ్చాత్యుల దుస్తులను-స్పోర్ట్సుషర్టులను, నిక్కర్లను, స్వెట్టర్లను - ధరిస్తున్నారు. పర్వత యాత్రలమూలంగా పాశ్చాత్య సంపర్కంవల్ల ఈలాంటి దుస్తులకు అలవాటు పడ్డారు - సామాన్యంగా ప్రతివాడు పాద రక్షలను - పాశ్చాత్య పద్ధతిగానో, దేశీపద్ధతిగానో - వేసు కుంటాడు. ఇండియాలోనూ నేపాలులోనూ పాదరక్షలను ప్రతివాడూ తప్పకుండా వేసుకునే పద్ధతి లేదు. ఎవరెస్టు పర్వతారోహణం జరిగిన తరువాత సాంఘిక సమావేశాల్లో నేను మామూలుగా బిగువైన తెల్లని ట్రౌజర్లనూ, మోకాలి వరకు వచ్చే నల్లని కోటునూ వేసుకుంటున్నాను. ఇతర సమ యంలో పాశ్చాత్య దుస్తులనే సామాన్యంగా ధరిస్తున్నాను. మా పూర్వపు దుస్తులను వేసుకుంటే నాకేదో వేషం వేసు కున్నట్టు తోస్తుంది.

మా షెర్పాలకు పర్వతారోహణలో అంత నైపుణ్యం వుందంటే మా దేహబలమూ పర్వతాలమీద మాకున్న మక్కువ- ఇవి మాత్రమే కాక మా తిండి అలవాట్లు కూడా ఒక కారణం. తూర్పు హిందువులకు ముస్లింలకు పూర్వాచార పరాయణులైన బౌద్ధులకు ఆహార విషయంలో మత నియ మాలు వుంటాయి. ఆరణ్యక ప్రదేశాల్లో వారికి ఆహారం సమకూర్చడం చాలాకష్టం. కాని షెర్పా అయితే ఏలాంటి ఆహారమైనా కొత్తది కానీ, ఎండించింది కానీ, డబ్బాల్లో పెట్టింది కానీ - తింటాడు. దొరలు తినేదైనా తింటాడు. ప్రత్యేకంగా ఆహార పదార్థాలను వెంట తెచ్చుకోవలసిన అగత్యం లేదు. సోలోఖుంబూలో వున్నప్పటి మాదిరే డార్జి లింగులోనూ మామూలుగా వురలగడ్డలూ మాంసమూ

కూరగాయలూ కలిపి వుడకపెట్టిన ఆహారమే మాకు ముఖ్యం. ఇండియాకు వచ్చిన వెనక పులుసు కూరలతో వరి అన్నం ఎక్కువగా తింటున్నాం - పిండీ మాంసమూ కలిపిన వుండలతో కాగబెట్టిన చారంటే పెర్వాలకు పూర్వంనుంచీ మహా ప్రీతి. ఆ చారును మో - మో అంటారు. ఇటలీ దేశంలో అలాంటి చారే వాడుతారని ఆచార్య టుక్కీ చెప్పేవాడు.

టీ మాకు ముఖ్యపానీయం. దానిని విపరీతంగా, ఇంగ్లీషు వారిలాగే ఎంత ఇముడ్చుకోగలిగితే అంత టీ తాగుతాం - పూర్వం టిబెట్టు పద్ధతి ప్రకారం యాక్ వెన్న కలుపుకుని టీ తాగడం మామూలుగావుండేది. డార్జిలింగులో యాక్‌లు లేవు. కాబట్టి పాశ్చాత్య పద్ధతిని చక్కెర, పాలు కలుపుకుని తాగుతున్నాం. ఇంకా ఘాటైన పానీయం కావాలంటే ఛాంగ్ అనే పెర్వా సారాయి వాడుతాం. ఈ సారాయిని యింట్లోనే తయారుచేస్తాం. బియ్యంతోనూ బార్లీతోనూ లేక వేపరకం ధాన్యంతోనూ దాన్ని తయారు చేయవచ్చు. ఈ సారాయిని మామూలు నీళ్లులాగా గ్లాసుల్లోపోసుకుని తాగరు. అది పొంగి గుజ్జులాగా తయారైనప్పుడు పెద్దగిన్నెలోవుంచి పైన వేడినీళ్లు పోస్తారు. పై నీటిని వెదురుగొట్టంలోనుంచి పీలుస్తూ తాగుతారు. గిన్నెలోని దంతా ఒక్కడే తాగడు. అక్కడ చేరిన ప్రతిమనిషీ తాగుతాడు. ఛాంగ్ కిందికిపోయ్యేకొద్దీ గృహస్థు నీళ్లునింపుతూ వుంటాడు. విందులో అయితే అతిథులందరూ యింట్లకు వెళ్లేవరకూ అలాగే నింపుతూ వుంటారు.

మా పనిపాట్లలో స్త్రీలు చాలావరకు సహాయపడుతారు. చాలామంది ప్రాచ్య స్త్రీలకన్నా వాళ్ళకు ఎక్కువ సహనం వుంటుంది. మా యింట్లలో ఆడదానిదే పెత్తనమంతా-కాని

అంతటితో పూరుకోరు. మగవాళ్ళ కష్టసుఖాల్లో పాల్గొం టారు. మగవాడు చేయదగిన పనులుకూడ చేస్తారు. చాలా మంది షెర్పిణులు పొట్టిగా వుంటారు. అయితే బలంలోనూ ఓర్పులోనూ మగవాళ్ళకుతీసిపోరు. బరువులను మోయడంలో కూడా స్త్రీలు వెనకబడరు.

మాలో భార్యాభర్తలమధ్య విడాకులు జరగవచ్చు. స్త్రీ కాని పురుషుడుకాని ఎవరు వదలదలుచుకుంటే వాళ్ళు రెండో వాళ్ళకు కొంతపైకం కట్టి తమ ఇచ్ఛానుసారంగా వెళ్ళవచ్చు. మా పూర్వుల నివాసమైన టిబెటులో బహు భార్యా స్వీకా రమూ బహు భర్తృస్వీకారమూ జాస్తిగా అమలులో వున్నాయి. అన్నదమ్ములు-ఇద్దరుగాని, అంతకన్నా ఎక్కువ మందికాని ఒక్కతేభార్యతో కాపరం చేస్తారు. ఆస్తులు చీలి కలుకాకుండా ఒక్కటే కుటుంబంలో నిలువుకోడానికి ఈపద్ధతి నవలంబిస్తారు. కాని ఈ పద్ధతి సోలోఖుంబూలో చాలా అరుదు. డార్జిలింగులో అసలే లేదు.

పాతరోజుల్లో షెర్పాకుర్రవాడు ఏమైనా నేర్చుకోవాలంటే ఏదో మఠంలోచేరడం ఒకటేమార్గం. సోలోఖుంబూలో మా మఠాలు వుండేవి. డార్జిలింగులో సిక్కిం టిబెటన్ మఠాలు తప్ప మా మఠాలు లేవు. ఆ కారణంచేత షెర్పాకుర్రవాళ్ళకు డార్జిలింగులో విద్యగడించే అవకాశాలు లేవు. గతయుద్ధం ముగిసినతరువాత మా కుర్రవాళ్ళు చాలామంది నేపాలీ పాఠ శాలలకు వెళ్ళుతున్నారు. 1951 లో ఒక చిన్న షెర్పాపాఠ శాల ప్రారంభించబడింది. నేను చదువుకోనందుకు ఎంతో విచారపడుతూ వుంటాను. వచ్చే తరంలో వాళ్ళకైనా నాకు లేకపోయిన అవకాశాలు కలగడం ఘనంగా భావిస్తున్నాను.

నా కూతుళ్ళు పేంపేం, నిమా చాలా సంవత్సరాలపాటు నేపాలీ పాఠశాలకు వెళ్లారు. నాకు తగిన సావకాశం కలగడం చేత ఈనాడు కాథలిక్ లోరెటో కాన్వెంట్టుకు వెళ్ళుతున్నారు. ఆ సంస్థను ఐరిష్ సన్యాసినులు నడుపుతున్నారు. నా పిల్లలు ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడడం నేర్చుకోగలరు. అన్ని రకాల మనుషులను కలుసుకుంటారు. ఆధునిక ప్రపంచానికి కావలసిన చక్కని విద్య అలవడుతుంది.

డార్జిలింగులో మా తాలూకు మఠం లేకపోవడంచేత మత సాధనకు ఉపకరించే కేంద్రం మాకు లేదు. కాని మా యిండ్లలో పూజ నిమిత్తం ఒక జాగా ప్రత్యేకంగా వుంటుంది. నా యింట్లో పూజకోసం ఒక గదిని పూర్తిగా వదిలాం. నేను టిబెటు నుంచి తెచ్చిన విలువగల పవిత్ర వస్తు సామ గ్రిని ఆ గదిలో వుంచాను. నా బావమరది "లామానవాంగ్ లా" ప్రతి దినం పెక్కుగంటలకాలం ఆగదిలో గడుపుతాడు. దీపాలను జాగ్రత్తగా చూడడం, ధూపాలు వేయడం, జపచక్రాలను తిప్పడం, మా అందరికోసం ప్రార్థనలు చేయడం – ఈ పనుల్లో నిమగ్నుడై వుంటాడు. శైలపర్వతం ప్రక్క పచ్చికపట్టుమీాద పొడుగాటి బొంగులు నాటి వాటిపైన పతాకాలు కట్టాం. దూరంలో కానవచ్చే కంచనజంగా మంచుమలకు ఎదురుగా ఆ పతాకాలు ఎగురుతూ వుంటాయి.

మాలో మృతకళేబరాలను దహనం చేస్తారు. పసిబిడ్డలైతే పూడుస్తారు. ఎత్తు పర్వతాలమీాద చచ్చిన వాళ్ళను అక్కడే పూడుస్తారు. లేదా ప్రకృతే పూడ్చివేస్తుంది.

షెర్పా కుర్రవాడు తలఎత్తి పర్వతాన్ని చూస్తాడు. తల వంచి బరువును చూస్తాడు. ఆ బరువును ఎత్తుకొని పర్వతం మీదికి బయలు దేరుతాడు. పర్వతాన్ని పైదాకా ఎక్కడం కాక పోయినా మీదికి క్రిందికి బరువులు మోయడం తప్పదు. అలాంటిది షెర్పా బ్రతుకు : పైకీ క్రిందికీ బరువులు మోయడం. అది అతనికి కొత్త పనీకాదు, అసహ్యమైన పనీ కాదు – సహజవృత్తి. ఆ బరువులను వంకరటింకరగా మోసుకో పోడు. మోస్తున్నందుకు విసుక్కోడు. ఆ బరువు ఆతని శరీరంలో ఒక భాగం. ఆ బరువుకు ఒక తోలుపట్టా కట్టివుంటుంది. దాన్ని బుజాలకు కట్టుకోడు. నుదురుకు కట్టుకుంటాడు. చిర కాలం అనుభవాన్నిబట్టి బరువులు మోయడానికి ఇదే ఉత్తమ పద్ధతని షెర్పాలు గ్రహించారు. మామూలు షెర్పా నేల మీద నూరు పౌనుల బరువుకు పైగా మోయగలడు. ఎత్తు పర్వతాలమీద డెభ్భై ఎనభ్భై పౌనుల బరువు వరకు మోయ గలడు.

షెర్పా పర్వత యాత్రలలో చేసేపనియొక్క నిజస్వభావం చాలామందికి సరిగా తెలిసినట్టు కనిపించదు. ఆల్ప్స్ పర్వ తాల మీద ఎక్కడమూ దిగడమూ అలవాటు పడిన మను షులు యాత్రికులవెంటవుండి పైకి తీసుకపోతూ వుంటారు. కాని హిమాలయ పర్వతాల మీద ఏది దారో ఎక్కిచూచిన వాళ్ళు ఎవరూ లేరు. అందుకోసం ఆల్ప్స్ పర్వతాల మీద దారిచూపడం లాంటిదికాదు హిమాలయాలను ఎక్కించడం. యాత్రికులను ఎక్కించడంలో షెర్పాకు ముందు తరిబీతు వుండదు. అలాంటి తరిబీతు లేకపోయినా ఫరవాలేదు. హిమా లయాల మీదికి ఎక్కడానికి వచ్చే ప్రపంచ యాత్రికులు

పర్వతారోహణంలో బాగా ఆరితేరినవారు. మొదలు మొదలు మూటలు మోసేవరకే మా షెర్పాల పని. సంవత్సరాల మీదట పర్వతారోహణంలో మెలకువలను చాలా వరకు తెలుసుకున్నాం. అందులో నేర్పు గడించాం. దారులు కని పెట్టడంలోనూ, మెట్లను చెక్కడంలోనూ, తాళ్ళను కట్టడం లోనూ, సరైన క్యాంపులను ఏర్పర్చడంలోనూ ఈనాడు షెర్పాలు ఎంతో సాయపడగలరు. మాతో వున్న దొరల విష యంలో అన్ని జాగ్రత్తలు తీసుకోవడం మా విధిగా భావిస్తాం. వారికి టీ కాచిపెడతాం. వంటలు చేస్తాం. వారి సరంజామును కనిపెట్టి వుంటాం. గుడారాల్లో వారికి అన్ని వసతులూ సమ కూడేట్టు చూస్తాం. ఈ పనులన్నీ చేయాలి కాబట్టి చేయడం కాదు – చేయాలన్న అభిలాషకొద్దీ చేస్తాం. అంటే నౌకర్ల లాగా కాకుండా మనస్ఫూర్తిగా స్నేహభావంతో చేస్తాం. మా వేతనాలు కూడా క్రమంగా పెరిగాయి. మమ్మల్ని ఆదరంగా గౌరవంగా చూస్తున్నారు.

కాలక్రమేణా షెర్పాల జీవితంలో ప్రధానపాత్రవహించిన సంస్థ హిమాలయన్ క్లబ్. అందులో చాలామంది ఇంగ్లీషు వారు–కొద్దిమంది ఇండియన్లుకూడా వున్నారు. పర్వతారోహ ణంలో ఆసక్తి కలిగిన ఇతర జాతీయులుకూడా వున్నారు. పర్వ తాలను ఎక్కే జట్టులను స్వయంగా ఆసంస్థ పంపదు. కావల సిన ఏర్పాట్లు ఎన్నో చేస్తుంది. దాదాపు ప్రతి యాత్రలో కూడాను ఆసంస్థ మార్గదర్శిగా ఉపయోగిస్తూవుంది. ఆ సంస్థ– దాని కార్యదర్శులు మంచిపని చేశారు. ద్రవ్యవిషయంలో షెర్పాలకు కొంత అసంతృప్తి వుంటూ వచ్చింది. ప్రస్తుతం ఒక స్వంత సంస్థద్వారా పనులు నిర్వహించుకుంటున్నాం. ఈ

సంస్థ 1920 లో ప్రారంభమైంది. అప్పుడు దానిపేరు "షెర్పా బౌద్ధసంఘం". మొదలు మతవిషయాలనే ఎక్కువగా పట్టించుకుంటూ వుండేది. యుద్ధకాలంలో ఈ సంస్థ అట్టే పనిచేయ లేదు. ఈ మధ్యనే దాన్ని పునరుద్ధరించడం జరిగింది. ఆ పేరులో నుంచి 'బౌద్ధ' అన్నమాటను తీసివేశారు. ఈనాడు మత విషయాలులేకుండా మా సంఘానికి సంబంధించిన అన్నిరకాల లౌకిక విషయాలనూ ఈ సంస్థ నిర్వహిస్తూ వుంది. ఏ కుటుంబంలోనైనా ఒక వ్యక్తి రెండువారాలకుమించి జబ్బునపడితే మళ్లా ఆరోగ్యం కలిగేవరకు ఈ సంస్థ కొంత ద్రవ్యసహాయం చేస్తుంది. ఎవరైనా కాలంచేస్తే దహన సంస్కారంనిమిత్తం ఇరవై రూపాయిలు ఇస్తుంది. కొంతకాలంనుంచి షెర్పాలకు ఉద్యోగాలను సమకూరుస్తూ, యాత్రలలో పాల్గొనే షెర్పాలకు "లేబరుయూనియన్"గా వుంటున్నది. హిమాలయన్ క్లబ్ నిర్ణయించిన దానికంటే అధిక వేతన పరిమాణాన్ని సంపాదించడానికీన్నీ, దెబ్బలు తలిగినవాళ్ళకూ చనిపోయిన వ్యక్తుల కుటుంబాలకూ నష్టపరిహారం ఇప్పించడానికీన్నీ ప్రయత్నిస్తూంది. ఈ సంస్థలో 82 మంది సభ్యులు వున్నారు. దీనికి నేను అధ్యక్షుణ్ణిగా వున్నాను. మా సంఘానికి ఈ సంస్థ ద్వారా చాలా మేలు చేకూరగలదని నా విశ్వాసం.

పర్వతాలను ఎక్కడానికి వెళ్ళి తిరిగి రాని షెర్పాల విషయం నా మనస్సులో మెదులుతూ వుంటుంది. సామాన్యంగా చావులు ఆకస్మికమైనవి – కాని ఒక్కొక్కప్పుడు ధైర్యసాహసాల ఫలితంగానూ జరుగుతాయి నంగ పర్వత్ మీద ఎల్లీ మెర్కల్‌తో వుండిన గేలేను ఏ షెర్పా విస్మరించ నేరడు. అలాగే కికులీ విషయం కూడాను. 1939 లో జరిగిన

అమెరికన్ యాత్రలో అతను సర్దార్‌గా వెళ్ళాడు. దిగడంలో అన్నీ ఇబ్బందులే కలిగాయి. ఎక్కిన జట్టులో డుష్లేవుల్ఫ్ పర్వతం మీద ఒంటరి చిక్కి జబ్బులో వున్నాడు. మిగిలిన వాళ్ళందరూ క్రింది మకాంలో వున్నారు. తక్కిన షేరాలు పైకి వెళ్ళలేనంతగా అలిసి పోయారు. వాతావరణం ప్రతికూలంగా మారుతూ వుంది. కికులీ ఒక్క షెర్పాను–త్సేరింగ్–వెంటపెట్టుకొని ఒక్కరోజులో క్రింది మకాం నుంచి ఆరో మకాం వరకు ఏడువేల అడుగులు ఎక్కాడు. ఆగకుండా పర్వతం మీద అంత దూరం ఎక్కడం ఎన్నడూ జరగలేదు. మరుసటి రోజు కికుళీ ఆరో మకాంలో వున్న ఇద్దరు షెర్పాలను కలుపుకొని ఏడో మకాంకు చేరాడు. వుల్ఫ్ అక్కడ పడి వున్నాడు. ఇంకా ప్రాణంతోనే వున్నాడు. కాని దిగి రాగల బలం లేదు. ఆ ముగ్గురు అక్కడ వండుకునే స్థలం లేక ఆ రాత్రి ఆరో మకాంకు దిగి వచ్చారు. మరుసటి ఉదయం కికులీ మళ్ళా ఇద్దరు షెర్పాలతో పైకి వెళ్ళాడు. వుల్ఫ్‌ను క్రిందికి మోసుకురావాలని అతని పట్టుదల. అంతలో తుపాను ముసుకవచ్చింది. ఆ ధీరుడు కికుళీ, అతని అనుచరులూ, ఒక ప్రాణిని రక్షించే ప్రయత్నంలో తమ ప్రాణాలను బలిపెట్టారు.

ఈ లాంటివి నా మనస్సులో మెదులుతూవుంటాయి. నేను షెర్పా నని గర్వపడుతూ వుంటాను. మా కృషిని గ్రహించ గలిగిన ఏ వ్యక్తికాని నాలుగురాళ్ళకోసం షెర్పా పర్వతాలను ఎక్కుతాడని నమ్మడనుకుంటాను.

# 11. ఎంత పర్యటన!

1948 శీతాకాలంలో నా పూర్వమిత్రుడు మిస్టర్ గిబ్బన్ ఇండియాసేన తాలూకు పరిశోధనశాఖలో నాకు ఒక ఉద్యోగం సిఫారసుచేసినట్టు తెలిపాడు. దానిఫలితంగా ఆ సంవత్సరంలో ఒకసారిన్నీ మరుసటి సంవత్సరంలో ఒకసారిన్నీ పర్వతారోహణలో సైనికులను తరిబీతుచేయడానికి ప్రత్యేక శిక్షకుణ్ణిగా ఇండియా వాయువ్య ప్రదేశాలకు వెళ్లాను. ఈ శిక్షణలో పర్వతాలను ఎక్కడమేకాక మకాంలు యేర్పర్చడం, బయళ్ళలో వంటలుచేయడం, వస్తుసామగ్రిని జాగ్రత్తపరుస్తూ ప్రుపయోగించుకోవడం, ఇంకా, నిర్జనప్రదేశాలలో అవసరమైన అన్ని విషయాలుకూడా నేర్పాలి. ఆపని నాకు సంతోషాన్నీ సంతృప్తినీ కలిగించేది. మొదటి సంవత్సరం కులూ రాష్ట్రంలోనూ, రెండోసంవత్సరం కాశ్మీరులో గుల్మర్గ్ బస్తీవద్దనూ శిక్షణ కేంద్రాలు సాగాయి. రెండు స్థానాలకూ శీతాకాలంలోనే వెళ్లాను. ఎత్తు ప్రదేశాలకు వెళ్ళినప్పుడు నాకు "స్కీ" చేయడానికి మంచిఅవకాశం దొరికింది. తరిబీతు ఇచ్చినందుకు సైనిక శాఖ నాకు యోగ్యతాపత్రాలు సమర్పించింది.

హెచ్. డబిల్యూ.-టిమన్‌తో నేపాలు వెళ్ళడానికి ఉత్తరం ద్వారా ఏర్పాటు చేసుకున్నాను. 1938 లో ఎవరెస్టుకు వెళ్లినప్పుడు ఆయనపట్ల నాకు ఎంతో మెప్పుదల కలిగింది. మళ్లా ఆయనతో వెళ్లడ మంటే నా కెంతో సంతోష మైంది. నలుగురు షెర్పాలను వెంటబెట్టుకుని నేను డార్జిలింగు నుంచి కలకత్తాకు వెళ్లాను. అక్కడ టిమన్‌నూ ఇద్దరు ఆంగ్లేయులనూ కలుసుకున్నాను. అందరం కలిసి వాయువ్య మార్గంగా

నేపాలు దక్షిణ సరిహద్దుకు వెళ్లాం. 1934 లో ఇంటినుంచి పారిపోయి వెళ్లింది కాక మళ్లా నేను నేపాలు వెళ్లలేదు. ఆతడవ నేపాలు యాత్ర నాకు చాలా ఉత్సాహకరంగా వుండింది.

టిమన్‌కు దేశం నాలుగు మూలలూ బాగా తెలుసు. ఆయన ఇద్దరు స్నేహితులకు పూలను గురించీ ఖనిజాలను గురించీ బాగా తెలుసు. వారి పరిశోధనల మూలంగా మాకు పైకీ క్రిందికీ, ముందుకూ వెనక్కూ చుట్లు తిరగడంతో మూడు నెలలు పట్టింది. ఒక్కొక్క సమయంలో కీకారణ్యాలలోనూ, పర్వతాల మీదనూ, హిమానీ నద ప్రదేశాలలోనూ, కనుమ దారుల్లోనూ తిరుగుతూ వుండే వాళ్లం. ఎన్నడూ ఎవ్వరూ చూడని దారులను వెతకడంతో మాకు చాలా కాలం వ్యయమైంది. హిమానీ నద ప్రదేశాల్లో తిరుగుతూ వున్నప్పుడు నాకు కళ్ల మసకలు కలిగాయి. నా జీవితంలో అలాంటి అనుభవం కలగడం ఆ ఒక్క పర్యాయమే. నావద్ద నల్లద్దాల గాగిల్సు ఒక జత వుండేది. అవి ఎక్కడో పోయాయి. ఒకరోజు మంచు మైదానం మీద నడుస్తూ వుండగా నాకు కళ్లలో నొప్పి వేయ సాగింది. కళ్లను మెల్లగా మర్దన చేశాను—నీళ్లలో కడుక్కున్నాను. కళ్లు మూసుకునే నడవాలని చూచాను. కాని ప్రయోజనం లేకపోయింది నొప్పి క్రమక్రమంగా పెరిగి భరించరాని స్థితికి వచ్చింది. కళ్లను బాకులతో పొడుస్తూ వున్నట్టుగా వుంది. ఎర్రగా కాచిన బాకులతో కళ్లను తోడివేస్తున్నట్టుగా వుంది. రెండు గ్రుడ్లూ తల్లోనుంచి వూడి పడిపోతా యనిపించింది. ఆ మంచు మైదానాన్ని దాటిపోయ్యే వరకూ, తరువాత కూడా

కొంతసేపు, అలాగే వుండింది. అయితే, మంచువల్ల కలిగే కళ్ల మసకలు కళ్లపోట్లూ దీర్ఘకాలం బాధించేవి కావు. అదృష్టవశాత్తు ఆ బాధ తగ్గి తెప్పరిల్లుకున్నాను. ఆ నాటి నుంచి ఎక్కడికి యాత్రలు వెళ్లినా అదనంగా ఒక గాగిల్సు జత దగ్గర వుంచుకుంటున్నాను.

అరణ్యప్రదేశాల్లో మాకు ఇంకా కొన్ని అనుభవాలు కలిగాయి. టిమర్ చింపిరి జుత్తునుచూచి బాలూ అంటే ఎలుగు బంటి అని హాస్యంగా పిలిచేవాళ్ళం. పదేపదే మాకు లింబూ అనేగ్రామం తగులుతూవుండేది. ఆయన్నుచూచి అక్కడి ప్రజలు ఉద్రేకం పొందేవాళ్లు. ఒక్కొక్కసమయం పరుగెత్తి పోయేవాళ్లు. ఒక్కొక్కప్పుడు విచిత్రంగా ఆయన్ను చుట్టు కుని నవ్వేవాళ్ళు. ప్రజలతో మాకు ఏలాటియిబ్బంది కలిగేది కాదు. అదృష్టంవల్ల అడవిమృగాల భయంకూడా కలగలేదు. మా పాలిటికి శత్రువులు నిజంగా జలగలు – క్రిందిప్రదేశాల్లో ఎక్కడపట్టినా అవే. బురదప్రదేశాల్లో అవే. పచ్చికమీద కూర్చుంటే చుట్టూఅవే. పైన చెట్లనుంచి నెత్తిమీద రాల డానికి సిద్ధంగావుంటాయి. జలగకాటు అపాయకరమైందికాదు. బాధకూడావుండదు. బాధ లేకపోవడంవల్లనే బట్టలు విడిచే వరకూ, అవి పట్టుకున్నసంగతే మనకు తెలియదు. చర్మానికి అంటుకుని మన నెత్తురుతాగి బాగాబలిసి ఉంటాయి. అవి ముఖ్యంగా పాదాలకు చీలమండలకు పట్టుకుంటాయి. చిన్న విగా వున్నప్పుడు స్టాకింగుల్లోకి బూట్లలోకి చొచ్చుకపోతాయి. అవి అంటుకోకుండా వుండాలంటే దేహంనిండా వుప్పుపులుము కోవాలి. వాటికి వుప్పువాసనపడదు. కిరసీనులో ముంచిన వస్తువులనుకూడా అవి ముట్టవు. కాని కిరసీను దేహంనిండా

పూసుకోవడంకన్నా జలగల బాధపడడమే మేలనిపిస్తుంది. జలగలు పట్టుకుంటే పీకినా వదలవు. వాటిని కత్తితో కోసి తీసి వేసుకోవాలి. అలాంటిది జలగపట్టు.

టిబెట్టు–కులూ–కాశ్మీరు–నేపాలు–యాత్రలను ఒక దాని వెంట ఒకటి ముగించి డార్జిలింగుకు వెళ్లాను. రాగల యాత్రలకు ఆసక్తితో ఎదురుచూస్తున్నాను. అంతలో ఘూర్వాల్ యాత్ర రానేవచ్చింది. నా పూర్వస్నేహితుడు మిస్టర్ గిబ్సన్‌తో కలిసి బందర్ పంచ్ కి ప్రయాణం కట్టాను.

బందర్ పంచ్ నుంచి వచ్చేదారిలో నాకు ఎన్నటికీ మరవజాలని ఒక అనుభవం కలిగింది. ఒకనాడు దూతీతాల్ అనే సరస్సువొడ్డున విశ్రాంతికోసం ఆగాం. అలిసివుండుటచేత నేను ఎండలో పండుకుని మొహంమీద హాటు పెట్టుకుని నిద్రపోయాను. సగం మెలుకువలో నాహాటుమీద ఏదో బరువుగా వున్నట్టుతోచింది. చేతితో తాకితే చల్లగానూ నునుపుగానూ వుంది. ఒకపాము హాటునుచుట్టుకుని ఎండకు వెచ్చగా నిద్రపోతూంది. వెంటనే కేకవేస్తూ లేచి హాటునూ పామునూ విసిరిపారేశాను. అక్కడే నిద్రపోతున్న షెర్పాలు నా అరుపుకు మేలుకుని పామునుకొట్టి చంపారు. అట్లా చంపటంతప్పు అని పాము దానంతటవచ్చి ఆవిధంగా చుట్టుకోవడం రాగల అదృష్టానికి సూచననీ, ఘూర్వాలీపోర్టర్లు చెప్పారు. పాముతలమీదికి పాకితే అమనిషి తప్పకుండా రాజు అవుతాడని వాళ్ల నమ్మకం. కాని రాజునై కిరీటంధరించేదానికన్నా హాటుపెట్టుకుని మామూలుమనిషిగా వుండడమే నాకు సమ్మతం.

# 12. నంగపర్బత్ - నగ్నపర్వతం

హిమాలయాల్లో పడమరవైపు దూరంగావుంది నంగ పర్బత్. నంగపర్బత్ అనగా నగ్నపర్వతం. డార్జిలింగునుంచి గాని ఎవరెస్టునుంచిగాని ఆ పర్వతం వేయి మైళ్ళకు మించిన దూరంలో వుంటుంది. మిగిలిన హిమాలయ పర్వతా లన్నిటి మీాదా మరణించినంతమంది యాత్రికులు దాదాపుగా ఆ పర్వతం మీాద మరణించారని చెప్పవచ్చు. అపాయాలకూ మరణాలకూ ఆ పర్వతం పెట్టిందిపేరు.

హిమాలయాల్లో దూర ప్రాంతాలకు పెద్ద యెత్తున యాత్ర జరపాలన్న వుద్దేశంతో నేను కొంతకాలం కెప్టాను జె. డబిత్యాథారస్లీతో వుత్తర ప్రత్యుత్తరాలు నడిపాను. ఆయనతో ఇద్దరు స్నేహితులు గూడా వున్నారు. ఇద్దరూ యువకులు. ఒకడు కెప్టాను. డబిల్యూ. హెచ్. గ్రేస్. రెండోవాడు లెఫ్టినెంటు రిచర్డుమార్ష్. 1950 ఆగస్టులో నేను బందర్ పంచ్ నుంచి తిరిగి రాగానే మళ్ళా ప్రయాణం కట్టాను. నేను సర్దారుగా వున్నాను. ఇంకా ముగ్గురు షెర్పా లనుకలుపుకున్నాను. వారు ఆంగ్ టెంపా, అజిబా, ఫూతార్కే.

కలకత్తా వెళ్ళి మార్ష్ను కలుసుకున్నాం. అక్కడినుంచి ఆయనతోకూడా రావల్పిండి వెళ్ళి థారస్లీనూ గ్రేస్నూ కలుసుకున్నాం. అందరం కలిసి పెషావరు వెళ్ళాం. అక్కడి నుంచి విమానంమీాద జిల్గిట్ చేరుకున్నాం. విమానం యెక్కడం నాకదే మొదలు. నాకా అనుభవం ఉత్సాహ కరంగా వుంది. బెల్టులతో సీట్లకు కట్టినప్పుడు మాత్రం మాకు ఏలాగో వుండింది. వాటిని సళ్ళించుకున్న తరువాత కిటికీల గుండా బైటికి తొంగిచూడ నారంభించాం.

జిల్జిట్ నుంచి పైకి వెళ్ళాం. పర్వతానికి ఉత్తరంగా పచ్చిక బయలు. ఎదట నంగ పర్బత్ ప్రత్యక్ష మైంది. ఆ పేరు ప్రసిద్ధంగా వున్నా ఆ పర్వతానికి తగిందిగా నాకు తోచలేదు. పర్వతం ఎక్కడా నగ్నంగా లేదు. క్రిందికీ పైకీ మంచు మయంగానే వుంది. అసలు దాని గాతి ఆకారం ఏలాంటిదో తెలుసుకోవడం అసాధ్యమనే చెప్పవచ్చు. ఇంకా దాని ఆకారాన్ని బట్టి మహాపర్వతం అని పిలవ వచ్చు. ఆ పర్వతం యెత్తు 26,660 అడుగులు. హిమాలయాల్లో ఎత్తును బట్టి దానికి తొమ్మిదో స్థానం. కాని, అవతలి వైపున సింధూ నదికి ఎదురుగా చూస్తే అన్నింటిలో అదే ఎత్తైన పర్వతం అంటారు.

అది శీతాకాలంలో నవంబరు చివర. మాలో ముగ్గురు దొరలు నలుగురు షెర్పాలు వున్నారు. ఈ సమయంలో ముందుకు వెళ్ళడం మూర్ఖత్వమే. కాని పర్వతం అంచు వరకు వెళ్ళాం. పర్వతం కొనదాకా ఎక్కుదామని దొరలు కూడా చెప్పలేదు. ఉష్ణోగ్రతనూ మంచులో శ్వాసోచ్ఛ్వాసాలనూ గమనించడం లాంటి వైజ్ఞానిక కృషిని చేస్తున్నారు. అందు కోసం కొంతవరకు పర్వతం పైకి ఎక్కాలని వారి కోరిక. కొంత దూరం వెళ్ళి మొదటి మకాం పెట్టాం. ఈ లోపల చలి క్రమక్రమంగా పెరిగిపోయింది. మంచు గాలి వీస్తూ వుంది. ఒకచే హోరు గాలి. పైకి వెళ్ళుదాం అన్నాడు థార్న్లీ. మార్ష్ గేస్ ఆయన మాటకు సరేనన్నారు. షెర్పాలకు మాకు అంత నమ్మకంలేదు. ఎట్టిస్థితిలోనూ నాది వెనక్కు తిరిగే స్వభావంకాదు. నన్ను ఒప్పించడం సాధ్యమే. పైకి రమ్మని నన్ను బ్రతిమాలు కున్నారు. కన్నీళ్ళదాకా

వచ్చింది. ఆలాంటి సమయంలో ఒక నిశ్చయానికి రావడం సులభంకాదు. మిగతా షెర్పాలు చెపుతూవున్నది క్రమ మని నా మనస్సుకు తెలుసు. నేనుకూడా రాజాలనని దొర లతో చెప్పాను. కాని పైకి వెళ్ళడానికి వారు నిశ్చయించు కున్నారు. వారూ మేమూ విడిపోయాం. తుదకు ఏదైనా అపాయం కలిగితే ఆ బాధ్యత మాదికాదనీ, మాకు పూర్తి వేతనాలు ఇవ్వాలనీ వ్రాసి మా చేతికి ఒకలేఖ యిచ్చారు. వారికోసం రెండువారాలపాటు క్రింది మకాంలో కనిపెట్టుకుని వుండడానికి వప్పుకున్నాం.

రెండురోజులు తరువాత ఎవరో పైనుంచి దిగుతూ వున్నట్టు కనిపించింది. కాని ఒక్క మార్ష్ మట్టుకే దిగి వచ్చాడు. కాళ్ళు కరడుగట్టి పైకి పోలేక దిగి వచ్చాడు. థారన్లీ గ్రీసుల పోలకువ ఏమైనా కనబడుతుందేమోనని పైకి చూచాం. ఒక సాయంత్రం పైన గుడారం వేసుకుంటూ న్నట్టూ వంటచేసుకుంటూన్నట్టూ కనిపించింది. చీకటిపడ్డ తరువాత ఏమీ చూడలేక పోయాం. ఆ రాత్రి నాకు ఒక కల వచ్చింది. థారన్లీ గ్రీసు కొత్త దుస్తులు వేసుకుని మా వద్దకు వస్తున్నారు. వారిచుట్టూ తలలులేని మనుషులు వున్నారు. మామూలుగా నాకు మూఢ నమ్మకాలులేవు. కాని ఆలాంటి కల అపాయాన్ని సూచిస్తుందని మావాళ్ళు నమ్ముతారు. మిగిలినరాత్రి నిద్రపట్టక ఆందోళనతో పొర్లా డుతూ పండుకున్నాను. ఉదయం లేచి భూతద్దాల గుండా చూస్తే గుడారం కనిపించలేదు.

ఆ రోజంతా పర్వతంవైపు చూస్తూ కూచున్నాం. ఏమీ కనిపించిందికాదు. ఏదో అపాయం జరిగిందని సాయంత్రానికి

రూఢి చేసుకున్నాం. చివరకు మార్క్ అజీబా నేనూ పైకి వెళ్లేట్టున్నూ ఆంగా తెంపా తార్కే క్రింది మకాంలో కనిపెట్టు కుని వుండేట్టున్నూ నిర్ణయించుకున్నాం.

మరుసటిరోజు పర్వతం మీదికి వెళ్లాం. పూర్వం మకాం పెట్టిన చోటికి చేరి కొత్త మకాం పెట్టాం. మా స్థితి కూడా అధ్వాన్నంగావుంది. థారస్లీ గేస్ ఏమయ్యారో అన్న బాధ మాకు దుస్సహంగావుంది. ఉదయపుపూట చలి మరీ ఎక్కువగావుంది. నోటివెంటవచ్చే ఆవిరి మంచుకరుళ్ళుగా వస్తూంది. మా మొహాలనిండా మంచు కరుళ్ళు. ఏలాగో గుడారం వదిలి పెట్టి పైకి వెళ్ళాం. 150 అడుగులు నడవడానికి ఒక్క గంట పట్టింది. తరువాత ఆ మాత్రంకూడా నడవలేక పోయాం. అక్కడ ఆగాం. నంగపర్బత్ మైళ్ళ మెత్తున ధవళ శిఖరంతో కనిపిస్తూవుంది. మెల్లగా వెనక్కు తిరిగాం.

సాయంకాలానికి మకాం చేరుకో గలిగాం. మరుసటి రోజు వుదయం నేనూ ఆంగ్ టెంపా పరుగులమీద వెళ్లి ఆ నాడే జిల్ జిట్ చేరాం. అక్కడ ప్రభుత్వం అన్వేషకులను ఏర్పాటు చేసింది. ఒక సైనికాధికారిని పదకొండుమంది సైనికులను మాతో పంపారు. అందరం కలిసి జీపులమీద కొంతవరకు వెళ్ళి పర్వతం చేరుకున్నాం. కాని మా ప్రయత్నం విఫల మైంది. మంచు జాస్తిగా పడడంవల్ల మొదటి మకాం వద్దకే వెళ్ళలేకపోయాం. మళ్లా జిగ్గిట్ కువచ్చి సైనికవిమానంమీద పర్వతంచుట్టూ తిరిగి చూచాం. కాని మాకేమీ కనిపించ లేదు. పాపం, మార్క్ కాళ్ళబాధ అలాగేవుంది. జిల్జిట్ నుంచి విమానంమీద అమృతసర్ చేరి అక్కడ విడిపోయాం.

# 13. నందదేవి

స్త్రీలకు ఇరవై అయిదు సంవత్సరాలు పురుషులకు ముప్పయి అయిదు సంవత్సరాలు వెళ్ళినతరువాత జీవితంలో గొప్ప మేలో గొప్ప కీడో జరిగేకాలమని పెద్దాలనమ్మకం. నాకు ఆ యీడు వచ్చింది. ప్రారంభంమాత్రం శుభంగా లేదు. నగ్నపర్వతయాత్రలో మరణాలు జరిగాయి. ఈ సంవత్సరం మళ్ళా రెండుయాత్రలు పెట్టుకున్నాను.

ఒక ఫ్రెంచిజట్టుతో నందదేవి పర్వతారోహణకు హిమాలయన్‌క్లబ్ ద్వారా ఖరారు చేసుకున్నాను. ఈ యాత్రలో పద్దెనిమిదిమందిమి వున్నాం. ఫ్రెంచివారు ఎనమండుగురు. రోగర్ డూప్లాట్ నాయకుడు. పెద్దాలు తొమ్మిదిమంది. ఇండియా సైన్యశాఖకు ప్రతినిధిగా "నందూ" జయాల్ చేరాడు. లోతుగావున్న ఇరుకు త్రోవగుండా ఏలాగో రుషిగంగా వద్దకు వచ్చాం. తిన్నగా నందదేవి పర్వతం మొదట్లో పుణ్యక్షేత్రంలో ప్రవేశించాం. ఆ ప్రదేశం పూల చెట్లతో నిండి వుంది. ఆ శోభ అద్భుతంగా వుంది.

ఆ పర్వతం పవిత్రమైంది. నందదేవి అనగా పరమేశ్వరి. ఆ పర్వతానికి రెండు శిఖరాలు వున్నాయి. రెంటిని ఎక్కాలని మా ప్రయత్నం. అందంగా వున్నా ఆ పర్వతం చాలా పెద్దది. భయంకరమైంది కూడాను. రెండు శిఖరాలను కలిపే మంచు చరియ చాలా ఆకర్షణీయంగా వుంటుంది. దాని మీదుగా ఎక్కిపోవాలని ఫ్రెంచివారి సంకల్పం. నందదేవి అసలు శిఖరం 25,660 అడుగులయెత్తు. తూర్పు శిఖరం 24,400 అడుగుల

యెత్తు. రెంటి మధ్య 2,3000 అడుగులకు తక్కువ ఎక్కడా లేదు. మొత్తం పొడవు రెండు మైళ్ళకు మించి వుంటుంది.

డూప్లాట్ తనతో గిల్బర్ట్ విగ్నెస్‌ను వెంటబెట్టుకుని పర్వతం చివరిదాకా ఎక్కడానికి పూనుకున్నాడు. వారిద్దరూ కొంతమంది షెర్పాలతో సహా మూడో మకాంనుంచి పైకెక్కి 23,600 అడుగుల యెత్తులో నాలుగో మకాం పెట్టారు. తరువాత షెర్పాలు దిగి వచ్చారు. వారిద్దరు ఆ రాత్రి అక్కడ గడిపి మరుసటిరోజు వుదయం (జూను 29) శిఖరానికి బయలుదేరారు.

ఈ లోపుగా వారు నందదేవి తూర్పువైపున దిగి వచ్చే వరకు వారిని కలుసుకోడానికి ఏర్పాట్లు జరిగాయి. ఆ పనికి టాయిూ దుబోస్ట్, డాక్టరు పయాన్, నేనూ నియమించబడ్డాం. మేం క్రింది వైపునుంచి పర్వతాన్ని దాటి తూర్పు ప్రక్కగా పైకెక్కి లాంగ్ స్టాప్ అనే ఎత్తుకనుమ వద్దకు వెళ్లాం. అక్కడ కనిపెట్టుకుని వున్నాం. జూను 29 ఉదయాన అసలు శిఖరం దిగుడులో – కొన్ని మైళ్ళదూరాగాన – రెండు స్వల్ప చిహ్నాలు కనిపించాయి. మంచు తెరలు వుంటినా ఆ యెత్తులో వారిని చూడగలిగాం. కాని అంతలోనే వారు కనపడకుండాపోయారు. మళ్లా చూడడం పడలేదు. ఆ నాడే వారిని చూడ గలుగుతా మనుకోలేదు. చివరి చరియమీాద నిలవాలని వారి వుద్దేశం. మరుసటి ఉదయం కనుమవద్దనుంచి తూర్పు శిఖరం వైపు ఎక్కాం. దిగివస్తూ వుండగా మధ్యలో వారిని కలుసుకోవాలని – మా ప్రయత్నం. ఉదయం దాటింది వారు దిగిరాలేదు. మధ్యాహ్నం దాటింది – వారు గాలేదు. చీకటి పడగానే మేం తిరిగి మా మకాం వద్దకు వెళ్ళాం.

ఆ రోజు వారి జాడ కనిపించలేదు. మరుసటిరోజుకూడా అంతే. నేనూ దోబన్ట్ పైకివెళ్ళాం. ఆ రోజంతా ఎక్కిపోతున్నాం-అక్కడ మకాంపెట్టాలని. మొత్తంమీద కనుమ నుంచి మూడు మకాంలు పెట్టాం. విశేషకాలం చరియమీదనే వున్నాం. ఎక్కేకొద్దీ పర్వతం నిటారుగా వుంది. దారి ఇరుకుగావుంది. సళ్ళుబారిన మంచు కరుళ్లు నిండి వున్నాయి. "మీరు ఎక్కిన పర్వతా లన్నింటిలో ఎక్కువ అపాయకర మైంది ఏది?" అని చాలామంది నన్ను అడిగారు. ఎవరెస్టు అంటానని వారి వుద్దేశం. ఎవరెస్టుకాదు. నందదేవి తూర్పు వైపు. ఎక్కడంలో అంత అపాయం మరే పర్వతానికీ లేదు.

డూప్లాట్ విగ్నీస్ కనపడకుండా పోయిన తరువాత ఒక వారానికి, జూలై 6 తేదీ చివరిదాకా ఎక్కాలని మేం పూనుకున్నాం. జారి క్రిందు మీదయ్యాం. కత్తిపిళ్ళుపట్టుకుని నిలవదొక్కుకున్నాం. తూకం తప్పింది. మళ్ళా నిలువదొక్కు కున్నాం. కడపటికి మా ముందు మా చుట్టూ నీలాకాశం కనిపించింది. అంటే కొనకు చేరాం. నందదేవి తూర్పువైపున ఎక్కడం అది రెండో సారి. ఎవరెస్టు తరువాత నేను ఎక్కిన ఉన్నత శిఖరం అదే.

క్రిందికి దిగి రావాలనుకున్నాం. డూప్లాట్ విగ్నీస్ ఏమైనట్టు? వారు నందదేవిశిఖరం చివరదాకా వెళ్ళారనే నా నమ్మకం. తిరిగి దిగడంలో జారి పడిపోయి వుంటారను కుంటాను. బహుశా ఆ పడడం పర్వతానికి అవలివైపు పడివుంటారు.

రెండు యాత్రలకు నాలుగు మరణాలు. అంతటితో దుర దృష్టం ఆగిందికాదు. ఆ సంవత్సరమే ఇంకో యాత్ర ఇంకో

మరణం జరిగాయి. ఆ యాత్ర కాంచన జంగాకు. ఆ తరవాత కొద్ది జట్టుతో బయలుదేరాం. స్విస్ దేశీయుడు మిస్టర్ జార్జి ఫ్రే ఇండియాలో స్విస్ ప్రభుత్వం తరఫున అసిస్టెంటు ట్రేడ్ కమిషనర్‌గా వున్నాడు. ఆయన నేను కొద్దిమంది షెర్పాలు కలిసి బయలుదేరాం. నేను సర్దారుగా వున్నాను. ప్రారంభంలో అంతా బాగానే వున్నది. చిన్న చిన్న పర్వతాలు ఎన్నో జయప్రదంగానే ఎక్కాం. తిరిగి వచ్చే ముందు కొంచెం ఎత్తైన కాంగ్ శిఖరానికి ఎక్కాలని నిర్ణయించుకున్నాం. కాంగ్ పర్వతం కాంచనజంగా ప్రక్కన వుంది. దాని ఎత్తు 19 వేల అడుగులు. మా చిన్న జట్టుకు అదొక లెక్కగా తోచలేదు.

నాకు ఒక కల వచ్చింది. చాలా చెడుకల. ఆ మరునాడే ఆపత్తు. ఆ కలలో నాకు తెలిసిన వ్యక్తి ఎవరూ కనిపించలేదు. నేనున్నాను. ఒక కొత్తస్త్రీ ఆహారం పంచిపెడుతూ వుంది. నాకు చాలా ఆకలిగా వుంది. ఆమె నాకేమీ పెట్టింది కాదు. అంతేకల. మరునాడు కలసంగతి అందరికి చెప్పాను. మా షెర్పాలు ఆందోళన పడ్డారు. కాని ఫ్రే నవ్వి వూరుకున్నాడు. ఎగతాళి చేశాడుకూడా. 'ఫరవాలేదు. పైకి వెళ్ళుదాం' అంటూ బయలుదేరాడు.

మొదలు మొదలు ఎక్కడం సులభంగానే వుంది. కొంత సేపటికి నాచీలమండలు కొంచెం నొప్పి ఎత్తాయి. మంచు గడ్డ గట్టి వుంది. ఆగి, ఉక్కు చీలలువేసిన పాదరక్షలను తొడుక్కున్నాను. వాటితో బాగా కాలు నిలవదొక్కుకోవచ్చు. "మీరు కూడా వేసుకోరా" అని ఫ్రేను అడిగాను. అక్కర లేదన్నాడు. కాని పర్వతారోహణలో ఫ్రే మంచి నేర్పరి.

సాక్షిగా దాదాపు 17 వేల అడుగుల యెత్తుకు వెళ్లాం. ఇంకా శిఖరానికి రెండు వేల అడుగులు ఎక్కాలి.

అంతలో క్రేఫే జారిపడ్డాడు. నా మీదపడి నన్ను కూడా కిందికి ఈడ్చుకుని పోతాడేమో ననిపించింది. కాని ఒక ప్రక్కగా జారిపడ్డాడు. ఆయన క్రిందికి జారి వచ్చేలోపుగా నేను గట్టిగా నిలబడి ఆయన్ను పట్టుకోడానికి ప్రయత్నించాను కాని లాభం లేక పోయింది. ఆయన శరీరం చాపి వున్న నా చేతికి కొట్టుకున్నది. ఒక వ్రేలికి తీవ్రమైన బాధ కలిగింది. ఆయన వడివడిగా జారిపోతున్నాడు. పోయి పోయి దాదాపు వేయి అడుగుల క్రింద సమతలంలో పడ్డాడు.

పర్వతారోహణలో జారి పడడమనేది అదే మొదటి సారి నేను చూడడం. కొద్దిసేపు దేహం కొయ్య బారుతుంది. కదలలేం. ఆలోచించలేం. మరుక్షణం మనం కూడా పడిపోతామని పిస్తుంది. తరువాత ఆంగ్ దావా వద్దకు వెళ్లాను. అతను గజ గజ వణుకుతున్నాడు. నేను దిగిరాలేనన్నాడు. కొంచెం సేపటికి తెప్పరిల్లుకున్నాడు. ఇద్దరం మెల్లగా జాగ్రత్తగా క్రిందికి దిగాం. ఆ స్థితిలో మేం ఎక్కడ పడిపోతామోనని భయం.

సగం దూరంలో ఒక నల్ల వస్తువు కనిపించింది. మంచులో పూడుకుని వుంది. అది క్రేఫే కెమెరా. క్రేఫే పడివున్న చోటికి వెళ్ళాం. ఆయనకు ప్రాణం పోయింది.

క్రేఫే కళేబరాన్ని ఏలాగో క్రిందికి మోసుకు వెళ్ళాం. మరుసటిరోజు రాళ్ళలో ఆ కళేబరాన్ని పాతిపెట్టి రాళ్ళగుట్టతో నే శాశ్వతంగా ఒక గుర్తు వుంచాం. డార్జిలింగుకు తిరిగి వస్తూ వుండగా నాకు తెలిసింది. క్రేఫేను పట్టుకోబోవడంలో నా వేలు

విరిగిందని. పర్వతారోహణంలో నాకు అపాయం కలగడం అదే మొదటిసారి.

## 14. వసంతంలో ఎవరెస్టు ఆరోహణం

ప్రపంచ యుద్ధానంతరం ఎవరెస్టు యాత్రలు పర్వతానికి ఉత్తరపువైపునుంచి కాకుండా దక్షిణపువైపునుంచి సాగుతున్నాయి. పర్వతాన్ని కొత్తవైపునుంచి ఎక్కడమంటే కొత్తపర్వతాన్ని ఎక్కడమన్నమాటే. ఈ పర్యాయం నేను ఎక్కబోయేది కొత్త ఎవరెస్టుఅనాలి. పద్దెనిమిది దీర్ఘ సంవత్సరాలు గడిచిన తరువాత నేను మళ్ళా నా తల్లిని దర్శించబోతున్నాను. రెండు విధాలుగా నేను నా "గృహానికి" వెళ్లుతున్నాను.

టిబెటు ఒక్క బ్రిటిషువారు రావడానికి మాత్రమే అవకాశం యిస్తూవుంటే కొత్తగా యేర్పడిన నేపాలు నానా దేశాలనుంచివచ్చే ఆరోహకులకు అవకాశ మిచ్చింది. ఈ కొత్తగా వచ్చిన ఆరోహకులలో ప్రథములు స్విస్‌వారు. స్విస్ ఆరోహకులు వస్తూవున్నట్లు నేను డార్జిలింగులో విన్నాను. ఆ కబురు తెలిసిన రోజు నా కొక పండగగా వుంది. స్విట్జర్లెండునుంచి నాకు నేరుగా వుత్తరం వచ్చింది. హిమాలయన్‌క్లబ్ కార్యదర్శిని మిసెస్. హెండర్సన్‌కు ఇంకో వుత్తరం వచ్చింది. స్విస్ ఆరోహకులు నన్ను సర్దారుగా వుండాలని కోరుతూ వ్రాశారు. మిగతా షెర్పాలను ఏర్పాటు చేయడం నాకే అప్పగించారు. ఎవరెస్టుకు వెళ్ళాలన్న ఉబలాటం నాకున్నంతగా చాలామంది షెర్పాలకు లేకపోయింది.

నేపాలీ పోర్టర్లు చాలామంది తమకు పూర్తి వేతనాలు ముట్ట లేదన్నారు. ఎవరెస్టు ఎక్కడమంటే సామాన్య విషయంకాదు. ఎన్నో అపాయాలు వుంటాయి.

అయినా, చిట్టచివరకు పదమూడుమంది గట్టివాళ్ళను సంపాదించగలిగాను. అందరం వసంతం ప్రారంభంలో కాట్మాండూకు వెళ్ళి దొరలను కలుసుకున్నాం. డిటరెట్, రోష్ పర్వతారోహణలో అప్పటికి బాగాఆరితేరారు. మిగతావారు ఫ్రెంచి స్విస్ ఆరోహకులలో శ్రేష్ఠులు. అందరిలోనూ ప్రసిద్ధుడు రేమండ్ లాంబర్ట్. ఆయన్ను చూపుతూ డిటరెట్, చూడు "ఒక ఎలుగుబంటుని తెచ్చాను" అన్నాడు. లాంబర్ట్ మా అందరితోనూ కరచాలనం చేశాడు. ఆరంభంనుంచీ మాకందరికి ఆయనంటే ప్రేమ యేర్పడింది. ఆయన బూట్లు పొట్టిగా వున్నాయి. తరువాత కారణం తెలిసింది. చాలాకాలంక్రింద ఆల్ప్స పర్వతాలనుఎక్కుతూవుండగా పెద్దతుపానుపట్టుకుందట. మంచు పోటువల్ల ఆయన రెండుకాళ్ళ బొటనవ్రేళ్లు వూడిపోయాయట. అందుకోసం పొట్టిబూట్లు వేసుకున్నాడు. కాని ఆనాటికికూడా స్విస్ నాయకులలో ఉత్తమశ్రేణికి చెందినవాడు ఆయన. కాళ్ళకు అవరోధంకలిగినా ఎవరెస్టు ఎక్కడానికి ఆయన వెనక్కుతీసినవాడుకాడు.

మార్చి 29 తేదీన ప్రయాణం కాగలిగాం. ఏ వస్తువులను ఎవరు తీసుకపోవాలో నిర్ణయించడం నా పనుల్లో ఒకటి. అనుభవంమీద నాకు ఉత్తమంగాతోచిన పద్ధతినే అవలంబించాను. ప్రతిరోజూ, ముందు బయలుదేరడానికి సిద్ధంగావున్న పోర్టర్లకు ఆహారసామగ్రిని వంటసరంజాను యిచ్చి పంపేవాణ్ణి. అలా చేయుడంవల్ల సాయంకాలం మకాం చేరేటప్పటికి వంటలు

సిద్ధమైవుండేవి. వెనకబయలుదేరే పోర్టర్లకు గుడారాలను రాత్రికి కావలసిన సామాన్లనుయిచ్చి పంపేవాణ్ణి. పర్వతం వద్దకు వెళ్ళేవరకు అవసరంలేని వస్తువులను చివరివాళ్ళకు అప్ప గించేవాణ్ణి.

కాట్మాండూనుంచి నాంచే బజారుకు 180 మైళ్ళదూరం. అక్కడికిచేరడం మాకు పదహారురోజులు పట్టింది. డిటరెట్ ఎల్లప్పుడూ కులాసాగావుండే మనిషి. మంచి ఉల్లాసపురుషుడు. ఆయనప్రక్కన ఎవ్వడుకానీ నిరుత్సాహంగావుండడంఅసాధ్యం. ఆయన పట్టుదలనుచూచి "కిసిగ్గా" అని పేరుపెట్టాం. అదొక రకంపురుగు. పట్టుకుంటే నెత్తురంతా పీల్చేస్తుంది. లాంబర్టును బాలూసాహెబ్ అని పిలిచేవాళ్ళం – బాలూ అంటే ఎలుగుబంటి.

పదిరోజులు ఉత్తరదిశగా ప్రయాణంచేసి మా షెర్పా దేశానికిచేరాం. ఎంతో వుల్లాసంగావుంది అక్కడికి వెళ్ళడం నాకు. చోమోలుంగ్మాతో పాటు మళ్ళా స్వగృహానికి వెళ్తుతున్నాను. నాంచే చేరగానే నాలాగే ప్రతిషెర్పాకూ ఉల్లాసం కలిగింది. ఎంతకాలంనుంచో చూడని బంధువులను చూడ గలిగాం. నా తల్లి అంతవృద్ధురాలై కూడా ఖామేనుంచి నడిచి వచ్చింది. "అమ్మా! వచ్చాను" అంటూ ఆమెను కౌగలించు కున్నాను. ఇద్దరం కన్నీళ్ళుపెట్టుకున్నాం.

అది సంతోషానికేగాని దుఃఖానికి సమయంగాలేదు. నా తల్లి ఒక మనుమణ్ణి ఎత్తుకునివుంది. అప్పచెల్లెండ్లు – బావ మరదులు – మేనల్లుండ్లు – మేనకోడండ్లు – బంధువులు అందరూ నా చుట్టూ చేరారు. నేను యిల్లు విడిచేనాటికి వాళ్ళలో చాలామంది పుట్టనేలేదు. అందరూ నాకు బహు

మతులు తెచ్చారు. తినుబండారాలను చాంగ్‌ను తెచ్చారు. తలవనితలంవుగా ఆనాడే నేపాల్ సంవత్సరాదీ దొరలకు ఈస్టరు సోమవారమూ అయింది. అందరం కలిసి ఆడుతూ పాడుతూ విందులారగించాం. తనివితీర చాంగ్ తాగాం.

కాని ఈ జలసా అంతా ఒక్కరోజే. మరుసటిరోజు మళ్లా ప్రయాణం అయ్యాం. థ్యాంగ్‌బోషేవద్ద లామాలు మాకు మంచి ఆహ్వాన మిచ్చారు. అప్పటికి 12 వేల అడుగుల ఎత్తుకు ఎక్కాం. అటు తరువాత అసలు పర్వతాల్లో ప్రవేశించాం. ఒక సాయంత్రం మా క్యాంపులో పెద్ద అలజడి పుట్టింది. స్విస్ వైజ్ఞానికులు ఇద్దరు, విచిత్రమైన అడుగు గుర్తులను చూచారు. వాటిని కొలిస్తే ఒక్కొక్కటి పదకొండున్నర అంగుళాల పొడవూ నాలుగు ముప్పాతిక అంగుళాల వెడల్పూ వుంది. ప్రతి అంగ సరిగా ఇరవై అంగుళాల పొడవుంది. అడుగు గుర్తులు ఒక్క వరసలోనే వున్నాయి. వాటికి మొదలూ తుదీ స్పష్టపడలేదు. వారు ఎంత వెదికినా "యాతీ" కనిపించలేదు. ఏప్రిలు 22 తేదీన ఖుంబూ హిమానీ నద ప్రదేశానికి (Glacier) చేరాం. అక్కడికి యెత్తు 16,570 అడుగులు. అక్కడనుంచి చాలామంది షెర్పాలు వెనక్కు వెళ్ళారు. వంట చెరుకును వస్తుసామగ్రిని మోయడానికి ముప్పయిమందిని వుంచుకున్నాం. వీరుకాక పర్వతారోహణకు పదిమంది ప్రత్యేకంగా వున్నారు. ఆ ప్రదేశం నుంచి పైకి వెళ్ళి హిమపాతం (icefall) మొదట్లో మా మొదటి మకాం పెట్టాం. పర్వతం మంచు కమ్ముకుని నిట్రంగా వుంది. పైకెక్కడానికి దారికోసం స్విస్ దొరలు వెదక నారంభించారు.

అంతా ఒక తెల్లటి అడవిలాగా వుంది. దానిలో దారి కనుక్కోవడం ఏలాగు? అడుగుపెట్టితే ఏం అపాయమో ఎటు చూచినా మంచుగోపురాలు. అవి విరుచుకుని పైనపడవచ్చు. మంచుక్రింద దాగివుండే లోతైనగోతులు. వాటిలోపడి పూడి పోవచ్చు. దారికోసం ఎంతో వెదికారు. ఎటువెదకినా ఎక్క నలవికాని మంచుగోడలు. దాట నలవికాని గోతులు. వెనక్కు వచ్చి మెట్లు చెక్కుకుంటూ తాళ్లుకట్టుకుంటూ ఇంకోదారిన పైకివెళ్ల నారంభించారు. బరువులు ఎత్తుకుని మేం వెంబ డించాం. హిమపాతానికి సగందూరంలో ఒకస్థావరం చూచు కుని రెండోమకాంచేశాం. ఆపైకివెళ్లడం ఇంకా అసాధ్యంగా వుంది. తూర్పుకనుమదగ్గరకు వస్తున్నాం. ఆ కనుమకు క్రింది వైపు ఒక పెద్దగోయివుంది. ఆగోతినిదాటడం ఎలాగు? చూస్తే భయంకరంగావుంది. అంత వెడల్పుగోతిని పైనుంచి దూకడం సాధ్యంకాదు. లోతుచూస్తే అడుగు కనపడడం లేదు. హిమపాతం పొడుగునా ఎవరెస్టుగోడలనుంచి నత్సే గోడలవరకు వ్యాపించివుంది ఆగోయి. ఇవతలనుంచి అవతలికి తాడువేసి దాటవచ్చునని చూచారు. కాని ప్రయోజనంలేక పోయింది. చివరకు ఒకవుపాయం కనిపెట్టారు. ఆ గోతిలో అరవై అడుగులక్రింద ఒక గూడులాంటిది కనిపించింది. అక్క డికిదిగితే అవతలిగోడమీదికి దాటవచ్చు. అవతలిగోడ ఎక్క రానంత నిట్రుగాలేదు. ఆస్పర్ చేశాడు ఈ ప్రయత్నం. జాగ్ర త్తగా ఆస్పర్‌ను ఆ గూడువద్దకు దింపారు. అతను అవతలికి నేర్పుగాదాటాడు. మంచును తోసుకుంటూ ఈడ్చుకుంటూ ఏలాగో అంచుమీదికి వచ్చాడు. ఒక్కమనిషి అవతలికిదాటా డంటే సమస్య తేలినట్టే. తాడువేసి రెండువైపులా గట్టిగా బిగించారు. ఒకతాడు వంతెన తయారైంది. దానితో మిగతా

మనుషులు దాటడం బరువులను చేరవేయడం సులభ సూత్రమైంది.

దొరలు ముందుదాటారు. వెనకబరువులను దాటవేశాం. క్రిందినుంచి కనుమవరకు చేరవేసిన బరువులమొత్తం రెండు వ్నరటన్నులు. ఒకొక్కబరువు నలభైఅయిదు పౌనులు. అంతయెత్తున అంతకన్నా బరువునుచేర్చడం సాధ్యంకాదు. అంటే పోర్టర్లు 125 సార్లు తిరగాలన్నమాట. అప్పటికి ఇరవై వేల అడుగుల యెత్తులో వున్నాం. గాలి పలచబడుతున్నదని స్విస్ దొరలు గ్రహించారు. ఆ వాతావరణానికి అలవాటు పడేవరకు షెర్పాలకు కూడా బాధగానే వుంటుంది. అయినా ఫరవాలేదనుకున్నారు. ఒకరు నన్ను చూపి: "ఇతనికి మాత్రం ఫరవా వుండదు. ఇతనికి మూడు వూపిరి తిత్తులు. ఎంత ఎత్తుకు పోతే అంత కులాసాగా వుంటాడు" అన్నారు. అందరూ ఆ మాటకు నవ్వుకున్నారు. నేనూ నవ్వాను. ఆ మాట నిజమే. పైకి వెళ్లేకొద్ది నాకు వూపిరితిత్తుల్లోనూ, గుండెల్లోనూ, కాళ్లలోనూ బలం హెచ్చుతుంది. ప్రతి యాత్రలోనూ అదే నా అనుభవం.

తూర్పు కనుమ వద్ద మూడు వారాలు వున్నాం. దానికి స్విస్ దొరలు మూగకనుమ అనిపేరు పెట్టారు. ఒకొక్క సమయంలో గాలి చప్పుడు వినిపించినా సాధారణంగా ఆ కనుమలో చల్లగానూ నిశ్శబ్దంగానూ వుంటుంది. మా మాటలు, మాశ్వాసలు, బూట్లచప్పుళ్లు, ఇవితప్ప వేరేధ్వని వినిపించదు. ఆ కనుమమధ్యలో నాలుగోమకాంపెట్టాం. లోత్సేపాదం వద్ద అయిదోమకాంపెట్టాం. ఋతుపవనాలతో మాకు పోటీపడింది.

అవి ప్రారంభమయ్యేలోపుగా పర్వతం ఎక్కడం దిగడం ముగించుకోవాలి.

అయిదోమకాంకు 22,640 అడుగులు ఎక్కామన్నమాట, దక్షిణపుకనుమ ఇంకా మూడు వేలఅడుగుల ఎత్తుకుపైగావుంది. మే నెల చివరివారం ప్రారంభానికి అన్ని యేర్పాటులు పూర్తి అయాయి. కనుమకు సగంలో సామాను చేర్పించాం. పై కనుమ వద్దకు ఎక్కిపోవడానికి సిద్ధంగా వున్నాం. అక్కడి దాక ఎక్కి సాధ్యమైతే శిఖరం వరకు ఎక్కడానికి నియామకం చేసిన మొదటి జట్టులో లాంబర్ట్, ఆబర్ట్, ఫ్లోరీ, నేనూ వున్నాం. అంతవరకు నేను షెర్పాలకు సర్దారుగా వున్నాను. ఇప్పుడు ఆరోహక వర్గంలో చేరడంతో నాకు కొత్తహోదా వచ్చిందన్నమాట.

మే 24 తేదీన బయలుదేరాం. కాని వాతావరణం ప్రతి కూలంగా వుండి మరుసటి రోజుకు మార్చుకున్నాం. కొంత యెత్తుకు వెళ్ళేసరికి అజిబాకు ఆకస్మికంగా జ్వరం తగిలింది. అతను క్రిందికి దిగి వెళ్లాడు. అతని బరువును మిగిలిన వాళ్ళం పంచుకుని పైకి వెళ్లాం. మధ్యాహ్నానికి సామాను వున్న చోటికి చేరాం. ఇంకా నాలుగు గంటలు ఎక్కాం. అప్పటికి జినివాస్పర్ పర్వతం ప్రక్కకు వెళ్లాం. తరువాత కొద్దిదూరం వచ్చి ఆంగ్‌నార్బూ సింగ్మాదోర్జే బరువులు క్రిందపెట్టి దిగి పోతామని కూచున్నారు. అలిసిపోవడమే కాకుండా మంచు పోటుకు వాళ్లు భయపడ్డారు. వాళ్ళబరువులను కూడా మిగతా వాళ్లం పంచుకున్నాం. ఇంకో గంట పైకి వెళ్లాం. చీకటి పడింది. మంచును చదునుచేసి రెండు గుడారాలు వేసుకున్నాం. పెద్దగాలి వేచింది. మమ్ములను కూడా లాక్కుపొయ్యేట్టుగా

వీస్తూంది. గుడారాల్లో నిద్రపట్టించుకోవాలని ప్రయత్నించాం. కాని చలిబాధ మిక్కుటంగావుంది. ఒకరి నొకరు చుట్టుకుని పండుకున్నాం; వెచ్చదనంకోసం. చివరకు ఏలాగో తెల్లవారింది.

లాంబర్ట్, ఆబర్ట్, ఫ్లోరీ, నేనూ ఈ నలుగురమే పైకి బయలుదేరాం. పదిగంటలు కావచ్చింది. జినివాస్పర్ కొసకు చేరాం. దక్షిణపు కనుమ ఎదట కనిపిస్తూవుంది. నేను ఎన్నో నిర్జన ప్రదేశాల్లో ఒంటరిగా తిరిగాను. కాని ఆలాంటి ప్రదేశాన్ని ఎన్నడూ చూడలేదు. అప్పటికి 25,850 అడుగుల ఎత్తులో వున్నాం. తలయెత్తి చూస్తే మా ముందు ఎవరెస్టు శిఖరం ఇంకా పైకి పోతూ కనిపిస్తూవుంది. అది ఇంకో పర్వతం లాగావుంద.

చీకటి పడింది, గాలి వీస్తూవుంది, లాంబర్ట్ నేను ఒక్కటే గుడారంలో చేరాం. వెచ్చదనం కోసం వొరుసుకుని కూచున్నాం. పర్వత శిఖరానికి చేరే అవకాశమేవుంటే పైన వున్న చరియమీద ఏదో మకాం పెట్టాలి. బరువులు మోయడానికి ఇతర సహాయం లేకుండా ఏదో మకాంకు కావలసిన వస్తుసామగ్రిని తీసుకపోవడం ఏలాగు? మా ప్రయత్నం గట్టెక్కే అవకాశం కనిపించడంలేదు.

ఆబర్ట్ ఫ్లోరీ ఒక తాడుమీదనూ, లాంబర్ట్ నేనూ ఒక తాడు మీదనూ, ఎక్కిపోతున్నాం. గంటలకొద్దీ ఎక్కిపోతున్నాం. కనుమవద్దనుంచి నిలువుగావున్న మంచు కొండను ఎక్కుతూ వెళ్ళాం. ఆగ్నేయంగా వున్న పర్వత సానువు మట్టానికి చేరాం. పర్వత సానువుమీదికి ఎక్కాం. మా వెంట ఒక్క గుడారమేవుంది. తిండి ఒక్క రోజుకు సరిపోతుంది. ప్రతి మనిషి దగ్గర చిన్న ఆక్సిజను టాంకు వుంది. పర్వతం

మీద నేను ఆక్సిజను (ప్రాణవాయువు) ఉపయోగించడం అదే మొదటిసారి. కాని దానివల్ల మాకు అంతగా ప్రయోజనం లేక పోయింది. ఒకచోట స్థిమితంగా వున్నప్పుడే అది ఉపయోగిస్తుంది. ఎక్కిపోతూ వున్నప్పుడు ఉపకరించదు. మాకు అగత్యమైంది ఎక్కుడులోనే. దాదాపు 27,500 అడుగుల ఎత్తున ఆగాం. గుడారం వేసుకోడానికి ఒక చదును ప్రదేశం కనిపించింది. "ఈ రాత్రి ఇక్కడ గడుపుదాం" అన్నాను. లాంబర్ట్ చిరునవ్వు నవ్వాడు. ఆయనకు కూడా అదే వుద్దేశం వున్నదని నా నమ్మకం. ఆబర్ట్ ఫ్లోరీ మా వెనక వచ్చారు. వారు ముగ్గురూ కలిసి మాట్లాడుకున్నారు. లాంబర్ట్, నేను పైన వుండేట్టున్నూ తక్కిన యిద్దరూ క్రిందికి దిగిపోయేట్టున్నూ నిర్ణయించుకున్నారు. మరునటి వుదయం వాతావరణం అనుకూలిస్తే మేమిద్దరం శిఖరానికి ఎక్కాలి.

"మీ విషయం భద్రంగా చూచుకోండి" అన్నారు వారిద్దరూ కన్నీళ్ళు పెట్టుకుంటూ. వారూ మా వలెనే మంచి స్థితిలోనే వున్నారు. "మేమే వుంటాం, మీరు దిగండి" అని వుండవచ్చు. కాని గుడారం ఒకటే వుంది. తిండి కూడా అట్టే లేదు. మారు మాటలేకుండా ఆబర్ట్ ఫ్లోరీలు, త్యాగబుద్ధితో క్రిందికి దిగి వెళ్ళారు. పర్వతారోహకుల నీతి అలా వుంటుంది.

ఆ రాత్రి నిద్రలేదు. మాకు నిద్ర పోవాలని కూడా లేదు. పూరికే పండుకున్నాం. వెచ్చగా సంచులుకూడా వేసుకోలేదు. ఆ చలికి చచ్చిపోయివుందుము. దేహాలను మర్దించుకుంటూ నాలుగు జాములు గడిపాం. అంతలో వెలుతురు వచ్చింది. తలబైట పెట్టి నాలుగువైపులా చూచాం. గాలి మరీ అధ్వాన్నంగా వుంది. అంత దాకా వచ్చి వెనక్కుతిరగడం మనస్క

రించలేదు. కొంకర్లు పోతున్న చేతులతో వుక్కుచీలల పాద రక్షలను వేసుకోవడం గంటలు పట్టింది. చివరకు బయలు దేరాం. పైపైకి మెల్ల మెల్లగా పాకుతూ పోతున్నాం. మూడు అడుగులు వేయడం. ఆగడం, రెండడుగులు వేయడం. ఆగడం, ఒక్కడుగు వేయడం. ఆగడం, ఈలాగా పోతున్నాం. ప్రతి ఇరవై గజాలకు ముందు వెనకలు మార్చు కుంటున్నాం. ముందు మనిషి దారిచేస్తూవుంటే వెనక మనిషి అలుపు తీర్చు కోవచ్చు. అసలు ఎక్కడం అంత కష్టం కాదు. కాని ఒక వైపు జారుడుమంచు దాని క్రింద సముద్రంవంటి మైదానమూ. ఆ స్థితిలో చాలా జాగ్రత్తగా వుండక తప్పదు.

నా "మూడో వూపిరి తిత్తికి" కూడా బాధ తప్పింది కాదు. గొంతుక ఎండుకు పోతూంది. ఒకటే దాహం. పూర్తిగా అలిసిపోయి చేతులూ కాళ్ళూ క్రింద బెట్టి పాక వలసి వచ్చింది. అప్పటికి ఎంతవరకు వెళ్ళాం? నిటారుగా 650 అడుగులు ఎక్కాం. దక్షిణపు శిఖరం ఇంకా 500 అడు గుల యెత్తునవుంది. అసలు శిఖరం కాదు, దక్షిణపు శిఖరం మట్టుకే. ఆ పైన – ?

నాకు దేవుడంటే నమ్మకం వుంది. క్లిష్టసమయాల్లో భగ వంతుడు మనిషికి కర్తవ్యాన్ని స్ఫురింప జేస్తాడని నానమ్మకం. నాకు లాంబర్ట్‌కు ఆలాగే చేశారు. ఇంకా పైకి ఎక్కి వుందుము. కాని దిగి రాగలిగే వాళ్ళం కాదు. పైకి ఎక్కడ మంటే మృత్యువే. అక్కడ ఆగి వెనక్కు తిరిగాం. 28,250 అడుగుల ఎత్తుకు వెళ్ళాం. అంతవరకు ఏ మనిషీ అంత యెత్తుకుఎక్కలేదు. మేం చేసింది మహాత్కార్యమే అంటాను. ఒక గొప్ప స్నేహితుణ్ణి సంపాదించుకోగలిగాను కూడా.

# 15. స్విస్‌తో ఎవరెస్టు యాత్ర

( ఆకురాలేకాలం )

ఆకు రాలు కాలంలో ఎవరెస్టుయాత్ర జరగాలని చాలా సంవత్సరాలనుంచి అనుకుంటున్నారు. 1952 లో స్విస్ వారు పూనుకునేవరకు ఆ సంకల్పం నెరవేరింది కాదు. వచ్చే వసంతం దాకా స్విస్ వారు నిరీక్షించలేక పోయారు. వచ్చే వసంతం దాకా వేచివుంటే అసలు యాత్రే సాధ్యపడేది కాదు. ఏమంటే 1953 లో ఎవరెస్టును బ్రిటిషు వారికే నేపాలీ ప్రభుత్వం వాగ్దత్తం చేసింది.

వసంతయాత్ర వారిలో ఇద్దరు దొరలు మాత్రమే ఈ సారి రాగలిగారు. ఒకడు డాక్టరు గేబ్రియల్ షెవల్లే. ఈ తడవ ఆయన నాయకుడు. రెండోవాడు రేమండ్ లాంబర్ట్. కట్టివేసి కూచోబెట్టినా లాంబర్ట్‌ను యాత్రకు రాకుండా చేయడం వారికి సాధ్యపడేది కాదు. నన్నూ యాత్రలో కలవమని కోరారు. ఈ పర్యాయం పట్టి సర్దారుగా కాదు. ఆరోహకుల్లో ఒకడుగా రమ్మన్నారు. ఆ గౌరవాన్ని నేను గర్వకారణంగా భావించాను. ఆహ్వానాన్ని ఆమోదించాను.

సెప్టెంబరు చివరలో మేం బయలుదేరి నేపాలు పర్వతాల గుండా ఎక్కుతూ దిగుతూ వెళ్ళాం. 14 వ తేదీన దాదాపు 13 వేల అడుగుల ఎత్తు కనుమను దాటాం. దాని పేరు "షాముంగ్ నంరేక్టీలా". పూర్వపు రోజుల్లో ఆ కనుమమీదికి వెళ్ళితే తల ఆకాశాన్ని అంటుతుందని అనుకునేవాళ్ళు. క్రిందటి యాత్రలో లాగానే తొలిమకాం ఖుంబూహిమానీ నదం వద్ద పెట్టాం. హిమపాతాన్ని దాటి పైకి ఎక్కాలని

ప్రయత్నించాం. గోతుల విషయంలో తగు జాగ్రత్త పడ్డాం. మంచు పగిలి విచ్చివున్న తావుల్లో వంతెనలు కట్టడానికి కలప సామాను తగినంత తెచ్చుకున్నాం. అసలు పెద్ద గోయిని దాటడానికి పొడుగాటి నిచ్చెన తెచ్చుకోవడంవల్ల మా పని సులభమైంది.

అక్టోబరు చివరకు "తోత్సేఫేస్" పాదంవద్ద అయిదో మకాంలో వున్నాం. ఇంక దక్షిణపు కనుమకు ఎక్కాలి. మొదటి యాత్రలో ఒక సంగతి మాకు తెలిసింది. ఆ కనుమకు ఎక్కడం ఒక్క రోజులో అయ్యేపనికాదు. పర్వతానికి ఈవలి వైపున మొత్తంమీద 2500 అడుగుల తాడును గట్టిగా బంధించాం. నెమ్మదిగా ఆరు ఏడు మకాంలు పెట్టగలిగాం.

ఇంకో వారంలో అంతా సిద్ధం చేసుకున్నాం. మెట్లు చెక్కడం, తాళ్ళు కట్టడం, ఎత్తు మకాంలకు సరంజాం అంతా తయారు చేసుకున్నాం. దక్షిణపు కనుమమీదికి ఎక్కాలంటే మేం తొందరపడాలి. అప్పటికే నవంబరు దాటి పోతూంది. నిండు శీతాకాలం రాబోతూంది. నవంబరు 19 తేదీన కనుమకు బయలుదేరాం. సాయంత్రం నాలుగున్నర గంటలకు కనుమమీదికి ఎక్కాం. ఒక్క సంవత్సరంలో ఆ కనుమపైకి ఎక్కడం ఇది రెండో పర్యాయం. ఆ నాటికి ప్రొద్దు గూకింది.

లాంబర్టు దగ్గర ఒక థర్మామీటరువుంది. దానిలో చూస్తే సున్నాకు ముప్పయి డిగ్రీలు క్రిందికి జారి వుంది. గంటకు అరవై మైళ్ళ వరవడితో గాలి వీస్తూవుందని ఆయన అంచనా వేశాడు. అంటే ప్రబలంగా కాకుండా స్థిమితంగా వీస్తూవుంది. ఏలా వుండినా ప్రయాణానికి సిద్ధమయ్యాం. కనుమ దాట డానికి మాకు గంట పట్టింది. మంచుతో నిండి ఏటవాలుగా

వున్న కొండను ఎక్కి పై అంచుకు పోవాలి. చలీ గాలీ జోరుగా వున్నాయి. చేతులకు మూడువరసల మేజోళ్లు తొడుక్కున్నా లోపల వేళ్ళు కొయ్యబారినాయి. పెదవి ముక్కు మొహం నీలిరంగు వేశాయి. ఆ స్థితిలో తెలివిగల పని ఒక్కటే. వెనక్కు తిరిగి పోవాలి. ఆ సంగతి మాకు తెలుసు. కాని లాంబర్టుకూ నాకూ పట్టుదల సడలలేదు. ఇది మా రెండో ప్రయత్నం. ఇద్దరం కలిసి ఎవరెస్టు ఎక్కాలన్న ఆశ మాకు చిరకాలంగా వుంది. వెనక్కు తిరిగి వెళ్ళితే ఇంకో అవకాశం వస్తుందో రాదో ? — మేమే అయితే పైకి ఎక్కి వుండే వాళ్ళం. అంటే ఆ పని మాకు సాధ్యమని కాదు. మా వాంఛ అంత బలీయంగా వుంది. కాని షెర్పాలు వెనకడుగు వేస్తున్నారు. మాతో రీస్ దొర వున్నాడు. ఆయన కూడా కాదని తలవూపుతున్నాడు. అంత చలి వుండబట్టి కన్నీళ్లు లోపల్లోపలనే పేరుకుంటున్నాయి. లేకపోతే నేను కన్నీరు కార్చవలసిందే. నేను లాంబర్టువైపు చూడలేక పోయాను. మాట్లాడకుండా వెనక్కు తిరిగాం.

నాంచే బజారులో మా అమ్మను అప్ప చెల్లెండ్లను మళ్ళా చూచాను. తెచ్చుకోలు వుల్లాసంతో "వచ్చే సంవత్సరం మళ్ళా మిమ్మల్లను కలుసుకుంటాను" అన్నాను. కాని వచ్చే సంవత్సరం ఏం జరిగేదీ నాకేం తెలుసు ? డిసెంబరు నాటికి ఇంటిదారి పట్టాం. శీతకాలం తుపానుల్లో ఎవరెస్టు మరుగుపడి పోయింది. "నా మనస్సులో విచారంగా వుంది" అని డాక్టరు షెవల్లే తన డైరీలో వ్రాసుకున్నాడు. మా ద్వితీయ ప్రయత్నం భగ్నంకావడంవల్ల మా అందరికీ అలాగే వుంది.

## 16. ఈమాటు విజయం తప్పదు

ఎవరెస్టు యాత్రను జయప్రదంగా చేసి వచ్చినట్టే మాకు కాట్మాండూలో స్వాగతం యిచ్చారు. నేపాల్ ప్రభువు నాకు 'నేపాల్ ప్రతాప్ వర్ధక్' పతకాన్ని స్వయంగా బహుమానం చేశారు. అది నాకు గొప్ప గౌరవం అనాలి. కాని నాకు దేహమూ మనస్సూ బాగాలేక ఏమి జరిగేదీ గ్రహించజాలని స్థితిలో వున్నాను. నాకు మలేరియా జ్వరం పట్టుకుంది. రెండు పెద్ద యాత్రలు చేసిన శ్రమకూడా వుంది. స్విస్ దొరలు నామీద యెప్పటిలాగే ఆదరం చూపారు, నన్ను కాట్మాండూ నుంచి విమానం మీద పాట్నాకు చేర్చారు. అక్కడ పది రోజులు ఆస్పత్రిలో చికిత్స పొందాను.

ఆస్పత్రినుంచి బైటికి వచ్చేటప్పటికి నా బరువు పదహారు పౌనులు తగ్గింది. "నీవు విశ్రాంతి తీసుకోవాలి. ఈ సంవత్సర మంతా విశ్రాంతి తీసుకుంటేగాని నీ ఆరోగ్యం చక్కబడదు" అంది ఆంగ్ లామూ. నేను తలవూపి వూరుకున్నాను. ఏమన డానికీ నాకు బలంలేదు.

1953 వచ్చింది. నేను ఆస్పత్రిలో వుండగానే మేజరు చార్లెస్ విల్లీ వద్దనుంచి నాకు వుత్తరం వచ్చింది. కొత్తగా ఒక బ్రిటిషు జట్టు ఎవరెస్టుయాత్రకు వెళ్ళుతుందనీ – అందులో నన్ను చేరమనీ ఆహ్వానిస్తూ వ్రాశాడు. ఆ జట్టుకు విల్లీ రవాణా అధికారి. డార్జిలింగులో మిసెస్ హెండర్సన్ (హిమాలయన్ క్లబ్ కార్యదర్శిని) కూడా నన్ను ప్రోత్స హించింది. "ఇంగ్లీషు వారితో నీవు చాలా సార్లు వెళ్ళావు. అందుకోసం వారు నీవే కావాలని కోరుతున్నారు." అంది

కాని ఆంగ్‌లామూ వ్యతిరేకిస్తూవుంది. మిసెస్ హెండర్సన్ నా పరిస్థితిని అర్థం చేసుకుంది. నాకు బలం పట్టడానికి ఒకవారం పాటు ఓవల్టీను పంపింది.

ఆలోచించడం, దానిలో తల తిరిగి పోవడం. వెళ్ళాలని నిశ్చయం చేసుకుంటాను, మళ్ళా మానుకుందామనుకుంటాను. నాకు దాదాపు ముప్పయి తొమ్మిది సంవత్సరాలు. 'క్లిష్ట సంవత్సరాలు' (ముప్పది అయిదు నలభై మధ్య) పూర్తి కావస్తున్నాయి. ఇంకా ఎంతకాలం ఎక్కగల శక్తివుంటుంది? లోగడ శ్రమనుబట్టీ జబ్బునుబట్టీ ఇప్పుడైనా ఎక్కగలనా అని ఒక సందేహం. ఎవరెస్టుకు ఆగుసార్లు వెళ్ళాను. ఇది ఏడో సారి. మా షెర్పాలకు ఏడు అదృష్టసంఖ్య అని నమ్మకం. చాలా మందికి అదే నమ్మకం అనుకుంటాను.

నాకు పట్టుకున్న బాధ నా ఆరోగ్యాన్ని గురించే. ఇంటికి వెళ్ళిన తరువాత కొద్ది కాలంలోనే కోలుకున్నాను. బరువు తగ్గడం దుర్బలం మాత్రం వున్నాయి. ఒక్క సంవత్సరంలో రెండు యాత్రలు చేసిన వారికి ఈ యాత్ర ఏం చేస్తుంది? ఈ ఆలోచనలతో రాత్రులు నిద్ర పట్టేది కాదు. ఒకరోజు తూంగ్‌సాంగ్ బస్తీనుంచి వెళ్ళి మిసెస్ హెండర్సన్‌ను కలుసుకున్నాను. "సరే, వెళ్ళుతాను" అని చెప్పాను. నేను వెళ్ళుతున్నానంటే వెళ్ళక పోవడం అసాధ్యం కాబట్టి వెళ్ళు తున్నాను. నా భావాన్ని సరైన మాటల్లో ఈ నాటికీ చెప్ప లేను. ఆ నాడు ఆమెతోనూ చెప్పలేక పోయాను. ఏమైనా సరే వెళ్ళక తప్పదు అని నాభావం.

ఆమెతో చెప్పడం ఒక యెత్తు. నా భార్యతో చెప్పడం ఇంకో యెత్తు. "నీవు చాలా దుర్బలంగా వున్నావు. మళ్ళా

జబ్బు చేస్తుంది. పర్వతం మీద జారిపడి ప్రాణాలు పోగొట్టు కుంటావు” అంటూ వాదన పెట్టుకుంది నా భార్య.

“కాదు, నా జాగ్రత్త నేను చూచుకుంటాను.” అన్నాను. నీది రాక్షసిపట్టు. నా సంగతి పిల్లల సంగతి నీకు లెక్క లేదు. నీవు ఏమైనా అయితే మా గతి ఏం కావాలి?”

“మీ సంగతి నాకు పట్టక పోలేదు. కాని ఇది నా జీవిత ధర్మం. అంత మాత్రం అర్థం చేసుకోలేవా? ఇక్కడ యింటి విషయం నీకు అప్పగించాను. అందులో నేను కలిగించుకోను. ఇంక ఎవరెస్టు యాత్ర విషయంలో ఎవ్వరూ నాతో కలిగించు కోవడం సాధ్యపడదు.”

“నీకు వెర్రి పట్టింది. ఈ యాత్రలో నీకు చావు తప్పదు.”

“సరే! చచ్చిపోతాను. చావు రాసి పెట్టి వుంటే నీ గుడిసెలో చావడం కంటే ఎవరెస్టు మీద చావడమే నాకు సమ్మతం”. అప్పటికి నాకు కోపం హెచ్చింది. ఒక్కొక్క సమయంలో ఆలుమగలందరూ ఈలాగే మాట్లాడుతారనుకుంటాను. ఈలా వాదించుకోవడం సరిపెట్టుకోవడం కొంత దూరం సాగింది. ఏలాగూ వెళ్ళడానికి నిశ్చయించుకున్నానని నా భార్య తేల్చుకుంది. చివరకు “సరే – నీ మాటే సాగించుకో” అంది.

నాకు అసలు వేతనం నెలకు మూడువందల రూపాయిలు. మామూలు పెద్వాలకు నూరునుంచి నూట ఇరవై అయిదు వరకు వుంటుంది. నేను చచ్చిపోతే నా కుటుంబానికి రెండు వేలు నష్టపరిహారంగా యిస్తారు. నాకు రబీంద్రనాథ మిత్ర అని ఒక స్నేహితుడున్నాడు. చక్కగా చదువుకున్న బెంగాలీ

యువకుడు. డార్జిలింగులో ఒక ముద్రణాలయానికి యజమాని. గత రెండు సంవత్సరాలుగా మాకు మంచిస్నేహం. నాకు సలహా యిస్తూ వుండేవాడు. అతనితో నా విషయం చెప్పాను. నాకు ఏమైనా అపాయం కలిగితే నా కుటుంబానికి సహాయంగా ద్రవ్యనిధిని పోగుచేస్తానని చెప్పాడు.

మళ్ళా నేను సర్దారుగా తయారయ్యాను. సర్దారు బాధ్యతలు, పర్వతారోహణం రెండూ నిర్వహించుకోవాలి. అలా వుండక తప్పిందికాదు. ఎవరెస్టు ఎక్కగల అవకాశమే లభిస్తే ఏ పని చేయడానికైనా నేను తయారే.

వీడుకోలు చెప్పడానికి మిత్రుల యిండ్లకు వెళ్ళాను. వాళ్లు నాకు శాలువలు బహుమానం చేస్తూ పైన కప్పారు. నా మిత్రుడు రవీంద్రనాధమిత్రా ఒక భారత జాతీయ పతాకం యిచ్చాడు. దాన్ని ఉచిత స్థానంలో వుంచమని కోరాడు. నా చిన్నకూతురు ఒక పెన్సలు ముక్క యిచ్చింది. దాన్ని "ఉచిత స్థానంలో" పెడతానని చెప్పాను. అంతా భగవంతుడి ఆధీనంలోవుంది. ఆయన దయవుంటే జరగందిలేదు. అందరివద్ద సెలవు తీసుకున్నాను.

మేం కాట్మాండూకు చేరేటప్పటికి కొంతమంది బ్రిటిషు ఆరోహకులు అదివరకే వచ్చారు. మాలాగే ఇంకా కొంత మంది చేరుకుంటున్నారు. కల్నల్ హంట్, మేజరు విల్లీ, హిల్లరీ వీరుకాక ఇంకా ఏడుగురు ఆరోహకులు వున్నారు. టాంబోర్డిలాన్, డాక్టరు చార్లెస్ ఏవాన్స్, ఆల్ఫ్రెడ్ గ్రిగరీ, జార్జిలోయీ, ఎల్ ఫర్డునాయిస్, జార్జిబాండ్, మైకేల్ వార్డు అనేవారు. గ్రిఫిత్ పూ యాత్రలో డాక్టరు. ఆయన మమ్ముల‌ను అన్నిరకాలా పరీక్షచేయాలి. చలనచిత్రం తీయడానికి

టాంన్స్టోబర్డ్ వున్నాడు. "లండన్ టైమ్సు" పత్రికా విలేఖరి జేమ్సు మారిస్ వున్నాడు. ఈ యాత్రకోసం ఆ పత్రికవారు కొంత ద్రవ్యాన్ని యిచ్చారు. మార్చి 25 నాటికి నాంచే బజార్‌కు చేరాం. మళ్ళా ఆటలూ పాటలూ విందులూ సాగాయి. మా అమ్మ మిగతా కుటుంబం నన్ను చూడాలని థామేనుంచి వచ్చారు. నా భార్యలాగే మా అమ్మకూడా నన్నుగురించి దిగులు పెట్టుకుంది. జాగ్రత్తగా వుండమని మరీ మరీ చెప్పింది. "ఫరవాలేదు. ఈ పర్యాయం పైకి వెళ్ళితే మళ్ళీ వెళ్ళడం వుండదు" అన్నాను. ఎక్కగలమనే నాకు పూర్తిగా ఆశవుంది. లాంచేనుంచి త్యాంగ్‌బోషే మఠాన్ని చేరుకున్నాం. అది మా మొదటి మకాం.

## 17. ఏడవ యాత్ర

త్యాంగ్‌బోషే నుంచి వెంటనే ఎవరెస్టుకు వెళ్ళలేదు అక్కడి వాతావరణానికి ముందు అలవాటు పడాలనీ సన్నాహంలో కొంత అభ్యాసం కలగాలనీ కల్నల్ హాంట్ వుద్దేశం. అందుకోసం మూడు జట్లుగాచీలి దాపులోవున్న పర్వతాలను ప్రత్యేక ప్రత్యేకంగా ఎక్కి తాంగ్‌బోషేకు తిరిగి వచ్చాం. అటుతరువాత పెద్ద హిమపాత పాదంలో మా క్రింది మకాం పెట్టడానికి ఖుంబూ హిమానీనద ప్రదేశం మీదుగా ఎక్కుడు ప్రారంభించాం.

అది చాలా పెద్ద యెత్తున జరిగిన యాత్ర. అంతా మిలిటరీ పద్ధతిలో నడిచింది. అంతకన్నా స్వేచ్ఛ కావాలనే కోరిక మా జట్టులో చాలామందికి వుండిన మాట నిజమే. ఎక్కు

వగా సణిశిగిన వాళ్లుకూడా యాత్ర కట్టుదిట్టాలతో నిర్వహించ బడుతున్నదని ఒప్పుకోక తప్పిందికాదు. మేమంతా సైనికుల మైనట్టు వ్యవహరించాలని హంట్ వుద్దేశం. కాని అందరి పట్ల దయాదాక్షిణ్యాలు చూపేవాడు. రవాణా ఉద్యోగిగా మేజరు విల్లీ చాలా సమర్థుడు. మిగతా ఆరోహకు లందరూ చాలామంచివారు. దయగలవారుకూడా. ఎవరి పనిని వారికి ప్రత్యేకంగా నియమించడం ఆ యాత్ర నిర్వాహకులు సమర్థతతో చేసిన ఏర్పాట్లలో ఒకటి.

వారానికి ఒక పర్యాయం మాకు పుత్తరాలు అందేవి. ఆంగ్‌లామూ వద్దనుంచి మిత్రావద్దనుంచి నాకు వుత్తరాలు వచ్చేవి. అవినాకు అంత సంతోషం కలిగించేవిగా వుండేవి కావు. మా కుటుంబంకోసం నిధిని పోగుచేయాలని ఒకసభ పెట్టారట. ఆ సభ పర్యవసానానికి నట్టికబుర్లతో ముగిసిం దట. ఆంగ్‌లామాకు ముందు ఏలా జరగాలన్న బెంగ పట్టు కుంది. "డబ్బు డబ్బు, కొండశిఖరానికూడా ఇదే గొడవ" అని విసుక్కున్నాను. డబ్బుబెంగను మనసులోనికి రానివ్వడం కూడా నా స్వభావంకాదు. అది కొందరికి కఠినత్వంగానూ స్వార్థపరత్వంగానూ తోచవచ్చు. కాని నాకు అదే మంచిగా తోస్తుంది. ఏమంటే పర్వతారోహణలో వున్నప్పుడు నాకు వేరే ఆలోచనలు పట్టవు. ఎవరెస్టు ఎక్కాలి అన్నది ఒక్కటే ఆలోచన.

తరువాత కొద్దివారాల్లో జరిగిన వివరాలన్నీ నేను చెప్ప నక్కరలేదు. కల్నల్ హంట్ వాటినిగురించి తన గ్రంథంలో యిదివరకే వ్రాశాడు. హిమపాతం పైకి మార్గం దొరికింది. తొల్లిటియాత్రలలో మార్గాలకంటే భిన్నమైంది ఆమార్గం.

మంచుస్థితి ఎప్పుడూ మారుతూ వుంటుంది. కాబట్టి ఎప్పుడూ కప్పుడు కొత్తమార్గాలను చూచుకోవడం తప్పదు. దారికి గుర్తుగా పొడుగాటి స్తంభాలుపాతి వాటికి జండాలు కట్టారు. మెట్లను చెక్కారు. తాళ్ళను బిగించారు. గోతులు వున్న చోట్ల వాటిమీద నిచ్చెనలు వంతెనలు వేశారు. షెర్పాలు వరసగా బరువులను మోసుక వస్తున్నారు. శ్రమ యెక్కువగా వున్నప్పుడు వేర్వేరు జట్లుగా చీలి వంతులుగా మోసేట్టు యేర్పాటు చేశారు. బరువులు ఎత్తుకొనివెళ్ళే ప్రతి మనిషి పై మకాంల నుంచి క్రిందికిదిగి రావాలి, మొదటి మకాం దాకానేకాదు. హిమానీనద ప్రదేశానికి చాలాక్రింద "లుబుజే" అనే స్థలం వుంది. అందాకా రావాలి. అక్కడ ఒక కాలన వుంది. పైరుపంటలు పండుతాయి. ఆ పల్లపు ప్రదేశంలో త్వరగా బలాన్ని సమకూర్చుకోవచ్చు. ఈలాంటి పనులన్నీ చక్కబెట్టుకోడానికి వ్యవధి వుండడం వల్లనే ఆ యాత్ర జయప్రదంగా నెరవేరిందను కుంటాను. స్విస్ యాత్ర వూపిరి తిప్పుకునే అవకాశం లేకుండా పరుగులమీాద జరిగింది.

నా ఆరోగ్యం సరిగా వుంటే ఎవరెస్టు శిఖరం దాకా ఎక్కడానికి నాకు అవకాశం యిస్తామని యాత్ర ప్రారంభం కాక ముందే వాగ్దానం చేశారు. కొద్దిరోజుల క్రిందటనే డాక్టర్లు నన్ను పరీక్షచేసి అందరికంటే నేనే మంచి స్థితిలో వున్నట్టు నిర్ధారణ చేశారు. కాబట్టి నాకు అవకాశం దొరుకుతుందని తెల్సుకున్నాను. డాక్టరు ఇవాన్సునూ, బోర్డిలాన్ నూ హిల్లరీని శిఖరం దాకా ఎక్కడానికి ఎన్నుకున్నారు. అప్పటినుంచి నన్ను హిల్లరీని ఒక జంటగా చేర్చారు. మేం శ్రమకరమైన పనులు చేయసక్కరలేదు. శిఖరం మీాదికి ఎక్కడానికి తగిన

బలం నిలుపుకోవాలి. మిగతావాళ్ళు లోళ్ళు ముఖం దాకా బరువులు మోశారు. మేం తేలికబరువులతో ఆక్సిజన్ వాడకం అలవాటు చేసుకుంటూ కొత్తగా చేరిన షెర్పా యువకులకు హిమపాతంగుండా ఎక్కుడులో సాయపడుతూ క్రింది మకాం నుంచి తూర్పు కనుమ వరకు ఎక్కుతూ దిగుతూ వున్నాం. హిల్లరీకి పర్వతారోహణలోగల నేర్పు ఆశ్చర్యకరమైంది. ఆయన బలమూ ఓర్పూ అలాంటివే. కార్యపరులైన పెక్కుమంది, ముఖ్యంగా బ్రిటిషువారి లాగా హిల్లరీ మితంగా మాట్లాడేవాడు. మంచి స్నేహితుడు. ఆయనతో వుండడం వుల్లాసంగా వుండేది. షెర్పాలతో కలిసి మెలిసి తిరిగేవాడు. ఆహారం కాని వస్తుసామగ్రి కాని తన దగ్గర వున్నంతలో ఒకరికి పంచి యిచ్చేవాడు. మా జంట అందరికీ చమత్కారంగా వుండేది. ఆయన ఎత్తు ఆరడుగుల మూడంగుళాలు. నా ఎత్తు దాదాపు ఏడంగుళాలు తక్కువ.

మా కలయిక ఏలా వుండేదీ తెలపడానికి ఒక సంఘటన చెపుతాను. మేమింకా హిమపాతం వద్ద వున్నాం. మంచు బోదుల మధ్యగుండా నడుస్తున్నాం. ఆకస్మికంగా హిల్లరీ కాళ్ళక్రింద మంచు విచ్చి గోతిలోకి జారాడు. "తేన్జింగ్, తేన్జింగ్" అని కేక పెట్టాడు. అదృష్ట వశాత్తు మా నడుమ తాడు దూరంగా లేదు. నా గొడ్డలి మంచులోపలికి గుచ్చి, దాని పట్టుతో క్రిందికి దిగి, దాదాపు పదిహేను అడుగులు జారిన తరువాత హిల్లరీని పడకుండా పట్టుకుని మెల్లగా పైకి లాగగలిగాను. ఆయన్ను గోతిలోనుంచి పైకి లాగేసరికి వత్తిడివల్ల నా చేతుల మేజోళ్ళు చినికి పోయాయి. కాని చేతులకు దెబ్బతగిలింది కాదు. హిల్లరీకి కొద్దిగా గాయాలు

అయాయి. ప్రమాదం లేకుండానే బైటపడ్డాడు. "సెబాష్! తేన్జింగ్! బలేపని చేశావు" అన్నాడు కృతజ్ఞత తెలుపుతూ. మకాం దగ్గరకు వెళ్ళిన తరువాత అందరికీ చెప్పాడు. "ఈరోజు తేన్జింగ్ లేకుంటే నా పని ముగిసివుండేది" అని. ఒక మంచి పని చేసి ఆలాంటి అభినందనానికి పాత్రుణ్ణి కాగలిగి నందుకు నాకు ఎంతో సంతోషమైంది. కాని అలా చేయడంలో విశేష మేమీ లేదు. పర్వతాలమీద అపాయాలు కలగడం సహజం. పరస్పరం సహాయపడడానికి ఆరోహకులు ఎల్లప్పుడూ సిద్ధపడి వుండాలి.

స్విస్ ఆరోహకులు మకాంలు పెట్టిన చోట్లనే మేంకూడా మూడు నాలుగు అయిదు మకాంలు పెట్టాం. మొత్తం ఎక్కడంలో స్విస్ వారు విడిచిపెట్టి పోయిన సామగ్రి మాకు ఎంతో ఉపయోగించింది. క్రింది మకాం వద్ద విడిచిపెట్టిన వంట చెరకు మొదలుకొని శిఖర సమీపంలో ఆక్సిజన్ టాంకుల వరకు (స్విస్ వారు విడిచి పెట్టినవి) ఉపయోగించుకున్నాం.

ఎవరెస్టు లాంటి పర్వత శిఖరాన్ని ఎక్కుతూ వున్నప్పుడు ఏవో కష్టాలు కలగక తప్పదు. అలసట కలుగుతుంది. చలికి బిగుసుకపోతాం. ఊపిరాడకపోవడం సామాన్యంగా వుంటుంది. తలనొప్పి, గొంతునొప్పి, దోకులు, ఆకలి లేకపోవడం, నిద్ర పట్టక పోవడం ఈ లాంటి బాధలు ఎన్నో కలుగుతాయి. మరీ మెత్తు ప్రదేశాల్లో బ్రిటిషు వారందరు విశ్రాంతి కోసం నిద్ర పట్టించే మాత్రలు మింగక తప్పేదికాదు. నాకు మూడు ఊపిరి తిత్తులున్నాయన్న ప్రఖ్యాతికి ప్రమాణంగా పెక్కు మంది కంటే నేనే అదృష్ట వంతుణ్ణి అనాలి. దానికి ఒక్కటే. రహస్యం కనిపెట్టాను: ఎల్లప్పుడూ ఏదో పని చేస్తూ వుండడం

అలా వుంటే వెచ్చదనం తగ్గేదికాదు. ఆరోగ్యం చెడేదికాదు. సరంజాను జాగ్రత్త పర్చడమో, గుడారాలను సరిగా చూచుకోవడమో, ఉష్ణపానీయంకోసం మంచునీటిని కాచడమో ఏదో చేస్తూ వుండేవాణ్ణి. కొంతవరకు నా జాగ్రత్తవల్లనే తలనొప్పి కాని శోకులుకాని కలిగేవికావు. నిద్రమందు నే నెన్నడూ తీసుకోలేదు. చాలా పైకి వెళ్ళితే ఆకలివేయదు. కాని గాలి పల్చబడి పొడిగా వుండడంవల్ల తీరని దాహం వేస్తున్నదని మంచు తినడం మంచు నీటిని తాగడం చాలా అపాయకరమని నా అనుభవాన్నిబట్టి తెలుసుకున్నాను. అలా తాగితే గొంతు యెండుకుపోయి వాస్తుంది కూడాను. అంతకంటే టీ, కాఫీ, వేన్నీళ్ళు చాలా మంచివి. ఈ 1953 యాత్రలో అన్నిటి కంటే మాకు ఎక్కువ మేలు చేసింది వేన్నీళ్ళలో పొడిచేసిన నిమ్మపులుసును పంచదారను కలుపుకుని తాగడం. పర్వతంమీద ఈ పానీయాన్ని ఎక్కువగా తాగేవాళ్ళం. ఆ యాత్రకు నిమ్మపులుసుయాత్రని పేరుపెట్టాను.

లోట్సే ముఖం వద్ద పని సాగుతూ వుంది. ఆరు ఏడు మకాంలు ఏర్పాటు అయ్యాయి. దక్షిణపు కనుమకు దారి ఏర్పడింది. మే నెల 20 వ తేదీకి కనుమకు వెళ్ళడానికి తొలి జట్టు సిద్ధంగావుంది. ఆ జట్టులో విల్‌ఫ్రెడ్ నాయిస్, పదహారు మంది షెర్పాలు వున్నారు. వారు అప్పటికే ఏడో మకాంలో వున్నారు. కాని 21 వ తేదీ ఉదయాన చూస్తే క్రిందిలోయ వద్ద వున్నమాకు ఇద్దరే సాగిపోతూ వున్నట్టు కనిపించారు. ఏం లోపం జరిగిందోమాలో ఎవరైనా పైకి వెళ్ళిచూడాలి. హిల్లరీ నేనూ వెళ్ళేట్టు నిర్ణయించారు. "షెర్పాలకు ఏదైనా ఇబ్బంది కలిగితే అక్కడికి వెళ్ళడం నా విధి. వాళ్ళతో మాట్లాడి

అంతా చక్కబరుస్తాను" అన్నాను. హిల్లరీకూడా పైకి రావాలన్న కుతూహలంతో వున్నాడు. ఇద్దరం బయలు దేరాం. ఆక్సిజన్ వాడుతూ జాగ్రత్తగా పైకి వెళ్ళాం. మధ్యాహ్నం దాటేటప్పటికి ఏడో మకాం చేరాం.

నాయిస్, అనుల్లూ పైకనమదాకా వెళ్ళి తిరిగి వచ్చారు. షెర్పాలుకూడా వెళ్ళవలసిందే. కాని వెళ్ళలేదు. కొందరికి తల నొప్పి, కొందరికి గొంతునొప్పి ముఖ్యకారణం. పర్వతంమీదికి ఎక్కాలంటే భయం వేసింది. అయితే, ఇద్దరు పైదాకా ఎక్కి రావడం చూచాక ఆ భయం చాలావరకు తగ్గింది. నేను వెళ్ళి వాళ్ళకు ఉత్సాహకరంగా ఏవో మాటలు చెప్పి వెచ్చని పానీయాలు తాగించిన తరువాత ఆ మరుసటిరోజు ఎక్కడానికి ప్రయత్నిస్తా మన్నారు. ఆ రాత్రి కొద్ది గుడారాల్లో పందొమ్మిదిమందిమి ఇరుక్కుని పండుకున్నాం. పరిస్థితి మరీ నిరాశగా లేదు. ఉదయం కాగానే అందరం బయలుదేరాం. హిల్లరీ నేనూ ఏడో మజిలీ వరకే వెళ్ళుదా మనుకున్నాం. కాని అంతవరకు వచ్చినాక కనమవరకు వెళ్లాలని బుద్ధిపుట్టింది. ఆ రోజే కనమ వరకు వెళ్ళి నాలుగో మకాంకు దిగివచ్చాం. అంటే దాదాపు ముప్పయి గంటల్లో అయిదువేల అడుగులు ఎక్కుడు దిగుడు అయింది.

అది శిఖరారోహణకు చివరి ప్రయత్నం. ముందు ఏర్పాటు ఈలా జరిగింది. బోర్డిలాన్, ఇవాన్స్ ముందుగా కనమకు ఎక్కాలి. కల్నల్ హంట్ కొందరు షెర్పాలు అండగా వారి వెంట వెళ్ళాలి. మరుసటి రోజు హిల్లరీ నేనూ కనుమకు ఎక్కాలి. లోవే గ్రిగరీ ఇంకా కొందరు షెర్పాలు మాకు సహాయంగా రావాలి. ముందు వెళ్ళిన వారు గమ్యస్థానానికి

చేరని పక్షంలో మే మిద్దరం ప్రయత్నం చేయాలి. బోర్డిలాన్ ఇవాన్స్ ఎనిమిదో మకాం నుంచి బయలుదేరి దక్షిణాప్ర కనుమదాకా, సాధ్యమైతే చివరిదాకా ఎక్కాలి. కనుమ కున్నూ శిఖరానికిన్నీ 3,300 అడుగుల దూరం వుంది. ఆ మధ్యలో మకాం చేయడం సాధ్యపడదు. ఒక్క రోజులో శిఖరానికి ఎక్కి దిగి వచ్చారంటే మహాత్కార్యం సాధించారన్నమాటే. సాధించే వారేమో! ఎవరికి తెలుస్తుంది? కాని తప్పకుండా శిఖరానికి ఎక్కుతారని ఎవరూ అనుకోలేదు. "మాది పూర్వ ప్రయత్నం మాత్రమే" అన్నాడు కల్నల్ హంట్.

వారి తరువాత హిల్లరీ నేనూ వెళ్ళాలి. కాని శిఖరం గట్టు దగ్గర మా కొరకు మకాం ఏర్పడుతుంది. అక్కడ ఆగి పైకి ఎక్కే అవకాశం వుంటుంది. కాబట్టి మొదటి జంట ముందు వెళ్ళినా కార్యసాధనలో మా జంటదే ముందడుగు. మే నెల 23 తేదీన లోయవద్దనుంచి వారు బయలుదేరారు. 25 తేదీన వారిని మేం వెంబడించాం. నాలుగుజండాలను నా గొడ్డలికి కట్టిపెట్టుకున్నాను. అందులో రెండు ఇంగ్లాండు మిత్రరాజ్య సమితివి. ఆ రెంటిని ఆరోహకులు తెచ్చారు. ఖాట్మాండూలో మాకు బహుమతించిన నేపాలు జండా మూడోది. డార్జిలింగులో రోబీ మిత్రా నా కిచ్చిన ఇండియా జండా నాలుగోది. "దీన్ని కూడా తీసుకరానా" అని కల్నల్ హంట్‌ను అడిగాను. "మంచి వూహా! తప్పక తీసుకరా" అన్నాడు.

హిల్లరీ నేనూ మార్గంలో విశేషభాగం ఆక్సిజన్ వాడాం. యాత్రల్లో వుపయోగించే ఆక్సిజన్ ఉపకరణం రెండు రకాలు. స్వచ్ఛమైన ఆక్సిజన్ వాయువును మూతలోనుంచి పీల్చేది

ఒకరకం. బైటగాలిలోకి వదిలి ఆ గాలితో కూడా పీల్చేది రెండో రకం. ముందు వెళ్ళిన వారి వద్ద మొదటిరకం వుంది. మా వద్ద రెండో రకం వుంది. మా వద్ద వున్న దానితో పీల్చడం అంత సులభం కాకపోయినా దానిమీద ఆధారపడ డమే మాకు మేలని పించింది. ఎత్తుమకాంలలో రాత్రిపూట వాడే ఆక్సిజన్ వాడాం. ఉపకరణాలను గుడారాల్లో దగ్గర వుంచుకుని కొద్ది కొద్దిగా విడుస్తూ, రాత్రి పూట వూపిరాడ నప్పుడూ మితంగా పీల్చేవాళ్ళం.

ఏడో మకాంలో ఒక రాత్రి గడిపాం. ఉదయం లేవగానే పైగా రెండుమచ్చలు కనిపించాయి. అవి బోర్డిలాన్ ఇవాన్స్ అనుకున్నాం. ఎనిమిదో మకాం వద్ద ఆంగ్ తేన్జింగ్ అనే షెర్పా ఒక్కడే వున్నాడు. తెల్లవారకముందే వారు వెళ్ళా రని అతను చెప్పాడు. బోర్డిలాన్ ఇవాన్స్ కలిసివెళ్ళారు. కల్నల్ హంట్ దానాంగ్యాల్ అనే షెర్పాతో చిట్టచివరి మకాంకు సామగ్రిని మోయించుకుని వెళ్ళాడు. తరువాత ఆ రాత్రి నేనూ హిల్లరీ ఆ పదార్థాలను వాడుకున్నాం.

కొంచెంసేపట్లో కల్నల్ హంట్ దానాంగ్యాల్ క్రిందికిదిగి వస్తున్నారు. మాకు చాలా భయం వేసింది. కలుసుకోవా లని గబగబా పైకి వెళ్ళాం. కొద్దినిమిషాల్లో కల్నల్ హంట్ పడిపోయాడు. నిమ్మపండు రసాన్ని తాగించి గుడారంలోకి చేర్చాను. 27,350 అడుగుల వరకు ఎక్కి, నాలుగో మకాంకు పదార్థాలను చేర్చామని చెప్పాడు. తాము దారిలో వుపయోగిస్తూ వున్న ఆక్సిజన్ టాంకులు కూడా అక్కడే వదిలి పెట్టారు. ఆక్సిజన్ లేకుండా దిగిరావడమే ఆలాంటి దుస్థితి కలగడానికి ఒక కారణం. వారు గుడారాల్లో విశ్రాంతి

తీసుకుంటూ వుండగా నిమ్మరసాన్ని టీని తెచ్చి యిచ్చాను. కల్నల్ హంట్ కళ్ళు విప్పి "తేన్జింగ్! ఈ విషయాన్ని ఎన్నడూ మరవను" అన్నాడు. ఆ మాట ఒక మధుర స్మృతిగా నాలో నిలిచి వుంది.

అక్కడ నిరీక్షిస్తూ కూచున్నాం. మా మకాంలో నాలుగు గుడారాలు వున్నాయి - అందులో మూడు నిద్రపోవడానికి పనికి వచ్చేవి. 750 పౌనుల ఆహార పదార్థాలు వున్నాయి. ఇంకా సామగ్రి వుంది. ఇవన్నీ షెర్పాలు క్రిందినుంచి పైదాకా తెచ్చినవే. షెర్పాలలో పదిహేను మంది కనుమదాకా వచ్చారు. ఆక్సిజన్ సహాయం లేకుండా సగటున ముప్పయి పౌనుల బరువులను మోస్తూ ఆరుగురు షెర్పాలు కనుమ దాకా రెండుసార్లు తిరిగారు. "వాళ్ళు లేకుంటే మాగతి ఏమై వుండును." అనుకున్నాను. ఏమై వుండేది? పర్వతం మొదట్లోనే వుండేవాళ్ళం.

మధ్యాహ్నం అయ్యే సరికి మంచు దిగుడులో ఇద్దరు కనిపించారు. కలుసుకోవాలని వడివడిగా పైకి వెళ్ళాం. అలిసిపోయి మాట్లాడలేని కదలలేని స్థితిలో వున్నారు. వారు దక్షిణ శిఖరం దాకా వెళ్ళారట. అంతవరకైనా ఇది వరకు ఎక్కిన వాళ్ళు లేరు. ఆ పైకి వెళ్ళలేక పోయారు. ఏలాగో వెళ్ళి వుండేవారే. కాని బ్రతికి దిగి రాగలిగేవారు కారు. "తేన్జింగ్! నీవూ హిల్లరీ శిఖరం మీదికి ఎక్కగలరని నాకు నమ్మకం వుంది. కాని వెళ్ళడం మహాకష్టం. పై మకాం నుంచి నాలుగైదు గంటలు పడుతుంది. అపాయకరం కూడాను. నిటారుగా ఎక్కాలి. గోతులు వున్నాయి. మీరు జాగ్రత్తగా వెళ్ళాలి. గాలి అనుకూలంగావుంటే ఎక్కవచ్చు.

ఈ పర్యాయం ఎక్కగలిగితే నీవు పై సంవత్సరం మళ్ళా రానక్కరలేదు" అన్నాడు ఇవాన్స్.

మరుసటి రోజు తెల్లవారగానే బయలుదేరాలని నిర్ణయించుకున్నాం. కాని ఆ రాత్రి మామూలుకన్నా బలంగా గాలి వీచింది. తెల్లవారే వేళకు వేయి పులులు గాండ్రిస్తూ వున్నట్టుంది గాలి మోత. ఆ తుపాను సమసేవరకు ఆశతో నిరీక్షిస్తూవుండడం తప్ప మేం చేయగలిగింది ఏమీలేదు. అదృష్టవశాత్తు ఇంకోరోజు వరకు సరిపడే ఆహారం వుంది.

అది రెండో రాత్రి, వాతావరణం ఆలాగేవుంది. నేను చీకట్లో పండుకుని గాలి మోత వింటూ ఈలా అనుకున్నాను: "ఇది తగ్గక తప్పదు. రేపు వెళ్ళడానికి అవకాశం కలుగుతుంది. ఏడుసార్లు వచ్చాను ఎవరెస్టు శిఖర సమీపానికి. ఈ సారి శిఖరం మీదికి ఎక్కి తీరుతాను". ఆకస్మికంగా ఆచార్యటుచీ జ్ఞాపకం వచ్చాడు. ఆయన నన్ను పండిట్ నెహ్రూకు పరిచయం చేస్తానని చెప్పాడు. ఇప్పుడు పైకి ఎక్కితినా ఆపని తప్పకుండా జరుగుతుంది. అటు తరువాత నాకు ఎలాంటి ఆలోచనలూ లేవు. ఏదో కలవరింత. పచ్చిక పట్టు మీద యాక్‌లు ఎగురుతూ వున్నట్టు కనిపించాయి. పెద్ద గుర్రం తెల్లటిది కనిపించింది. ఆ కలలో ఇంకోకల అందులో ఆకాశాన్నంటే శ్వేత శిఖరం.

## 18. కల నిజమైంది

మే నెల 28 తేదీ ఉదయం తొమ్మిది గంటలకు కొంచెం ముందుగా లొవే, గ్రిగరీ, ఆంగ్ న్యిమా బయలుదేరారు.

తలా సల్లైపౌనులబరువును ఆక్సిజను పరికరాలను ఎత్తు కున్నాను. ఒక గంట వెనక నేనూ హిల్లరీ చెరి యాభైపౌనుల బరువును మోసుకుని వెంబడించాం. ముందు వెళ్ళిన వాళ్ళు దారిలో మెట్లు చక్కగా చెక్కి పెట్టడం చేత ఎక్కడం మాకు సుళువైంది. మధ్యాహ్నం అరోహ్యసరిక వాళ్ళను కలుసు కున్నాం. లోగడ స్విస్ ఆరోహకులు వేసిన గుడారానికి దాదాపు 150 అడుగులు పైన-కల్నల్ హంట్ దానాం గ్యాల్ చేరిన చివరి స్థలానికి చేరాం. అక్కడ ఆ గుడారాలూ ఆహార పదార్థాలూ ఆక్సిజను ట్యాంకులు వున్నాయి. మా బరువులతో పాటు వాటిని కూడా ఎత్తుకున్నాం. అందు మూలాన మా బరువులు ఒక్కొక్కరికి అరవైపౌనులు అయాయి.

మధ్యాహ్నం రెండు గంటలైంది. అందరికీ అలుపు జాస్తి అవుతూంది. ఒక చోటు చూచి వెంటనే మకాం పెట్టాలసి అందరికీ యిష్టంగా వుంది. అదివరకు నేనూ లాంబర్టు ఎక్కి నప్పుడు మేం గుర్తించిన ఒక స్థలం నాకు స్మృతికి వచ్చింది. అక్కడికి వెళ్ళాలని నేను ముందు దారి తీస్తున్నాను. "ఇంక అయిదు నిమిషాలే. ఇంక అయిదు నిమిషాలే" అంటూ లాక్కుపోతున్నాను. "అబ్బ! ఇంకా ఎన్ని అయిదు నిమి షాలు ?" అన్నాడు, ఆంగ్ న్యీమా విసుగెత్తి.

ఏలాగో ఆ స్థలానికి చేరాం. లోవే, గ్రిగరీ, ఆంగ్ న్యీమా కనుమ దగ్గరికి దిగివెళ్ళారు, హిల్లరీ నేనూ మాత్రం మిగిలాం. అప్పటికి ప్రొద్దు నడిమింటికి ఎక్కింది. అక్కడికి యెత్తు దాదాపు 27,900 అడుగులు వుంటుంది. అక్కడ గుడారం పాతడానికి మొదలెట్టాం. అంత యెత్తులో గుడారం వేయడం అదివరకు జరగనిపని. ఆపని మాకు చీకటిపడే వరకూ పట్టింది.

తగినంతగా గాలిఆడేచోట గంటపట్టేపని ఆ స్థలంలో అయిదు గంటలు పట్టింది. చివరకు గుడారం పూర్తి అయింది. లోపల మా చేతుల మేజోళ్ళు తీసివేయడానికి వీలయింది. మరీ ఎక్కువ చలిగా లేదు. ఆక్సిజను పరికరాలను హిల్లరీ తనిఖీచేసి చూచాడు. నేను స్టౌవ్ వెలిగించి, వెచ్చని కాఫీని నిమ్మరసాన్ని తయారు చేశాను. మాకు మహాదప్పిక వేస్తూవుంది. పానీయాలను ఒక్కగుక్కలో పీల్చేశాం. మా వద్ద కొద్దిగా సూల్‌చాపు, బిస్కత్తులు, నిలవచేసిన పండ్లు వున్నాయి. అవన్నీకూడా ముగించాం. పండ్లు గడ్డపారడంచేత మెత్త పడేట్టు స్టౌమీద వెచ్చచేసి తిన్నాం.

లోపల చీకట్లో పండుకుని మరుసటిరోజు కార్యక్రమాన్ని గురించి మాట్లాడుకున్నాం. సంచుల్లో దూరి పండుకున్నా దుస్తులన్నీ ఆలాగే వుంచుకున్నాం. నేను నాస్విస్ బూట్లను విప్పలేదు. హిల్లరీ బూట్లను విప్పిపండుకున్నాడు.

మే 29 హిల్లరీ బూట్లు రాత్రి తెల్లవార్లూ బైట పెట్టడం చేత మంచుకు బిగుసుకు పోయాయి. ఒకగంట సేపు స్టౌమీద వెచ్చచేసి మర్దించిన మీదట దారికి వచ్చాయి. హిల్లరీచాలా తత్తరపోయాడు. "లాంబర్టు లాగానే నా కాళ్లుగూడా మంచు తిని పోతాయేమోనని భయపడ్డాను" అన్నాడు. కాని వాటి ధర్మాన తొడుక్కోడానికి వీలుగా మెత్త పడ్డాయి. ఆ చివర రోజు ఎక్కడులో నేను అన్ని తావులనుంచి వచ్చిన అన్ని రకాల దుస్తులనూ వేసుకున్నాను. బూట్లు స్విస్‌వి. జాకెట్టు ఇంకా కొన్ని దుస్తులు బ్రిటిషు వారిచ్చినవి. కాళ్ళకు వేసుకున్న మేజోళ్ళను ఆంగ్‌లామూ అల్లింది. స్వెట్టరు మిసెస్ హెండర్సన్ యిచ్చింది. వున్ని కుళ్లాయి ఎరల్ డెన్మన్ నాకు

వుపయోగించమని యిచ్చాడు. అన్నిటికన్నా ముఖ్యమైనది నా మెడకు చుట్టుకున్న రుమాలు. దాన్ని రేమండ్ లాంబర్ట్ యిచ్చాడు. ఆకురాలు కాలంలో ఆయనతో యాత్రచేసి నప్పుడు లాంబర్ట్ ఆ రుమాలును నాకిస్తూ "దీన్ని నీవు ఎప్పటికైనా వుపయోగించుకోవచ్చు" అన్నాడు నవ్వుతూ. అది ఏలా వుపయోగపడాలో ఆనాటినుంచీ నాకు బాగా తెలుసు. ఇన్నింటినీ ఆనాడు వేసుకున్నాను.

ఉదయం ఆరున్నరకు ఇంకా గాలి బిగించేవుంది. పట్టుది ఒకటి, వున్నిది ఒకటి, గాలి తగలకుండా ఒకటి, మూడు రకాల మేజోళ్ళ జతలను చేతులకు తొడుక్కున్నాం. బూట్లకు (గడ్డకట్టిన మంచుమీద నడవడానికి వీలుగా మేకులు తాపిన లోహపు చట్రాన్ని బూట్లకు బిగిస్తారు. వాటిని క్రాంపన్లు అంటారు) క్రాంపన్లు బిగించాం. నలభై పౌనుల బరువుగల ఆక్సిజన్ పరికరాన్ని వీపులకు కట్టుకున్నాం.

పైకి ఎక్కుతున్నా హిల్లరీ బూట్లు ఇంకా బిగుసుకునే వున్నాయి. కాళ్ళకు చల్లదనం వదలలేదు. అందుకోసం నన్నే ముందు నడవ మన్నాడు. కొద్ది దూరం నడిచాక హిల్లరీకాళ్లు చాలా వరకు స్వాధీన మయ్యాయి. తాడు మీద స్థలాలను మార్చుకున్నాం. అప్పటినుంచీ దారిలో మంచును చెక్కడం చిమ్మడం పనిలో వంతులు మార్చుకుంటూ, ఒకరు ముందు ఒకరు వెనక, ఈ విధంగా ఎక్కుతున్నాం. దక్షిణ శిఖరం దగ్గరకు చేరుతూ వుండగా మాకు రెండు ఆక్సిజను సీసాలు దారిలో కనిపించాయి. అవి బోర్డిలాన్ ఇవాన్స్ వదిలిపెట్టిన వన్నమాట. పైన కమ్ముకున్న మంచును తీసివేసి చూస్తే ఆ రెండు సీసాలు చెక్కుచెదరకుండా వున్నాయి. నిండా ఆక్సిజను

కలిగిన రెండు సీసాలు దొరకడం మాకు పెన్నిధి లాగా వుంది. కనుమదగ్గరకు దిగుడులో వాటిని ఉపయోగించుకోవచ్చు ననుకున్నాం. ఈ లోపల మా దగ్గరవున్న ఆక్సిజను సరిపోతుంది.

ఆ సీసాలను అక్కడే వదిలి పైకి ఎక్కాం. దక్షిణ శిఖరానికి క్రిందగట్టు విశాలంగా కనిపించింది. ఆ యెక్కడు తెల్లటి నిట్రవు గోడకు పాకుతూవున్నట్టుగా వుంది మాకు. అసలు బాధ ఏమంటే: మంచు గట్టిపడిలేదు. జారిపోతూ వుంది. దానితో పాటు మేమూ జారుతున్నాం. ఆలా జారితే పర్వతం అడుగుదాకా జారి పడతామన్నమాట. పర్వతం మీాద అంత అపాయకరమైన ఎక్కుడు నేను ఎక్కడా చూడ లేదు. ఈనాటికీ తలుచుకుంటే నా దేహం గగుర్పొడుస్తూ వుంటుంది.

ఏలాగో తొమ్మిదిగంట లయ్యేసరికి దక్షిణ శిఖరం మీాద వున్నాం. ఆపైన ఎక్కవలసింది దాదాపు మూడు వందల అడుగులే. ఇదివరకు కన్నా దారి ఇరుకుగానూ నిట్రంగానూ వుంది. ఎడమప్రక్కన 8000 అడుగుల క్రింద పడమరలోయ వరకు ఏటవాలు జారుడు. కుడిప్రక్కన కాంగ్‌సూాంగ్ హిమానీనదం వరకు పదివేల అడుగుల యెత్తునుంచి వ్రేలాడే మంచుగోడల వరస. ఈ రెంటికీ మధ్య సన్నగా వంకలు తిరిగే దారిగుండా పైకి ఎక్కాలి. ఎడంవైపుగాని కుడివైపుగాని ఒక్క అడుగు అవతల పడితే మాపని ముగిసినట్టే. అప్పటికి మా వద్ద వున్న రెండు ఆక్సిజను సీసాల్లో ఒకటి దాదాపు ఖాళీ అయింది. వాటిని అక్కడ వదలడం మూలంగా మా బరువుకొంత తగ్గింది.

దక్షిణపు శిఖరం నుంచి కొంచెం క్రిందికి దిగి తరువాత పైకి ఎక్కాలి. వంతుల ప్రకారం ఒకరు ముందు ఒకరు వెనక ఎక్కుతున్నాం. ఒకరు ఎక్కుతూ వుంటే రెండవ వాడు తాడును గొడ్డలికి కట్టి, పడవకు లంగరు వేసినట్లు, దాన్ని మంచులో పాతిపెడతాడు. ఎక్కి పోగా పోగా చివరకు ఒక పెద్ద అడ్డంకి వచ్చింది. అదే మాకు చివరి అడ్డంకి. నిట్రంగా నిలుచున్నట్లు ఒక రాతిబండ ఎదురుపడింది. దాన్ని ఎక్కడానికి ఒక్కటే వుపాయం. ఆ బండకున్నూ దాని ప్రక్కన వ్రేలాడే మంచు చూరుకున్నూ మధ్య సన్నగా నిట్టంగా ఒక సందు వుంది. ఆ సందులో ఎక్కిపోవాలి. మొట్ట మొదట హిల్లరీ మెల్లగా జాగ్రత్తగా కాళ్ళతో మంచును ప్రక్కలకు చిమ్ముకుంటూ పైకి ఎక్కాడు. అంత సేపూ నేను బలంకొద్దీ తాడు లాగి పట్టుకుని క్రింద నిల్చున్నాను. లేకుంటే మంచు విచ్చి అసలుకు మోసం కలగ వచ్చు. హిల్లరీ భద్రంగా కొండపైకి ఎక్కి, తాడు పట్టుకున్న మీదట నేనూ ఎక్కాను. ఆ కొండ మీద ఒక రకమైన సమతలం వుంది.

ఆ కొండ పైన మళ్ళా విశ్రాంతి తీసుకున్నాం. మళ్ళా బయలు దేరాం. ఆ పైనంతా మంచు బోదులవరస. అవి ఎక్కడ మీద పడతాయోనన్న భయం. కొండ కొసకు దాదాపు నూరడుగుల క్రింద చదునైన రాతిప్రదేశం వుంది. అక్కడ రెండు గుడారాలు వేసుకోవచ్చు. ఆ స్థలంలో ఎన్నటికైనా మనిషి నిలబడడం మళ్ళా జరుగుతుందా అంటూ ఆశ్చర్య పడతాను. ప్రపంచ శిఖరానికి అతి సమీపంలోవుంది ఆ సమతలం. అక్కడ నేను కొన్ని చిన్న రాళ్ళు పోగుచేసి

జేబులో వేసుకున్నాను. చివరకు మంచు బోడులను దాటి వెళ్లాం. మా ముందు ఒక్కటే—చివరి మంచు బోడు—వుంది.

అసలు శిఖరానికి కొంచెం క్రిందగా హిల్లరీ నేనూ నిలబడ్డాం. మా మధ్య తాడు ముప్పయి అడుగులువున్నా విశేష భాగం నా చేతిలో చుట్టి పట్టుకున్నాను. పోగా మా ఇద్దరికి ఆరడుగుల యెడం మాత్రమే వుంది. ఎవరు ముందు ఎవరు వెనక అన్న సంగతి నా ఆలోచనలో లేదు. మెల్లగా పూనికతో ఎక్కాం. ఎవరెస్టు శిఖరం ప్రత్యక్షమైంది. హిల్లరీ ముందు అడుగు పెట్టాడు. ఆయన వెంటనే ఎక్కాను నేను.

ఇద్దరం కరచాలనం చేసుకున్నాం. పర్వత శిఖరాలను ఎక్కినప్పుడు ఆరోహకు లందరూ చేసే మొదటిపని అదే. అంత మాత్రంతో నాకు తృప్తికలగలేదు. అందులో ఎవరెస్టు శిఖరంమీద చేతులు బారలుచాచి హిల్లరీని గట్టిగా కావిలించుకున్నాను. ఆయన అలాగే చేశాడు. ఇద్దరం వీపుల మీద గట్టిగా చరుచుకున్నాం. ఊపిరాడనంత గాఢంగా కావిలించుకున్నాం. అప్పటికి పదకొండున్నరగంట లయింది. ఆకాశాన సూర్యుడు వెలుగుతున్నాడు. ఆకాశంలో అంత గాఢ నీలిమను నేను ఎన్నడూ చూడలేదు.

చుట్టూ చుట్టూ అన్నివైపులా మహాహిమాలయం నేపాల్ టిబెట్ దేశాల్లోకి చొచ్చుకుని కనిపిస్తూ వుంది. నేలమీద నుంచి చూస్తే ఎంతో ఎత్తుగా కనబడే లోత్సే, నత్సే, మకలూ మొదలైన మహాశిఖరాలను ఎవరెస్టు శిఖరంమీద నుంచి క్రిందికివంగి చూడాలి. ఆ పర్వతశ్రేణి యావత్తూ, కంచన్ జంగాతో సహా, దూరంలో తెల్లని గుడారాల్లాగా కనిపించాయి. అలాంటి దృశ్యాన్ని నేను ఎన్నడూ చూడలేదు.

ఇక నెన్నటికీ చూడబోను. అతిభీకరంగానూ విస్మయకరంగానూ వుంది ఆదృశ్యం. కాని నాకు భయం కలగలేదు. ఎవరెస్టును నేను అంతగా ప్రేమించేవాణ్ణి. ఆ శుభ ముహూర్తంకోసం నా జీవితమంతా ఎదురు చూచాను. ఆ సమయంలో ఆ పర్వతశిఖరం నాకు మంచు కప్పుకున్న నిర్జీవ పాషాణం లాగా తోచలేదు. దానిలో చేతనత్వమూ సౌహార్దమూ గోచరించాయి. ఎవరెస్టు శిఖరాన్ని ఒక కోడిపెట్టకు పోలిస్తే మిగతా శిఖరాలను దాని రెక్కలచాటున దాగున్న చిన్నపిల్లలకు పోల్చవచ్చు. నేను ప్రేమించిన నా సంతానాన్ని కూడా ఆ విధంగానే పొదగాలిగదా అనుకున్నాను.

అంత ఎత్తులో కూడా స్తిమితంగా వున్నంతసేపూ మాకు ఆక్సిజనుతో అవసరం లేకపోయింది. అందుకోసం ఆక్సిజన్ పరికరాలనుమూసిపెట్టాం. దిగేవరకూ వాటినిప్రయోగించలేదు.

హిల్లరీ కెమెరాను బైటికి తీశాడు. నేను నాలుగు జండాలను విప్పాను. నేను గొడ్డలిని ఎత్తి పట్టుకున్నాను. హిల్లరీ నాకు ఫోటో యెత్తాడు. నా వద్ద మిత్రరాజ్యసమితి, బ్రిటిషు, నేపాల్, జండాలు వున్నాయి. మిత్రరాజ్యసమితి జండా అన్నిటి పైగా వున్నందుకు నేను చాలా సంతోషపడ్డాను. ఏమంటే ; ఆ విజయం ఒక్క మాదీ మన జాతిదీ మాత్రమే కాదు. విశ్వమానవకోటికి చెందింది ఆ విజయం.

నేను మిఠాయి పొట్లం తీసుక వెళ్లాను. నా కూతురు నిమ్మ ఒక పెన్సలు యిచ్చింది. మంచులో గోయిచేసి వాటిని అందులో పెట్టాను. నన్ను చూచి హిల్లరీ నా చేతికి ఒక గుడ్డ బొమ్మ యిచ్చాడు. అది తెల్ల కళ్ళతో నల్లపిల్లి బొమ్మ. దాన్ని హంట్ యిచ్చాడట. దాన్ని కూడా ఆ వస్తువుల

ప్రక్క పెట్టాను. మా యాత్రను గూర్చి హిల్లరీ వ్రాసిన గ్రంథంలో తనకు హాంట్ క్రీస్తును కొరత వేసిన శిలువ ప్రతిమను యిచ్చినట్టున్నూ దాన్ని శిఖరంమీద పెట్టినట్టున్నూ వ్రాశాడు. అలా చేశాడేమో నేను మాత్రం చూడలేదు. నాకిచ్చింది పిల్లిగుడ్డబొమ్మ. ఇంటి దగ్గర మనకు ప్రియమైన వాళ్ళకు మిఠాయి పంచిపెట్టడం ఆచారంగా వుంది. ఎవరెస్టు శిఖరంమీద నాకు ఎప్పుడూ ప్రేమవుంది. అందులో ఆ శిఖరం మీదనే వున్నాను. ఆ శిఖరానికి నైవేద్యంగా ఆ వస్తువులను మూసి పెడుతూ మౌనంగా ప్రార్థన చేశాను. నా వందనాలు అర్పించాను.

"తుజీ్చే, చోమోలుంగ్మా. నేను కృతజ్ఞుణ్ణి".

ఆ శిఖరం మీద దాదాపు పదిహేను నిమిషాలు వున్నాం. నా గొడ్డలికి చుట్టిన జండాలను విప్పి వాటి దారాలను సాధ్యమైనంత లోతుగా మంచులో పూడ్చాను.

మెల్లొరీ, ఇర్వైన్ మరణించకముందు ఆ శిఖరానికి ఎక్కి వుంటారా ? నా మనసులో ఇంకా వారు మెదులుతున్నారు. హిల్లరీకికూడా అలాగేవుంది. మా కంటే ముందు యాత్ర చేసిన దొరలు షెర్పాలు, ఇంగ్లీషు స్విస్ వారు గొప్ప ఆరోహకులు అందరూ నా మనస్సులో మెదులుతూనే వున్నారు. ఎవరెస్టు శిఖరాన్నిగూర్చి ఆ వీరపురుషులు ముప్పయి మూడు సంవత్సరాలుగా కలలు కన్నారు. విశ్వప్రయత్నాలు చేశారు, శిఖరానికి ఎక్కాలని. వారి కృషి వారి అనుభవం వారి విజ్ఞానం మూలంగానే మాకు విజయం సాధ్యపడింది. క్రింద వున్న మా మిత్రులుకూడా నా తలపులో వున్నారు. వారి తోడ్పాటూ త్యాగమూ లేకుండా ఆనాడు అక్కడికి ఎక్క

గలిగేవాళ్ళం కాము. అందరికంటే ముఖ్యంగా ఒక్క వ్యక్తి నా స్నేహితుడు లాంబర్టు నా స్మృతిలో వున్నాడు. ఆయన నాకెంత సన్నిహితుడు. ఆయన నా తలపులో వుండడంకాదు. ఆక్షణంలో నా ప్రక్కనే నిలబడి వున్నట్లు తోచింది నాకు. ఆయన రుమాలు నా వద్దనేవుంది. ఇంటికి వెళ్ళగానే ఆయనకు తిరిగి పంపాలనుకున్నాను. ఆలాగే పంపాను కూడా.

"పర్వత శిఖరం మీద బుద్ధభగవానుడు కనిపించాడా? పరమేశ్వరుడు కనిపించాడా!" అంటూ నన్ను ప్రశ్నలు వేశారు. ఉన్న వాస్తవం చెప్తున్నాను. నాకు ఎవ్వరూ కని పించలేదు. లోకానికీ మానవుడికీ అతీతమైంది ఏదీ కనిపించ లేదు. భగవంతుడితో అత్యంతమైన సాన్నిధ్యం కలిగినట్లు మాత్రం నాకు తోచింది. నాకు ఆ మాత్రం అనుభూతి చాలు. నా మనసు లోపల భగవంతుణ్ణి గూర్చి నమస్కరించేశాను. శిఖరం నుంచి దిగివస్తూ భగవంతుణ్ణి గూర్చి ఒక్కటే ప్రార్థన చేశాను. విజయం కలిగించినందుకు సజీవంగా పర్వతాన్ని దిగేట్టు అనుగ్రహించమని.

దక్షిణ శిఖరం వద్ద కొద్ది కాలం విశ్రాంతి తీసుకున్నాం. దాని క్రింద నిలువుగా మంచు గోడ దిగాలి. ఎక్కడం కన్నా దిగుడు భయంకరంగానూ అపాయకరంగానూ కనిపించింది. చివరకు ఎలాగో క్షేమంగా దిగాం. దాదాపు రెండుగంటలకు మొదటి గుడారం దగ్గరకు చేరాం. అక్కడ ఆగి కొంచెం విశ్రాంతి తీసుకున్నాం. పండురసాన్ని కాచి తాగాం. పానీయం తీసుకుని కొన్ని గంటలైంది. దాన్ని తాగగానే దేహంలోకి కొత్త ప్రాణం ప్రవేశించినట్టుగా వుంది.

కనుమకు కొంచెంపైన వుండగా జార్జిలోవ్ మమ్ములను కలుసుకోడానికి ఎదురువచ్చాడు. మమ్ములను గట్టిగా కావిలించు కున్నాడు. వేడికాఫీ యిచ్చాడు. నాయిస్ మాకోసం టీ తెచ్చాడు. అప్పటికి చీకటిపడు తున్నది. చలి ముదురుతూ వుంది. పడకసంచుల్లోకి దూరాం. హిల్లరీ, లోవ్, నాయిస్ ఒకగుడారంలోనూ నేనూ పసాంగ్ వేరొక గుడారంలోనూ పండుకున్నాం. "అచ్ఛా" అనుకుంటూ కళ్ళుమూశాను. కాని చాలా అలిసిపోయాను. ఆలోచనకు కూడా బలంలేదు. "అసలు సుఖానుభవం ఇక ముందే కలగాలి" అనుకున్నాను.

## 19. తేన్జింగ్ జిందబాద్

అనుకున్నట్టు సుఖం ప్రాప్తించింది. అటుతరువాత ఇతర లాభాలు కూడా కలిగాయి.

దారి పొడుగునా మిత్రులతో సమావేశాలు. ఏడో మకాంలో మేజరు విల్లీ చాలామంది షెర్పాలు వున్నారు. ఆరోమకాం దాటగానే టాంస్టోబర్డు చలనచిత్ర పరికరాలతో మమ్ములను కలుసుకోడానికి ఎదురు వచ్చాడు. అయిదో మకాంలో మాకు షెర్పాలు టీ యిచ్చారు. మిగతా దిగుడులో నా బరువులను తామే మోసుకవస్తామని పట్టుపట్టారు. నాలుగో మకాం వద్ద యాత్ర తాలూకు మిగతా జట్టును కలుసుకున్నాం. హంట్ నన్నూ హిల్లరీనీ కావిలించుకున్నాడు. నేను ఇవాన్స్‌ను గాఢాలింగనం చేసుకున్నాను. వారిని వీరు వీరిని వారు ఒకటే కావిలించుకోవడం. "నిజంగా జరిగిందా ? నిజంగా జరిగిందా ?" అంటూ హంట్ మాటిమాటికి అడగ

నారంభించాడు. మా మాటలన్నీ విని మళ్ళీ నన్ను సంతోషం కొద్దీ కౌగిటిలో పొదువుకున్నాడు. అద్భుతమైంది ఆ సాయంత్రం. నాజీవితంలో అంత సుఖానుభవం ఎన్నడూ పొందలేదు.

మా విజయవార్త మొదట నాంచేబజారుకు చేరింది. అక్కడినుంచి రేడియోద్వారా కాట్మాండూకు అందింది. కోడ్ భాషలో బ్రిటిషురాయబారికి (మిస్టర్ సమ్మర్ హేస్) పంపగా ఆయన లండనుకు పంపాడు. ఈ వార్త ముందుగా ఇంగ్లాండు రాణికి చేరాలని వుద్దేశించ బడింది. ఆ మరునాడే ఆమె పట్టాభిషేకం. ఉత్సవ సమయానికి ఈ వార్త ప్రకటన కావాలి. లండన్ కు సకాలంలో చేరడంవల్ల ఉత్సవం అద్భుతంగా జరిగింది. కాని ప్రాచ్యదేశాలలో పెక్కింటికి ఒకరోజు ఆలస్యంగా తెలిసింది. అది కూడా పాశ్చాత్య దేశాలద్వారా తెలిసింది. నేపాలు ప్రభువు శ్రీ త్రిభువన మహారాజు విషయంలోకూడా ఆలా జరిగింది. అసలు నేపాలు రాజ్యంలోనే వుంది ఎవరెస్టు పర్వతం!

ఆరాత్రి నాలుగో మకాంవద్ద ఒక మిత్రుడిచేత నా భార్యకు ఉత్తరం వ్రాయించాను—"ఈవుత్తరం తేన్జింగ్ వ్రాయించేది. ఒక దొరతో కూడా నేను 29 మే ఎవరెస్టు శిఖరం ఎక్కాను. నీవు సంతోషిస్తావనుకుంటాను. ఇంతకంటే ఎక్కువ వ్రాయలేను. నన్ను క్షమించాలి." ఇది వుత్తరం. క్రింద నేను సంతకం పెట్టాను.

అడుగు మకాంలో ఒక్క రాత్రి మాత్రం వున్నాను. మరుసటిరోజు బయలుదేరి హిమానీ నదాన్నీ లోయలనూ దాటి మా అమ్మను చూడడానికి ధామేకు వెళ్ళాను. అంటే ఒక్క రోజులో ముప్పయి అయిదు మైళ్ళు నడిచానన్నమాట. జయ

ప్రదంగా ఎవరెస్టు శిఖరానికి ఎక్కివచ్చానని చెప్పగానే ఆమె చాలా సంతోషించింది. "ఆ పర్వతం మీదికి వెళ్ళ వద్దని నీకు ఎన్ని మార్లో చెప్పాను. ఇంక వెళ్ళవలసిన పనివుండదు" అన్నది. ఎవరెస్టు శిఖరం మీద బంగారు పిచ్చుక బంగారు జూలు వైడూర్య వర్ణం కలిగిన సింహం వుంటాయని ఆమెకు మొదటినుంచీ నమ్మకం. వాటిని చూచావా అని అడిగింది. లేదని చెప్పి ఆమెకు ఆశాభంగం కలిగించడం నాకు విచారం గానే వుంది. కాని నిజమే చెప్పాను. శిఖరం మీదికి రాంగ్ బక్ మఠం కనిపించిందా అని అడిగింది. కనిపించిందని చెప్ప గానే ఆమెకు సంతోషమైంది.

అక్కడ మా అమ్మతోనూ నాచిన్న చెల్లెలుతోనూ రెండు రోజులు గడిపాను. నా బాల్యం గడిచిన తరువాత నా స్వంత గ్రామంలో అంతకాలం వుండడం అదే ప్రథమ పర్యాయం. తిరిగి వస్తూ "నాతో కూడావచ్చి డార్జిలింగులో వుండడం నీకు సమ్మతమేనా" అని మా తల్లిని అడిగాను. "నాకు సమ్మతమే. కాని పెద్దదాన్ని అయ్యాను. నీకు శ్రమగా వుంటుంది" అన్నది. ఆమెను ఒప్పించాలని చూచాను. కాని ఆమెకు యిష్టంగాలేదు. ఆమెవద్ద సెలవు పుచ్చుకుని బయలుదేరాను. దారిలో థ్యాంగ్‌చోషేవద్ద నా అక్క లామూకిపాను చూచాను. ఆమెను ఆమె భర్తను ఇద్దరు కూతుళ్ళను నాతో కూడా రమ్మన్నాను. వాళ్ళు వయసులోఉండబట్టి సరేనన్నారు.

పర్వతం దగ్గరనుంచి యాత్ర జట్టు చెదురుగా తిరిగి వస్తూ వుంది. ఏవేవో ఏర్పాట్లు చేయాలని కల్నల్ హాంట్ ముందుగా వెళ్ళాడు. ఆ యేర్పాట్లలో ఒకటి నన్ను ఇంగ్లాండుకు వెంట బెట్టుకుని వెళ్ళడం. అదివరకే నాకు సర్ విన్‌స్టన్ చర్చిల్ వద్ద

నుంచి నిస్తంత్రీ వార్త వచ్చింది. అప్పటినుంచి సందేశాలు తెరిపిలేకుండా ప్రవాహం లాగా వచ్చి పడుతున్నాయి. నా భార్యను పిల్లలతో సహా కాట్మాండూకు రమ్మని కబురంపాలనుకున్నాను. ఆ సంగతి మేజర్ విల్లీతో చెప్పాను. ఎప్పటిలాగే ఆయన దయతో సాయపడ్డాడు. యాత్ర పార్టీతోనే నా భార్యకు కబురు పంపారు.

నేను నడుస్తూవుంటే ఇటూ అటూ బారులు తీర్చిన పత్రికా విలేఖరులు, యాత్ర వివరాలతోపాటు జాతీయతను గురించీ రాజకీయాలను గురించీ నన్ను అన్నిరకాల ప్రశ్నలు వేయ నారంభించారు. ఈ బెడద కలగవచ్చునని మేజర్ విల్లీ ముందుగానే నాకు హెచ్చరిక చేశాడు. జాగ్రత్తగా మెలగాలన్నాడు. అలాగే ప్రయత్నించాను. హాక్సే అనేచోట 'లైఫ్' పత్రిక తరఫున జేమ్సుబర్క్ నన్ను కలుసుకున్నాడు. [illegible] యునైటెడ్ ప్రెస్ అసోసియేషన్ తరఫున జాన్ హాన్‌సేల్ కలుసుకున్నాడు. ఆ పత్రికకు కొన్ని వ్యాసాలు పంపడానికి తరువాత ఖరారు చేసుకున్నాను.

జండాలు ఎగరేస్తూ ప్రజలు నా చుట్టూ మూగారు. "తేన్జింగ్ జిందాబాద్" అని నినాదాలు చేశారు. కాని ఆ రభసంతా లేకుండా అంతకుపూర్వపు యాత్రల్లో లాగే గుట్టుగా వెళ్ళిపోతే బాగుండుననిపించింది నాకు.

కాట్మాండూకు మూడుమైళ్ళ దూరంలో నాభార్యా బిడ్డలూ నాకోసం నిరీక్షిస్తూవున్నారు. ఆనందంతోనూ ఉత్సాహంతోనూ పరస్పరం ఆలింగనం చేసుకున్నాం. ఆంగ్ లామూ నా బుజాలపైన "ఖాదా" అనే ఉత్తరీయాన్ని కప్పింది. అది పవిత్రతకు చిహ్నం. తానిచ్చిన పెన్సలును

శిఖరంమీద పెట్టానని నీమాతో చెప్పాను. ఈ శుభవార్త వాళ్ళకు జూను 2వ తేదీ ఉదయం తెలిసింది. రేడియోలో విని ఎవరో స్నేహితులు చెప్పారు. వార్త వెలువడగానే పెద్ద ఉద్యోగస్తులు నాభార్యను చూడ వచ్చారు. నగరంలో ప్రతిచోటా నా పటాలు పెట్టారు. ఒక కవి నన్ను గూర్చి మిత్రా ప్రోత్సాహంతో గేయాన్ని రచించాడు. ఆ గేయాన్ని పాడుతూ ప్రజలు వీధులవెంట వూరేగింపులు చేస్తున్నారు.

అయితే కాట్మాండూకు రమ్మని నేను పంపిన కబురు మా వాళ్ళకు అందింది కాదు. నా భార్య పిల్లలు ఏలాగో బయలు దేరాలనుకున్నారు. కాని దగ్గర పైసా లేదు. కట్టుకోడానికి సరైన బట్టలు లేవు. నా ఫోటోల అమ్మకంమీద వచ్చిన పైకం నూరు రూపాయలు మిత్రా నా భార్యకు యిచ్చాడు. అది కాక మిసెస్ హెండర్సన్ మొదలైన స్నేహితుల సహాయంతో మిత్రా నాలుగువందలు సేకరించాడు. ఆ పైకం కూడా ఆమెకిచ్చాడు. అందు మూలంగా నా భార్య పిల్లలతో కూడా విమానంమీద కాట్మాండూకు రాగలిగింది.

మాలో చాలా మందిమి ఇంకా యాత్ర దుస్తులతోనే వున్నాము. ఆ వేషాలతోనే మమ్మల్ని రాజభవనానికి తీసుక వెళ్లారు. నేపాలుప్రభువు మాకు స్వాగత మిచ్చారు. 'నేపాల్ తార' (నేపాల్ నక్షత్రం) అనే పతకాన్ని ప్రభువు నాకు బహుమతి చేశారు. నేపాల్ రాజ్యంలో అదే ఉత్తమమైన బహుమానం. హంట్‌కూ హిల్లరీకీ రెండు పతకాలను బహుమానం చేశారు. ఇంగ్లాండు మహారాణి వారిద్దరికి నైట్ బిరుదాన్ని యిచ్చినట్టూ నాకు జార్జి పతకాన్ని యిచ్చినట్టూ తెలిసింది. ఇండియాకు స్వాతంత్ర్యం వచ్చాక వైదేశిక బిరు

దాలను నిషేధించారు. మహారాణి నాకు కూడా నైట్ బిరు దాన్ని యిచ్చివుంటే కొంత చిక్కు ఏర్పడేది. అలాంటి యిబ్బంది లేకుండా పోయింది.

నేపాలు ప్రజలు నాకిచ్చిన స్వాగతం అద్భుతమైంది. వేయి జన్మాలకైనా వారు చూపిన ఆదరాభిమానాలను మరిచిపోలేను. కాని నన్నొక వీరుణ్ణి చేయాలన్న ప్రయత్నంలో వారు అతిగా ప్రవర్తించారు. బ్రిటిషు అధికారులకు గౌర వంతో ఆతిథ్య మివ్వకపోగా వారిసంగతి దాదాపు విస్మ రించారు. నా జాతిని గురించి చాలా చర్చలు జరిగాయి. ఆ విష యాన్ని గురించి ప్రధానమంత్రి శ్రీ కోయిరాలాతో మాట్లా డాను. ప్రధానమంత్రి ఇతర మంత్రులు నా పట్ల ఎంతో దయను ఆదరాన్ని చూపారు. నేపాలులో వుండదలుచుకుంటే నాకు ఒక గృహాన్ని ఏర్పాటు చేస్తామన్నారు. ఇంకా బహు మానాలను సౌకర్యాలను సమకూరుస్తామన్నారు. నేను ఏ విధంగా నిర్ణయించుకున్నా నాకు సుఖసంపదలు కలగాలని కోరారు. "నేను నేపాల్ గర్భంలో పుట్టాను. ఇండియా ఒడిలో పెరిగాను" అంటూ పత్రికా విలేఖరులకు చెప్పాను. నాకు రెండు దేశాలమీద ప్రేమవుంది. రెంటికీన్నీ నేను పుత్రుడనే.

నేపాల్ ప్రభువు స్వంత విమానం మీద కట్మాండూ నుంచి కలకత్తా వెళ్ళాను. నా భార్య పిల్లలు కూడా వచ్చారు. ఒక రకంగా నాకు సలహాదారుగా వున్న లాప్కా షేరింగ్ కూడా వచ్చాడు. కలకత్తాలో 'రాజభవనం'లో మాకు విడిది. నగరమంతా కోలాహలంగావుంది. స్వాగతాలు ఆతిథ్యాలు విరామంలేకుండా జరిగాయి. ఢిల్లీలోకూడా అలాగే జరిగింది.

విమానాశ్రయం దగ్గర బ్రహ్మాండమైన స్వాగతం యిచ్చారు. అంత జనసమూహాన్ని నాజన్మలో ఎన్నడూ చూడలేదు. నేపాల్ రాయబారి భవనంలో మాకు విడిది ఏర్పాటుచేసారు. ఆ సాయంత్రం పండిట్ నెహ్రూ మాకు విందుచేశారు. ఆ ముహూర్తం నాజన్మకల్లా ఘనమైంది. ప్రారంభంనుంచి పండిట్ నెహ్రూ నాపట్ల పితృవాత్సల్యం చూపారు. అంత దయ అంత ఆప్యాయత చూపారు. నన్ను ఏలా వుపయోగించుకోవాలి అనే విషయం ఆయనకు పట్టలేదు. నాకు సుఖాన్ని సమకూర్చడం ఏలాగు అన్నదే ఆయన ఆలోచన. ఆ విందు జరిగిన మరుసటిరోజు తమ కార్యాలయానికి నన్ను ఆహ్వానించి తప్పకుండా లండన్ వెళ్ళమని సలహాచెప్పారు. ఇంకా ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే: నాభార్య పిల్లలు నాతో కూడా లండన్‌కు ప్రయాణం కావడానికి తగు ఏర్పాట్లు చేస్తామన్నారు.

తరువాత తమ గృహానికి నన్ను తీసుకవెళ్ళారు. నాకు స్వంతంగా దుస్తులు లేకపోవడం చూచి ఆయన పెట్టె తెరిచి కోట్లు ట్రౌజర్లు షర్టులు ఇంకా ఏవేవో తీసియిచ్చారు. మా యిద్దరి సైజు ఒకటే కావడంచేత అవి నాకు సరిపోయాయి. తాము గౌరవంగా దాచుకున్న తండ్రిగారి వస్తువులు కూడా కొన్ని యిచ్చారు. ఆంగ్ లామాకు చక్కని పాకెటు పుస్తకం, వానకోటు యిచ్చారు. ఇస్తూ "లండనులో వర్షం ఎక్కువ" అన్నారు చిరునవ్వుతో. ఆయన యివ్వంది ఒక్కటే. కాంగ్రెసు పార్టీ తెల్లటోపీ యివ్వలేదు. దానికి రాజకీయ ప్రాధాన్యం వుండడమే కారణం. నేను రాజకీయాలకు దూరంగా వుండాలన్న విషయంలో ఆయన పూర్తిగా ఏకీభవించారు.

తరువాత కొన్నాళ్ళకు పాశ్చాత్య దేశాలకు విమానం మీద వెళ్ళాం. మమ్మల్ని తీసుకు వెళ్ళింది 'బొంబాయాల్' విమానం. ముందు కరాచీలో దిగాం. అక్కడ తండోపతండాలుగా ప్రజలు మమ్మల్ని చూడ వచ్చారు. తరువాత బాగ్దాదు, కెయిరో, రోము పట్టణాలకు వెళ్ళాం. రోము పట్టణంలో ఇండియన్ బ్రిటిషు రాయబారులు మాకు ఆహ్వాన మిచ్చారు. రోమునుంచి జూరిచ్ వెళ్ళాం. ఆ ప్రదేశం నాకు ఎంతో ఉత్సాహాన్ని కల్పించింది. పూర్వపు స్విస్ స్నేహితులు చాలామంది నన్ను కలుసుకోవడానికి విమానాశ్రయం వద్దకు వచ్చారు. అందులో ముఖ్యంగా లాంబర్ట్ అక్కడ వున్నాడు. నన్ను ఆహ్వానిస్తూ గట్టిగా కౌగిలించుకున్నారు. హిల్లరీతో కలిసి ఎవరెస్టు శిఖరానికి ఎక్కిన వివరాలన్నీ చెప్పాను. శిఖరంమీద నిల్చున్నప్పుడు నా మనస్సులో తన సంగతే మెదులుతూ వున్నదని చెప్పాను. అక్కడినుంచి విమానంమీద లండన్ వెళ్ళాం. విమానంనుంచి దిగేముందు కల్నల్ హంట్ "మంచు గొడ్డలికి యూనియన్ జాక్ జండాను కట్టి పట్టుకుని నేను ముందు దిగడం నీకు యిష్టమేనా" అని అడిగాడు. "అలాగే! నాకిష్టమే" అన్నాను. అలాగే జరిగింది.

లండన్‌లో మాకు ఇండియన్ సర్వీసెస్ క్లబ్‌లో వసతి. ఇండియా రాయబారి శ్రీ బి. జి. ఖేర్ మా పట్ల చూపిన ఆసక్తి అద్భుతమైంది. ఇంగ్లీషువారు చూపిన ఆదరానురాగాలు ఇంతింతని చెప్పలేను. నేను పరాయి దేశానికి చెందినా స్వజాతీయులైన ఆరోహకులను ఎంత ఆదరించారో అంత ఆదరించారు నన్నుకూడా. వారి ఆదరాన్ని చూస్తే నేపాల్ ప్రజలు బ్రిటిషువారిపట్ల చూపిన ఔదాసీన్యం నాకు



---- లండన్ విమానాశ్రయములో మా కొసగిన అత్యద్భుత స్వాగతము





అగ్‌లామా - నా ప్రాణమిత్రుడు మిత్రాల ఇద్దఱకు నే ఋణపడియున్నాను

జ్ఞప్తికి వచ్చింది. నేను రేడియోలో ప్రసంగించాను. టెలివిజన్‌లో పాల్గొన్నాను. అట్టి వాటిని నేను కళ్లారా చూడడం అదే మొదలు. నాతో "ఇంటర్వ్యూలు" తెంపులేకుండా సాగాయి.

లండన్ పట్టణంలో పదహారు రోజులు గడిపాం. అంతకాలం ఒక కలలో వున్నట్టుగా వుంది. పేంపేం జబ్బునపడి విశేష కాలం ఆస్పత్రిలోనే వుంది. నేనూ, ఆంగ్‌లామూ, నీమా నాటకాలకూ సినిమాలకూ షాపులకూ ఇంకా చూడదగిన ఏవేవో స్థలాలకూ ఒకటే తిరగడం. ఒకరోజు "కార్నివాల్" ప్రదర్శనానికి వెళ్ళాను. "సీనిక్ రైల్వే" మీద ఎక్కి తిరిగాను. అది పైకి ఎక్కుతూ క్రిందికి దిగుతూవుంటే తమాషాగా వుంది. పర్వతాలమీద "స్కీ" చేయడం జ్ఞాపకం వచ్చింది. ప్రజలు మాకు తెంపులేకుండా బహుమానాలిస్తున్నారు. వారి ఆదరాన్ని అభినందించినా మితిలేకుండా బహుమానాలు గ్రహించడమనేది నాకు మనస్కరించలేదు. ఒకరోజు ఫోటోగ్రాఫు దుకాణంవద్దకు వెళ్ళాం. ఆ దుకాణం యజమాని "ఒక కెమెరా మీకు బహుమతి చేయాలని వుంది. మీకు నచ్చింది చూడండి" అన్నాడు. నీమా వెంటనే ఎక్కువ ఖరీదుగల "రోలీఫ్లెక్సు" కెమెరాను ఏరుకుంది. "అది బాగా లేదు. చిన్నరకంతీసుకో" అన్నాను. డార్జిలింగు కెళ్ళిన తరువాత మిత్రాతో "నాన్న వట్టి పిసినారి. నన్ను మంచి కెమెరా తీసుకోనివ్వలేదు" అన్నది నీమా. "నేను పిసినారిని కాదు. నీవు ఆశపోతువు. మీ ఆడవాళ్ళంతా యింతే. మీకు ఆశ ఎక్కువ" అన్నాను.

కల్నల్ హాంట్ తన గ్రామానికి రమ్మని ఆహ్వానించాడు. మాకు వెళ్ళాలని వుండినా పేంపేం జబ్బుతో వున్నప్పుడు లండన్ వదలడం భావ్యంగా తోచలేదు. సమీపంలో వుండడంచేత మేజర్ విల్లీని ఆయన భార్యను రెండుసార్లు చూచి వచ్చాం. ఇంకా చాలామంది పూర్వస్నేహితులను చూచాను. ఎరిక్ షిప్టన్, హ్యూరబ్లైజ్ లాంటి మిత్రులును కలుసుకుని పాతకాలం సంగతులన్నీ కులాసాగా మాట్లాడుకున్నాం. కేవలంగా నన్ను చూడాలని డాక్టరు ఎస్. డి. జాకోబ్ అయిదువందల మైళ్ళు ప్రయాణంచేసి వచ్చాడు. అది నా మనస్సును ఎంతో కదిలించింది.

మా లండన్ యాత్రలోకల్లా అతిముఖ్యంగా చెప్పుకోతగిన సంఘటన తరువాత జరిగింది. అది ఎలిజబెత్ మహారాణికి మమ్మల్ని పరిచయం చేయడం. మహారాణిని కలుసుకునే ముందు రాజభవనంలో ఆరుబయట జరిగిన టీపార్టీకి వెళ్ళాం. అక్కడకూడా జనసమ్మర్దం జాస్తిగావుంది. ఆ సందోహంలో ఎక్కడ కలిగిపోతానో అనిపించింది. నేనుసన్నని మనిషిని. నా భార్య ఆలాకాదు. ఆమె అవస్థ ఏలా వుందోనని యిలా తత్తర పడ్డాను. వెలుపలి సమావేశం ముగిసిన తరువాత మమ్మల్ని రాజభవనంలోకి తీసుకవెళ్ళారు. అక్కడ ఆతిథ్యం ఇంకా వైభవోపేతంగావుంది. మహారాణికి ఎడిన్బరో డ్యూకుకు మమ్ములపరిచయం చేశారు. రాజదంపతులు మాకు పతకాలు మొదలైనవి బహుమానం చేశారు. తరువాత విందుజరిగింది. ఆ విందులో ఒక్కక్షణంసేపు నాకు ఎవరెస్టు శిఖరం మీద వున్నట్టుగా తోచింది. ఏమంటే అక్కడ వాళ్ళు సమ్మానించుతాగాను. మహారాణి చాలా పరిచయంగా నన్ను ఎవరెస్టు

ఆరోహణను గురించీ ఇతర పర్వతారోహణలను గురించీ ఎన్నో ప్రశ్నలు అడిగింది. ఆమె ప్రశ్నలను అర్థం చేసుకుని తగు జవాబులు ఇంగ్లీషు భాషలో ఇవ్వగలిగాను. అందుకు నాకు సంతోషమైంది.

లండన్‌లో పదహారురోజులపాటు అన్నిసుఖాలూ అనుభవించి మళ్ళీ ప్రయాణం అయ్యాం. తిరుగు ప్రయాణంలో రెండువారాలు స్విట్జర్లెండులో వుండేట్టు ముందే ఏర్పాటు జరిగింది. అక్కడ ఆల్ప్స్ పర్వత పరిశోధన నిమిత్తం ఏర్పడిన ఒకసంస్థవుంది. ఆ సంస్థ మాకు ఆతిథ్యం యిచ్చింది. 1952 లో జరిగిన రెండు యాత్రలూ ఆ సంస్థపక్షాన జరిగినవే. మేం వెళ్ళగానే మళ్ళీ బ్రహ్మాండంగా స్వాగతాలు మిత్ర సమావేశాలు ప్రారంభమయ్యాయి. జూరిచ్‌లో ఒక్కరాత్రి గడిపి మరుసటిరోజు కొందరు పూర్వమిత్రులతో కలిసి పర్వతారోహణకు వెళ్ళాను. ఆ పర్వతాలను చూడడమే కాకుండా ఎక్కడానికికూడా అవకాశం కలిగింది. మిస్టర్-ఎర్నెస్ట్‌ఫ్యూజ్ ఆయనభార్య అన్నిఏర్పాట్లు చేశారు. మాతో కూడా వచ్చారు. ఆ దంపతులతో కాలంగడపడం మాకు ఎంతో సంతోషమైంది. సోలో ఖుంబూలో లోయలకున్నూ స్విస్ పర్వతాల లోయలకున్నూ చాలా పోలికవుంది. ఆ పోలికను నేను ప్రత్యేకంగా గుర్తించగలిగాను. అయితే ఎత్తులోగాని వైశాల్యంలోగాని స్విస్ పర్వతాలు హిమాలయాలకన్నా చాలా చిన్నవి. స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులు, పసిబిడ్డలతోసహా ఆ పర్వతాలను ఎక్కుతూవుంటే నాకు చూడ ముచ్చటగా వుంది.

అక్కడ రెండు వారాలూ తెలియకుండానే గడిచాయి. మళ్ళా విమానంమీద స్వదేశానికి బయలుదేరాం. మార్చి 1 వ తేదీన డార్జిలింగునుంచి బయలుదేరాను. తిరిగి వచ్చే నాటికి ఆగస్టు ప్రవేశించింది. ఈ మధ్య అయిదు నెలల్లో నేను ఒక్క నిమిషం కదలకుండా కూర్చోలేదు. ఎవరెస్టును దిగి రావడం నేను కొత్త ప్రపంచంలోకి వచ్చానన్నమాట. ఆటు తరువాత ప్రపంచంలో సగభాగం పర్యటించాను. అశేషజనం నన్ను చూచి హర్షించారు. ప్రధాన మంత్రులను మహారాజులను చూచాను. "చుట్టూ ప్రపంచమంతా మహాగొప్పగా కొత్తగా వున్నట్టు కనిపిస్తూవుంది. కాని వాస్తవంలోను మారింది ఏమీలేదు. ఏమంటే నేను మాత్రం మునుపటి "టెన్జింగ్"గానే మిగిలివున్నాను." అని నాలో అనుకున్నాను. ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కాను. ఇక ఎక్కవలసిందివుంది. అది నా జీవిత శిఖరం.

## 20. పులి పర్వతంనుంచి

న్యూఢిల్లీలో నేను పండిట్ నెహ్రూను డాక్టరు రాజేంద్రప్రసాద్‌ను చూచాను. నా పశ్చిమదేశ యాత్రలను గురించి వారు వివరాలన్నీ విన్నారు. నాకు ముందు కర్తవ్యాన్ని గురించి మంచి సలహాలిచ్చారు. నేను నేపాలులో వుండినప్పుడే పశ్చిమబెంగాలు ముఖ్యమంత్రి డా. బి. సి. రాయ్‌కి శోభీమిత్రా వుత్తరం వ్రాశాను. ఇండియాలో పర్వతారోహణం నేర్పడానికి ఒక విద్యాసంస్థను నెలకొల్పాలనీ దానికి నన్ను అధ్యక్షుడుగా నియమించాలనీ సూచన చేశాను. డా. రాయ్‌కీ నాకూ ఆ సూచన మంచిదిగా తోచింది. నేను

పశ్చిమ యాత్రనుంచి తిరిగి రాగానే డా. రాయ్‌ని కలుసుకుని కళాసంస్థనుగూర్చి మాట్లాడాను. దానికి కావలసిన కార్య ప్రణాళికనుగూర్చి చర్చించుకున్నాం. "హిమాలయన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మౌంటెనీరింగ్" అని దానికి నామకరణం చేయాలి. పర్వతాలనుగూర్చిన విజ్ఞానాన్ని ఆసక్తిని భారతీయులలో పెంపొందించడమూ, మన యువకులను సమర్థులైన పర్వతారోహకులుగా తరిబీతుపొందే అవకాశాలను కల్పించడమూ ఆ సంస్థయొక్క వుద్దేశ్యం. బోధన శిక్షణ నా ఆధీనంలో వుండాలి. సంస్థపరిపాలన యస్. డి. జయాల్ ఆధీనంలో వుండాలి. ఒందర్‌పంచ్ నందదేవి పర్వతాలను ఎక్కినప్పుడు శ్రీ జయాల్ నాతోకూడా వున్నాడు. ప్రస్తుతం ఇండియా సైనికశాఖలో మేజరుపదవిలో వున్నాడు. సంస్థ ప్రధాన కార్యస్థానం డార్జిలింగులో వుండాలి. ఈ విధంగా నిర్ణయించుకున్నాం.

సమర్థులైన వారి సలహా పొందాలని స్విట్జర్లెండులోని సంస్థతో (Swiss Foundation for Alpine Research) సంబంధం కలిగించుకున్నాం. రోజెన్‌లోయీ పర్వతారోహణ సంస్థ అధ్యక్షుడు ఆర్నాల్డు గ్లాథార్డ్ మాకు సహాయం చేయడానికి వచ్చాడు. అక్టోబరు నెలలో నేనూ మేజర్ జయాల్ ఆరోహణ కార్యక్రమానికి అనువైన పీఠం చూడాలని సిక్కిం హిమాలయ ప్రదేశానికి వెళ్ళాం. కొక్టాన్ కాంగ్ శిఖర ప్రాంతంలో ఒక స్థలాన్ని నిర్ణయించుకున్నాం. అక్కడ మామూలు మంచుపర్వతాలే కాక మంచి రాతి ప్రదేశాలు వున్నాయి. పర్వతారోహణ శిక్షణకు అన్ని విధాలా అనుకూలంగా వుంది.

డార్జిలింగులో నేను కుటుంబంతో వున్నాను. తూంగ్ సాంగ్ బస్తీలో మా పాతయిల్లు బహుమానాల వస్తువులతో నిండిపోయింది. కదలడానికి మెదలడానికి సందు లేకుండా వుంది. మొట్టమొదట ఒక హోటల్లో చేరాం. రెండువారాల తరవాత ఒక చిన్న గది చూచుకున్నాం. కొత్తయిల్లు కొనడానికి ప్రయత్నాలు సాగించాం. ఇంకా చూడడానికి వచ్చేవాళ్లు వస్తూనే వున్నారు. ఆతిథ్యాలు విందులు జరుగుతూనే వున్నాయి. ఇంత గౌరవం చూపుతున్నందుకు అందరికీ నేను కృతజ్ఞుడనే. కాని ఒక్కొక్క సమయంలో ఊపిరి తిప్పుకోలేని స్థితి ఏర్పడుతూన్నది.

యునైటెడ్ ప్రెస్‌కు యిచ్చిన కథలకుగాను నాకు మంచి ప్రతిఫలం ముట్టింది. ఇండియాలోని పెక్కు పత్రికాలయాలనుంచీ సంస్థలనుంచీ ద్రవ్యం విశేషంగా వస్తూ వుంది.

పూర్వంలాగా లేమిడితో బ్రతకాల్సిన అవసరం లేకుండా పోయింది. ఈ మార్పును కొంతమంది అర్థం చేసుకున్నారు. ఆదరం చూపారు. కొందరికి అసూయ కలిగింది. [illegible] మాకు రాజసం బలిసిందనీ నాలో గర్వము [illegible] తిరుగుతూందనీ వ్యాఖ్యానాలు మొదలుపెట్టారు. అదివరకు నాకు సలహాదారుగావున్న లక్పా షేరింగ్ నా మేలును కోరే వాడు కాడని తెలిసి అతనితో సంబంధం వదులుకున్నాను. అతని స్థానాన్ని రోబీమిత్రా ఆక్రమించాడు. అన్ని స్వార్థాలు వదులుకుని నాకు తోడ్పడేవాడు. అప్పటినుంచి మిత్రా కృషి, హితోపదేశం స్వార్థరహితమైన అనురాగం నా జీవితానికి ఎంత సుఖాన్ని చేకూర్చాయో నేను చెప్పజాలను.

డార్జిలింగు వెలపల ఒక నిలువు పర్వతం ప్రక్కనవుంది నేను కొత్తగా కొనుక్కున్నయిల్లు. ఆ యింటిముందు నిలు



సూంగ్ బస్తీలో మా ప్రాత యిల్లు

చివరకు అంతా సంతోషమే !



చుంటే సిక్కిం మీదగా కంచన జంగాహిమశిఖరం వరకు ఒక అద్భుత దృశ్యం కనిపిస్తుంది. కాని ఆ యింటికి చాలా మర మత్తు చేయాల్సివచ్చింది. అంతవరకు ప్రవేశించడానికి వీలైంది కాదు. ఆంగ్‌లామూ ఇంగ్లీషు కుటుంబాలలో ఆయాగా పని చేసింది. పాశ్చాత్య పద్ధతులన్నీ బాగా తెలుసు. వంటయింటి దగ్గరనుంచి ఏవేవి ఏలా అమర్చాలో తెలుసు. ఆ పద్ధతిలో వుండాలంటుంది. మామూలు భార్యాభర్తల్లాగే మాకూ చర్చలు వుండేవి. "ఇంతవరకు చేసిందేమో చేశాం. మరీఅతిగా పోకు- ఏదో మట్టుగా జరుపుకుందాం" అనే వాణ్ణి. అయితే ఏదైనా చెప్పడం సులువే కాని జరిగేట్టు చూడడం అంత సులువు కాదనుకుంటాను.

మా యిల్లు యెల్లప్పుడూ నిండుగా సందడిగా వుండేది. నా భార్య నా కూతుళ్లు నేను కాక నా మేన కోడండ్లు ఇద్దరు ఇంటిపనుల్లో సహాయంగా వున్నారు. వాళ్ళ తండ్రి లామా న్యాంగ్‌లా తల్లి లామూకీపాసోలో ఖుంబూనుంచి వచ్చారు. తూంగ్ సాంగ్ బస్తీలో మా పాతయింట్లో కాపరంవున్నారు. మా కొత్త యింటికి చాలాసార్లు వస్తూ పోతూ వుండే వారు. ప్రార్థనలకోసం ప్రత్యేకంగా ఒక గది వుంది. అందులో అన్నీ అమర్చాం. న్యాంగ్‌లా స్వాధీనంలో వుంటుంది ఆ గది. ప్రొద్దుగూకులూ ఎవరో చూడడానికి వస్తూనే వుంటారు. నా కుక్క ఘుస్సర్ పై పెత్తనం చేస్తూ వుంటుంది. దానికి పెద్ద సంసారం యేర్పడింది. ఇంట్లోకి అడుగుపెట్టంది నా గుఱ్ఱం ఒక్కటే. అది చావడిలో అతిగా దాణాసేవిస్తూ గుఱ్ఱపు పందెములలో జయించాలనే అవకాశాన్ని కోల్పోతున్నది.

ఇకపోతే నా కూతుళ్ళ చదువు సంగతి ముఖ్యంగా నా మనస్సును ఎప్పుడూ బాధిస్తూ వచ్చింది. చాలాకాలం వాళ్ళు నేపాలీస్ బడికి వెళ్ళుతూ వచ్చారు. ప్రస్తుతం డార్జిలింగులో లోరెటో కాన్వెంటులో ప్రవేశపెట్ట గలిగాను. అక్కడ ఇంగ్లీషు నేర్చుకుంటున్నారు. ఆధునికవిద్య అలవడుతోంది. అన్ని రకాల మనుషులతోనూ పరిచయం కలుగుతుంది. నా ఇంగ్లీషును వృద్ధిచేసుకోవాలని ఒక *లింగ్వాఫోను భాషల ఉచ్చారణను బోధించే యంత్రం కొన్నాను. దాని సహాయం తోనూ సంభాషణ ద్వారాను ధారాళంగా మాట్లాడ గలుగుతూవున్నందుకు నాకు సంతోషంగా వుంది. చదవడంలోనూ వ్రాయడంలోనూ కృషిచేయాలని నాకు చాలా వుంది. కాని బ్రతికేది స్వల్పకాలం. అందులో తీరిక మరీస్వల్పం. ఇప్పుడు ఇంగ్లీషు లిపిని గ్రహించగలను. కాని మాటలను కూడ బలకడం కష్టంగా వుంది, ఒక్క నాపేరు తప్ప. ఇప్పటికి నా సంతకం లెక్కలేనన్నిసార్లు చేసివుంటాను. నిద్రలోవుండి యెడం చేతితో నా సంతకం పెట్టగల ననుకుంటాను.

ధనం సంపాదించడానికి నాకు ఎన్నో అవకాశాలు వచ్చాయి. పెక్కువాణిజ్య సంస్థలవారు తమతో ఆర్థికసంబంధాలు పెట్టుకోమంటూ ఆహ్వానించారు. అందులో రెండింటిని మాత్రం అంగీకరించాను. అధికంగా సంబంధాలు పెట్టుకోవడం మంచిది కాదని నిర్ణయించుకున్నాను. ఎవరెస్టు శిఖరం క్రింద దొరికిన రాళ్ళసంగతి లోగడ చెప్పాను. ప్రపంచంలో అంతకు మించిన ఎత్తులోవున్న రాళ్ళు ఎక్కడాలేవు. ఇంకా కొంత దిగువలో రాళ్ళనమూనాలుకూడా నా దగ్గర వున్నాయి.

* భాషల ఉచ్చారణను బోధించే యంత్రం

ఈ నిర్ణయం ఒకసారి పత్రికల్లో ప్రకటించబడింది. తనకు [illegible] ఆ [illegible] కానాలనీ పెద్దగా ప్రదర్శిం [illegible] కోరాను. కాని నేను వాటిని అమ్ముదలచుకోలేదు. వాటిలో కొన్నిటిని [illegible] యిచ్చాను. మిగిలినవి నా స్వంతానికే వుంచుకున్నాను. చివరిసారి ఎవరెస్టులో నా [illegible] వస్తువులలోనూ దేన్ని [illegible] నా దగ్గరలేదు. ఒక్క లాంబర్ట్ రుమాలును మాత్రం ఆయనకు తిరిగి పంపాను. ఎవరైనా అంటే నాకు [illegible]. అంతే [illegible]. ఆ పర్వతారోహణలో ఉపయోగించినవి సేకరించినవి అన్ని వస్తువులూ నాకు అమూల్యము లైనవి. వాటిని [illegible]కి అమ్మడం న్యాయమని నావుద్దేశం.

1954 ప్రారంభంలో న్యూయార్కు ఎక్స్‌ప్లోరర్స్ క్లబ్ అతిథిగా అమెరికాకు రమ్మని నాకు ఆహ్వానం వచ్చింది. నా మిత్రుడు శ్రీ [illegible] ద్వారా ఆహ్వానం నాకు అందింది. ఆయన కాలింపోంగ్‌లో వున్నాడు. హెన్రిచ్ హారర్ ఆయనను నాకు పరిచయం చేశాడు. అనేక కారణాలనుబట్టి ఆహ్వానాన్ని నేను అంగీకరించి వుండవలసిందే. కాని పర్యవసానానికి అంగీకరించకపోవడమే ఉత్తమ పక్షమని నాకు తోచింది. అందుకు చాలా కారణాలున్నాయి. ఆ కారణాలు సామాన్యమైనవి వ్యక్తిగతమైనవి కావచ్చు. కొత్తయిల్లు కట్టడం మధ్యలోవుంది. పర్వతారోహణ సంస్థకు చేయవలసిన పనివుంది. ఆ పనికి పశ్చిమబెంగాలు ప్రభుత్వం నాకు వేతనం యిస్తున్నది. నా భార్యను కూతుళ్ళను వెంటతీసుకెళ్ళడం అసాధ్యమై వుండేది. న్యూయార్కు క్లబ్ వారు మిత్రాను నా వెంట తీసుకవెళ్ళితే అయ్యేఖర్చులను భరించలేమన్నారు. ఆయన

నాకు సలహాదారుగాను దుబాసిగాను వెంటవుండటం అవసరం. ముఖ్యవిషయం నా గ్రంథరచనకు ప్రయత్నం జరుగుతూవుంది. అది ప్రకటించబడేవరకు అమెరికా ప్రయాణం వాయిదా వేయడం సముచితమని తోచింది. "ఇప్పుడు నేను అమెరికా వెళ్ళడం మూక ప్రదర్శనం లాగా వుంటుంది. నన్ను గురించి ప్రజలకు అపోహ లేర్పడ వచ్చు" అని సీటను [illegible] వ్రాశాను. నేను వెళ్ళక పోవడానికి రాజకీయ కారణాలు ఏమీలేవు. ఈ సంగతి అమెరికా రాయబారి మిస్టర్ జార్జి ఎలెన్‌తో చెప్పాను. ఆయన చాలా దయగలవాడు. నేను చెప్పిన సమాధానం ఆయనకు నచ్చింది. ఆ తరవాత జాతీయ భౌగోళిక సంఘపక్షాన హుబ్బర్డ్ పతకాన్ని నాకు బహూకరించ డానికి ఆయన డార్జిలింగు వచ్చినప్పుడు నా అమెరికా ప్రయా ణానికి తగిన సమయాన్ని గూర్చీన్నీ విధానాన్ని గూర్చీన్నీ ఆయన నేను మాట్లాడుకున్నాం.

నా గ్రంథాన్ని గూర్చి ఎత్తాను. అది నాకు చాలా ప్రధాన మైన విషయం. పర్వతారోహణ చేస్తూ వున్నప్పుడు నేను గ్రంథకర్తలతో కలిసి వున్నాను. చాలా గ్రంథాల్లో నా ప్రసక్తి వుంది. ఆ గ్రంథాలు మా యింటి నిండా వున్నాయి. ఎవరెస్టు ఎక్కిన నాటినుంచి నేను స్వాంతంగా ఒక గ్రంథం వెలువరించా లన్న అభిలాష మిక్కుటంగా వుంది. నేను స్వయంగా వ్రాయ జాలని కారణంచేత ఇంకొకరి సహాయం తప్పనిసరి అయింది. మొదట అట్టివాడు ఇండియన్‌గావుంటే బాగుండుననుకున్నాను. కాని యునైటెడ్ ప్రెస్సులో నాకుగల కాంట్రాక్టులో గ్రంథం తాలూకు హక్కులుకూడా చేరివున్నాయి. గ్రంథరచనకు పాశ్చాత్యుణ్ణి నియమించుకోవడం మంచిదని ఆ సంస్థ నిర్ణా

హితుల అభిప్రాయం. అలాగైతే అన్నిదేశాల పాఠకులకు ఎక్కువ ఆకర్షణీయంగా వుంటుందన్నాను. చివరకు అమెరికాలో నవలారచయిత జేమ్స్ రామ్సే ఉల్మాన్ అన్న వ్యక్తితో ఏర్పాటు చేసుకోవడమైంది. 1954 వసంతఋతువులో ఆయన నాతో కలిసి గ్రంథరచన సాగించడానికి డార్జిలింగుకు వచ్చాడు. గ్రంథరచన ప్రారంభించిన దినం బుద్ధపూర్ణిమ అయింది. అయింది. బుద్ధభగవానుడు జన్మించింది, జ్ఞానోదయమైంది, నిర్వాణం పొందింది ఆనాడే. మతరీత్యా నాకు అది పవిత్ర దినం. "ఈనాడు ప్రారంభించడం మన అదృష్టానికేనని నా నమ్మకం" అన్నాను ఉల్మాన్‌తో.

ఎవరెస్టు ఎక్కుడుదిగుడువల్ల కలిగినశ్రమ అలావుండగా, ప్రజలరాకపోకలు, ఆతిథ్యాలు, సమావేశాలు వీటివల్లకలిగే శ్రమ అధికంగావుంది. అప్పటికి పదినెలలనుంచి అలాగే జరుగుతున్నది. నా తూకంలో 25 పౌనులు తగ్గింది. ఆరోగ్యం సరిగాలేదు. నేను బొంబాయిలో వుండగా వడదెబ్బతగిలి జ్వరాన పడ్డాను. డాక్టర్ బి. సి. రాయ్ నన్ను పూర్తి విశ్రాంతి తీసుకోమని గట్టిగా చెప్పాడు. ఈ కారణాలవల్ల కాలాన్నంతా ప్రశాంతంగా గ్రంథరచనకే వినియోగించడమైంది.

అంతలో ఎవరెస్టు శిఖరారోహణను మొదటివార్షిక దినం వచ్చింది. అప్పటికి మే 29 ది నా ఆరోగ్యం చాలావరకు చక్కబడింది. ప్రథమ వార్షికోత్సవాన్ని వైభవోపేతంగా జరపడానికి సన్నాహాలు చేశారు. ఆ సంవత్సరం న్యూజీలండుకు యాత్రను నడిపిన సర్ ఎడ్మండ్ హిల్లరీ పర్వతాలపైన జబ్బునపడినట్టు నేపాలునుంచి వార్త తెలిసింది. అదృష్టంవల్ల ఆయనకు త్వర

లోనే నెమ్మది చిక్కింది. కాని ఆ సమయంలో ఆయన జబ్బు విషమరూపం తాలుస్తుందేమో అనిపించింది. ఉత్సవంనాడు థియేటరులో చలన చిత్ర ప్రదర్శనం ప్రారంభం కాకముందు నేను మాట్లాడుతూ ఇలా అన్నాను- "నా స్నేహితుడు హిల్లరీ అనారోగ్యంగా వున్నందుకు నేను చాలా విచారపడు తున్నాను. ఇది సంతోషానికి సమయంగా లేదు. ఆయనకు త్వరగా ఆరోగ్యం కలగాలని ప్రార్థించడమే మన కర్తవ్యం."

పర్వతారోహకులను తరిబీతు చేసే నిమిత్తం స్థాపించ దలచిన నూతనసంస్థ సంవత్సరం చివరకు ప్రారంభం కావాలి. నేనూ మేజర్ జయాల్ గ్రీష్మంలో స్విట్జర్లెండుకు వెళ్ళి పర్వతారోహణలో నూతనపద్ధతులను గమనించి రావడానికి ఏర్పాటు జరిగింది. నాకు స్విట్జర్లెండుమీద చాలా అభిమానం. అక్కడి పర్వతాలను ఎక్కుతూవుంటే మళ్ళా హిమాలయాల్లో ఎక్కుతున్నట్టే వుంది. మేం వెళ్ళిన తరువాత ఇండియానుంచి ఇంకా ఆరుగురు షెర్పాలు వచ్చారు. స్విట్జర్లెండులో శిక్షణ పొందడానికి స్విస్ సంస్థ వాళ్ళను కూడా ఆహ్వానించింది. డార్జిలింగ్ విడిచేముందు వాళ్లను నేనే ఎన్నుకున్నాను. ఆంగ్ తార్కే, గ్యాల్జన్ మిక్‌చేర్, డాక్టరు నాంగ్యాల్, ఆంగ్ టెంపా, నా మేనల్లుళ్ళు గోంబూ, టాప్గే - ఈ ఆరుగురు వచ్చారు. గ్రీష్మం చివరకు అందరం ఇండియాకు తిరిగి వచ్చాం. నూతన సంస్థకు కావలసిన సన్నాహాలన్నీ పూర్తిఅయ్యాక 1954 నవంబరు 4 తేదీన పండిట్ నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు.

సంవత్సరాంతంలో నేను స్టాక్‌హోంబూకు వెళ్ళాను. ఆ ప్రయాణం మునుపటి మాదిరి కాదు. నా కూతుళ్ళనుకూడా తీసుక వెళ్ళాను. క్రిస్మస్ రోజున డార్జిలింగును వదిలాం.

మోటారుమీద రైలుమీద జయనగర్, ధరాన్ వెళ్ళాం. అవి నేపాలు సరిహద్దులో వున్నాయి. అక్కడినుంచి నడిచి వెళ్ళాం. షెర్పా ప్రయాణీకుల్లాగానే పిల్లలు వీపులకు మూటలు కట్టుకున్నారు. దారి పొడుగునా నవ్వుకోవడంతో సరిపోయింది. అది వాళ్ళకు ఒకరకమైన యాత్రే అనాలి. ఎన్నడూ వాళ్ళు మా దేశానికి వెళ్ళలేదు. వాళ్ళనాయనమ్మను అంతవరకూ చూడలేదు. ఇప్పటికి మా అమ్మకు 84 సంవత్సరాలు. నాంచే బజారులోనూ థామేలోనూ కొద్దికాలంవుండి అందరం కలిసి త్యాంగ్‌బోచే మఠాన్ని ఇతర మఠాలనూ చూడడానికి వెళ్ళాం. 1953 యాత్రలో మొదటి మకాంపెట్టిన స్థలందాకా ఇద్దరు పిల్లలను తీసుకుని వెళ్ళాను. అక్కడ నిలబడి ఎవరెస్టు పర్వతానికి నమస్కరించారు. నిజానికి షెర్పాలను గొప్పవాళ్ళను చేసింది ఎవరెస్టు పర్వతం. మాకు సర్వసుఖాలను సమకూర్చింది ఎవరెస్టు పర్వతం.

మా అమ్మను డార్జిలింగుకు కూడా పిల్చుక వచ్చాను. పుట్టుకచేత షెర్పా కావడంచేత ఆమె ఆ వయసులో జయనగర్ దాకా నడిచివచ్చింది. ఆమెకు ఆ నడక ఒక శ్రమ అనిపించింది కాదు. ఆమె ఎన్నడూ బైటి ప్రపంచాన్ని చూచి ఎరగదు. మేం ఇండియాకు వెళ్ళడం ఆమెకు ఏదో విచిత్రంగా వుండేది. ఆమె జీవితంలో అదే మొదటిసారి. రైలెక్కడం. జయనగర్‌లో రైలు కదలి కొంతదూరం వెళ్ళగానే ఆమె ఆశ్చర్యపోతూ నన్ను అడిగింది. "తేన్జింగ్! స్టేషను ముందు చూచిన చెట్టు ఏమైంది?" అని. నేనూ నాకూతుళ్ళూ పగలబడి నవ్వుకున్నాం. రైలంటే ఏమిటో చెప్పాను. ఆమెఅన్నది; "అబ్బ! ఈలా ఇల్లు ఇల్లుగానే ఒక చోటినుంచి ఇంకోచోటికి కదిలి పోవడం నా జన్మలో ఎన్నడూ చూడలేదు" అని.

కాగా, మా యావత్తు కుటుంబం డార్జిలింగు చేరుకుంది. భవిష్యత్తు ఏలా జరుగుతుందో చెప్పజాలను. కొత్త సంగతులు నేను చేయవలసిన పని వుండనే వున్నది. ఇక పోతే, షెర్పా సంఘం తాలూకు పని వుంది. ఆ సంఘానికి నేను అధ్యక్షుణ్ణి. ఆ సంఘం వ్యవహారాలు పెరుగుతున్నాయి. యాత్రలకు షెర్పాలను సరఫరా చేయడం; వాళ్ళ వేతనాలనూ ఉద్యోగ నియమాలనూ క్రమపద్ధతిలో వుంచడం ఈ లాంటివన్నీ నిర్వహిస్తూ వుండాలి. నేను పసితనంలో నుంచి ఈ స్థితిని చూస్తున్నాను. దారిద్ర్యం అజ్ఞానం అంటే ఏమో నాకు తెలుసు. నా స్వజాతీయులకు సేవచేయాలనీ వాళ్లు విజ్ఞానాన్ని సంపాదించుకొని ఉత్తమ జీవితం గడపడానికి అన్ని విధాలా సాయపడాలని నా వాంఛ.

నేను బోధించ గలిగినవి పుస్తకాలవల్ల తెలుసుకున్న విషయాలు కావు. నా జీవితంలో అనుభవ పూర్వకంగా నేర్చుకున్న సంగతులు; అనేక మందితో పరిచయం వల్లనూ, అనేక దేశాలు తిరగడంవల్లనూ, అనేక పర్వతాలను ఎక్కడం వల్లనూ, ముఖ్యంగా ఎవరెస్టువల్లనూ నేర్చుకున్న సంగతులు. అవే నేను బోధించ గలిగినవి. పర్వతారోహణ అనుభవంలో నేను గ్రహించింది ఏమంటే: నీవు ఎంతటి సమర్థుడవైనా సరే, నీకు ఉల్లాసమూ కలుపుగోలు తనమూ వుంటే తప్ప గొప్ప ఆరోహకుడవు కానేరవు. కష్టంగా పనిచేయడమే సాఫల్య సిద్ధికి ఏకైకోపాయం. మనిషికి స్వార్థపరత్వమంటే అల్పత్వమన్నమాటే.

ఎవరెస్టును మళ్ళా ఎక్కడం జరుగుతుందా అని మాటిమాటికి నన్ను అడుగుతూవుంటారు. తప్పకుండా జరుగుతుం

దంటాను. ఒక నాటికి నేపాలు వైపునుంచే కాదు టిబెట్టు వైపు నుంచికూడా ఎక్కడం జరుగుతుంది. ఒక వైపునుంచి ఇంకో వైపుకు దాటడంకూడా జరుగుతుంది. ఆక్సిజన్ లేకుండా సాధ్యపడుతుందా అని ఇంకో ప్రశ్న. అది కష్టమే. తగినంత సన్నాహంవుండి సరైన అవకాశాలు ఏర్పడితే సాధ్యపడవచ్చు. అయితే 1953 యాత్రలోని తొమ్మిదో మకాంకున్నూ శిఖరానికిన్నీ మధ్య ఇంకొక ఎత్తు మకాం పెట్టుకోవాలి. ఆరోహకులు శక్తిగావు కనుమనుంచి శిఖరానికి ఎక్కి ప్రాణాలతో దిగిరావాలంటే వరసగా నాలుగురోజులు వాతావరణం అనుకూలంగా వుండాలి. ఎవరెస్టు వాతావరణాన్ని అదుపులో వుంచడం మనిషికి కాదుకదా దేవతలకుకూడా సాధ్యంకాదు.

ఇక ముందు నేను ఎవరెస్టు ఎక్కుతానా అంటే ఎక్కనని నా జవాబు. వేరే చిన్న పర్వతాలు ఎక్కడం మాత్రం వుంటుంది. ఎవరెస్టు పైకిగాని, హిమాలయాల్లో ఉన్నత శిఖరాలు వేటిపైకిగాని ఎక్కేవాడు ఆరోహకుడుగానూ సర్దారుగానూ కూడా వుండడం దుర్ఘటం. ఆలాంటి అగ్నిపరీక్ష నా జన్మకు అదే చిట్టచివరిది. 1953 లో ఎవరెస్టును ఎక్కడమో మరణించడమో అని పెట్టుకున్నాను. నేను పడిన ప్రయాసకు తగిన విజయం చేకూరింది. నాకు సలక్షణంగా ప్రపంచం శిఖరాలన్నైన మక్కువ పడడం పోయింది. కాని పర్వతాలకు మళ్ళా వెళ్ళకపోను. అవి చిన్న యాత్రలుగానే వుంటాయి. ముఖ్యంగా నా మిత్రుడు రేమండ్ లాంబర్టుతో పర్వతారోహణ చేయాలన్న కోరిక ఇంకా వుంది నాకు.

పర్వతారోహణకాక దేశయాత్రలు చేయాలని నా కోరిక. ఈ గ్రంథం వెలువడగానే అమెరికా వెళ్ళాలని ఆశిస్తున్నాను.

మళ్ళా ఇంగ్లాండు స్విట్జర్లాండు వెళ్ళాలని వుంది. ఆ దేశాల్లో నాకిచ్చిన స్వాగతం అద్భుతమైంది. ప్రపంచం అతి విశాలమైంది. ఒక్క మూల కూర్చొని ప్రపంచాన్నంతా చూడలేవు. ఎక్కడ బట్టినా మంచీ చెడూ రెండూ వున్నాయి. సంకుచితములైన దురభిమానాలు జాతీయ దురహంకారాలు ఎక్కువ అపకారాన్ని చేస్తున్నాయని నా నమ్మకం. ఎవరెస్టు ప్రపంచానికంటే పెద్దది. ఎవరెస్టు దగ్గర సహనానికీ సామరస్యానికీ తప్ప వేరొక దానికి స్థానం లేదు.

ఎవరెస్టు శిఖరారోహణ ప్రయత్నంలో ఎన్నో కష్టాలు కలిగాయి. కాని ఆ ప్రయత్నం ఆ విజయం సర్వప్రపంచానికి చెందింది. సాధించిన విజయంలో పోల్చిచూస్తే ప్రయత్నంలో కలిగిన కష్టాలు లెక్కించ దగినవి కానే కావు. హంట్. హిల్లరీ, ఇంకా ఇతర ఆంగ్లేయ మిత్రులందరికీ ప్రపంచం ఈవలినుంచి ఆవలికి నా చేతిని అందిస్తున్నాను.

ధుజి చే – చోమోలుంగ్మా! నీ [illegible] – [illegible]

*